# భారతి

సాహిత్య మాసపత్రిక

అక్టోబరు : 1989

వెల : 5 రూపాయలు





వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# స్వాస్
## మింట్స్




అమృతాంజన్ లిమిటె
వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited**

# భారతి


మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 66 అక్టోబరు 1989 సంచిక : 10

విడిపత్రిక వెల ఐదు రూపాయలు


## విషయానుక్రమణిక

# స్వ విషయం

"మన పురాణాలలోని జాంతవ వంశాల" గురించి శ్రీ కపిలవాయి లింగమూర్తి ఈ మాసం భారతిలో సంక్షిప్తంగానే అయినప్పటికీ సమగ్రంగానే చర్చించారు.

వాల్మీకో వల్మికోత్పత్తిః అగస్త్యః కుంభ సంభవః
నారదో రజకీపుత్రః కౌండిన్యో ముండకీ సుతః—

వంటి వశిష్టోప పురాణ శ్లోకాలను వింటూ ఉంటే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. ఈ ఆశ్చర్యానికి కొంతవరకైనా వివరణను ఇవ్వడంలో శ్రీ లింగమూర్తిగారు కృతకృత్యులయ్యారనే చెప్పవలసి వస్తుంది.

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారి విశిష్ట కావ్యం "కుమార భారతి"లోని అభిషేక ఘట్టాన్ని గురించి డా॥ హనుమంతప్ప ఈ నెల భారతిలో మనోజ్ఞంగా ప్రదర్శింపజేసారు.

సకల త్రైలోక్య ధర్మ సంస్థాపనమున
బూనియున్నట్టి కౌమరు నా మూర్ధపదము
విమల జల నేత్ర తల్లి చుంబించినట్లు
తరళ జలమూర్తి శ్రీ గంగ దబకలాడె—

— వ్యాసరచయిత అన్నట్లు నన్నయ్యను గుర్తుకు తెచ్చే కవిత్వాభిషేకమే!

ఇకపోతే ఈ సంచికలో అనుభూతి కవిత్వం గురించి శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు తమ వాదాన్ని వినిపింపజేసారు. "ప్రతీకవాదుల సంప్రదాయానికి సంబంధించిన అన్వయ క్లిష్టత కనిపించకూడదు. సంప్రదాయ కాల్పనికవాద ఛాయలు సోకకూడదు. పదచిత్రాలతో, భావ సంక్షిప్తతతో కూడుకున్న ఇమేజిస్టు శిల్పంలాగా ఉండాలి అనుభూతి కవిత్వం" అనే అర్థం స్ఫురిస్తుంది వ్యాసంలో. అసలు ఈ వివరణే గందరగోళంగా తోస్తుంటే – ఇక అనుభూతి కవిత్వం జోలికి వెళ్ళకూడదనిపిస్తుంది. సాహిత్య విమర్శకుల ధోరణిలో ఇదో రకం– అని అనుకోవాలేమో!

డా॥ పెన్నా శివరామకృష్ణ గారు శేషేంద్ర కవిత్వంలో దర్శించిన సామాజిక చైతన్యాన్ని గురించి ఈ నెల భారతిలో ఒక వ్యాసం ఉంది.

రైతు నాగలి మోస్తున్నాడు
క్రీస్తు శిలువ మోసినట్లు -

వినడానికి బాగుంది. కాని వాస్తవానికి ఈ పోలిక తగినదేనా అని సందేహం. ఇలాంటి అనుమానాలు వదలిపెడితే ఈ కవిత్వంలో ఎంతయినా నిజాయితీ కనిపిస్తుంది.

ఇలాంటివి మరెన్నో. కవిత్వం, విమర్శ, గ్రంథసమీక్షలు మామూలే. "ఆ దినపు వేట" అనే శ్రీ త.రా.సు.గారి కన్నడ కథను కూడా ఈ మాసం అందిస్తున్నాము.

విశ్వసాహిత్య సామగ్రికి భారతి సాధనం కావాలనే మా ఆకాంక్షకు అందరి సహకారాన్నీ కోరుతున్నాము.

# ఈ రోజున, దారి అదే!

## శ్రీ మాదిరాజు రంగారావు

ఈ రోజున అదే దారిన
నిప్పంటిన వనం మాదిరి
ముఖ ముఖంలో మేల్కొన్న చిత్రం వేరు
క్షణ క్షణంలో స్పందించు దృశ్యం వేరు.

కదలుతూంది జ్వాలా చరణం
పద పదాన ఛాయా ధ్వనితో
చీకటి వరుగెత్తుతూంది
మంచు చెదరి రాలుతూంది.

ఏ అపాయ భయం లేదు
ముందు కెళ్ళు హతం తప్పు,
సామాజిక భావన తప్పించి
ఏ కల్పనకూ సమయం కాదు.

భయ నిద్ర వదలిన ఆలోచనతో
నవ జీవన దశల అన్వేషణతో
మూసిన తలుపుల్ని ముక్కలు చేసేను
దాగిన బతుకుల్ని బైటికి లాగేను.

ఎక్కడ ఉంది? సంపూర్ణ సత్యం
ఎక్కడి కక్కడే ఖండ ఖండం,
స్వేచ్ఛకూ సమతకూ అంకితమై జీవితం
విశ్వమానవతకై శాంతిని కోరే గణం.

నవ సంఘర్షణతో ప్రతిరోజు
ఉదయం ఎట్టెదురై నిలిచేను
అసహనం అశాంతి కన్నీళ్ళనుండీ
పగలు దాటి రాత్రినుండీ ప్రయాణం

హిమపర్వత ప్రాంతమైనా
జల లేని ఎడారి ఐనా
నగరంలో వనంలోనూ మెషిన్ గన్
వినిపించే విషాదం ఒక్కటేగా!

తుపాను వస్తుందెపుడో సర్వం బీభత్సంగా
అశాంతి మేఘం ఉరిమీ కోపంతో పోతుంది.

కదలి పదం చేయి కలిపి నవతరం
గగన భయం శీర్ణ పరచి యువగణం
అవనిపై అందరికీ ఆనందం సౌభాగ్యం
సమ సమాజం వెలిగే ఆ స్వర్గం ధ్యేయంతో,
సమయం వరమై తమ ముంగిట నిల్చినా
ప్రతి వ్యక్తికి శిక్షణ! ఆతని సంకల్పమే.

తన ముఖాన్ని బింబించే అద్దాన్ని
పగలగొట్టే చేతుల్లో కన్నీరు!
గుర్తుకు తెస్తూ భౌతికంతో,
మానసికంగా గుప్తరూపం!

మానవతా పూర్ణమైన కంఠధ్వనిలో
పాయలుగా భిన్న దేశ జాతిస్వరమూ
ఏ వ్యక్తి నీడనో
ఏ ఊరు సీమనో
ఆగిపోవు
యాత్ర కాదు.

చీకటిపై అడుగు వేసి
సూర్యుని జాడలు మిగిల్చి,
వేగంగా పాతదనం నిష్క్రమణం
జీవంతో కొత్తదనం ఆగమనం

మనిషి గుండె పల్కుతూంది
మనిషిలోని మట్టితోను
ఈ విశాల పృథ్విపై
మానవీయ రక్తితో
మట్టిలోని మొక్కతో
వ్యక్తిలోని శక్తితో
ఎంతటి స్వర్ణ స్వర్గ భావన అయినా కానీ
మానవ పాదధూళినుండి అవతరించిందే
ఈ ఉదయం చేతిలో పండూ కావచ్చు!
ఎత్తిన గన్ గుండెతో సిద్ధం కావచ్చు

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# మన పురాణాలలోని జాంతవ వంశాలు

ఋష్యశృంగో మృగేజాతః కౌశికో గాధినందనః
జంబుకో జంబుకోత్పత్తిః గౌతమో గోశసంభవః
శునకీగర్భ సంభూతో శౌనకాద మహర్షయః
వాల్మీకోవల్మికోత్పత్తిః అగస్త్యః కుంభసంభవః
నారదో రజకీపుత్రః కౌండిన్యో ముండకీసుతః
వ్యాసార లుబ్ధకసంభూతో వశిష్ఠో ఊర్వశీసుతః
సత్యకామాస్తుజాబాలా శ్వపాకాస్తు పరాశరః
బహవన్యోపివిప్రత్వం ప్రాపయే పూర్వమద్విజః

వశిష్ఠోప పురాణంలోనివని చెప్పబడే ఈ శ్లోకాలలోని జన్మవ్యవస్థ గమనించదగింది. బెస్తదాని కొడుకైన వ్యాసుడు, దేవవేశ్యా కుమారుడైన వశిష్ఠుడు, రజక స్త్రీ పుత్రుడైన నారదుడు, నాపిత సుతుడైన కౌండిన్యుడు జాబాల కొడుకైన సత్యకాముడు చండాలి కొడుకైన పరాశరుడు తమ తమ విద్యా తపోబలాలతో విప్రత్వాన్ని పొందవచ్చు. ఈనాడు నిమ్న జాతుల వారెందరో పెద్ద పెద్ద డిగ్రీలు పొంది ఉన్నత పదవులలో ఉండటం మనం చూస్తూనే ఉన్నాం కాని వాల్మీకి పుట్టలోనూ అగస్త్యుడు కడవలోనూ పుట్టటం మాత్రం ప్రకృతి విరుద్ధ మనిపించక తప్పదు.

ఈలాగే వశిష్ఠుడు ద్రోణుడు, కలశాలలో కుమారస్వామి, కృపాచార్యులు రెల్లు గంటలలో పుట్టినారు. అయితే ఈనాడు టెస్ట్‌ట్యూబ్ బేబీల యుగం వచ్చేసింది కాబట్టి ఆనాటి అగస్త్యాదుల జననం ఒకవిధంగా అంగీకరించినా క్రోష్టి నక్కకు, గౌతము డావుకు, మాండవ్యుడు కప్పకు, గార్గేయుడు గాడిదకు, శౌనకులు కుక్కకు పుట్టటం మాత్రం విడ్డూరం.

మన శాస్త్రజ్ఞులింకా జంతువులకు మానవులను పుట్టించే వరకు రాలేదు కాని మన పురాణాలలో యిటువంటివారింకా చాలా మంది కనిపిస్తారు.

మహిష్మతి అనే రాకుమారి శాపవశంగా గేదెయై ఒక వనంలో తిరుగుతూ ఉండగా సింధు ద్వీపుడనే మహారాజు అక్కడ గల కొలనికి స్నానానికి వచ్చినాడు. అపుడా సరస్సులో అతని రేతః పతనమైన జలాన్ని త్రావి మహిష రూపంలో ఉన్న రాకుమారి మహిషుని కన్నది.

మరో కథ ప్రకారం రంభుడనే రక్కసు డతి కాముడై సంచరిస్తూ ఒకనాడొకచోట ఒక గేదెను చూచి దానితో రమించగా మహిషుడు పుట్టినాడు.

విభాండక మహర్షి ఒక నదిలో స్నానం చేస్తుండగా అక్కడికి ఊర్వశి వచ్చింది. ఆమె సౌందర్యాన్ని చూసి అతనికి రేతఃపాతం జరిగింది. అపుడక్కడికి శాపవశంగా జింకయైన చిత్రరేఖ వచ్చి ఆ నీటిని త్రాగి ఋష్యశృంగుని కన్నది.

ఉపరిచర వసువు ఒకప్పుడడవికి వేటకు వెళ్ళి ఆ వన సౌందర్యం చూడగా ప్రియురాలు తలపించి స్ఖలనం జరిగింది. అపుడు తన వీర్యాన్నతడు ఒక దొప్పలో ఉంచి డేగతో భార్యకు పంపుతూ ఉండగా దారిలో అది యమునా నదిలో వ్రాలికి అప్పుడందులో శాపవశంగా చేపయై తిరుగుతున్న అద్రిక అనే అప్సరస త్రాగి మత్స్యగంధిని కన్నది.

మేరువుకు దక్షిణాన గల శతయోజన వనంలో ఉన్న కొలనుకు - ఒకపుడు గర్గముని స్నానానికి వెళ్ళి అంతవరకక్కడ స్నానమాడుతూ ఉన్న అప్సరసల సౌందర్యాన్ని చూసి స్ఖలించినాడు. అపుడా నీటిలో పడిన అతని వీర్యాన్ని ఒక చేప మ్రింగి విశ్వరూపుని భార్యయైన మీనాదేవిని కన్నది.

అదే గర్గమహర్షిని ఒకపుడు యాదవులు నపుంసకుడని హేళన చేయగా అతడు లోహచూర్ణం తింటూ పన్నెండేండ్లు ఒక ఆలమందలో ఉండి తపం చేసినాడు. అపుడతనికి ఒకనాడు రేతః పతనం జరిగింది. దాన్ని అక్కడ అజగర రూపంలో ఉన్న ఒక గోపాలిక ఆహారమని భక్షించి కాలయవనుని కన్నది.

ఒకపుడు వసువుల కూతురు గుణవతిని దేవతలు మతంగ ముని తపోభంగానికి పంపినారు. అపుడామెనతడు కినిసి ఏనుగవు కమ్మని శపించినాడు. ఆమె గజమై హిమవత్ప్రాంతంలో సంచరిస్తు సామగాయనుడనే ముని విసర్జించిన మూత్రంలోని వీర్యాన్ని గ్రహించి పాలకాప్యుడనే గజ శాస్త్రవేత్తను కన్నది.

—ఈనాడు డాక్టర్లు మూత్రంలో పతనమైపోయే వీర్యాన్ని వడకట్టి స్త్రీలకు సంతానప్రాప్తిని కలిగిస్తారట కాని అది వేరే విషయం.

సంజ్ఞాదేవి సూర్యుని తాపాన్ని భరించలేక ఉత్తర కురు భూములకు వెళ్ళి బడబా రూపంలో సంచరిస్తుండగా సూర్యుడామెను వెదకుతూ వెళ్ళి కలసికొని రమించినాడు. అపుడు వారికి అశ్వినులు, ఆ పిమ్మట రేవంతుడు అనే అశ్వశిక్షకుడు కలిగినారు.

లంకను కాల్చిన పిమ్మట సముద్రాన్ని దాటివస్తున్న హనుమంతుడు తన వంటి చెమటను తుడిచివేయగా సముద్రంలో పడిన ఆ స్వేదాన్ని ఒక మొసలి మ్రింగి మత్స్యవల్లభుని కన్నది.

ఆత్మదేవుని భార్య దుంధుల సంతానార్థమై తనకిచ్చిన రసాల ఫలాన్ని తమ దొడ్డిలోని ఒక ఆవుకు తినిపించగా అది గోకర్ణుడనే కుమారుని కన్నది.

శాతవాహనుడు శాపవశంగా సింహాలైన ఒక మునికన్య యక్ష దంపతులకు పుట్టినాడు. ఇవన్నీ పురాణ కాలంనాటి బీజ వ్యాప్తి చరిత్రలు.

మన పురాణాలలోని ఈ కథలీనాడు ఎంత ప్రకృతి విరుద్ధమో అంత హాస్యాస్పదంగా కూడా కనిపిస్తవి. అయితే వీనిలో గ్రుడ్డిలో మెల్లలా గమనించదగిన విషయం ఒకటి ఉంది. ఋష్యశృంగాదిపైని చెప్పిన సంతానాన్నంతా కన్నవారు అచ్చంగా జంతువులు కారు. శాపకారణంగా ఆయా రూపాలు పొందినారు.

కర్మవశంగా లేదా శాపవశంగా మానవుడు జంతువై పుడతాడనే సిద్ధాంతాన్ని ఈనాడు కొన్ని మతాలంగీకరించవు కాని ఈ కాలంలో పెద్దబొట్టు శారదాదేవిగారి స్వీయచరిత్రలో ఉన్న సుబ్బన్న పాము కథ ఒకటి దీనికి సత్యోదాహరణంగా కనిపిస్తుంది.

ఋగ్వేదంలో శతరూపాస్వాయంభవుల ప్రసక్తి ఉంది. శతరూప వివిధ రూపాలు ధరించగా స్వాయంభువామెతో కోరిన రూపంలో రమించినాడు. అపుడామె ఏయే రూపాలు ధరించిందో వారి కాయారూప సంతానం కలిగింది. లోకంలో ఈ విధంగానే మొదటిసారిగా వివిధ ప్రాణి ఉత్పత్తి జరిగిందని చెప్పబడింది.

పురాణాలు స్వాయంభువమను స్థానంలో కశ్యప ప్రజాపతిని నిలిపినవి. అతని భార్యలలో పదముగ్గురు ప్రసిద్ధులు. వారందరూ దక్షకన్యలు. వారిలో కొందరికి దేవజాతులు కలుగగా మరికొందరికి తిర్యగ్జాతులు పుట్టినవి కాబట్టి అతని భార్యలను రెండు వర్గాలుగా విభజించవచ్చు.

అ) అదితికి-దేవతలు — దితికి-రక్కసులు
కపిలకు-ఘృతాచీ మేనకలు — కాలకు-వినాశక్రోధలు-
దనువుకు-దానవులు — మునికి-భీమసేన-ఉగ్రసేనులు
అనాయువుకు విక్షరుడు, బలుడు, వృత్రుడు - వీరుడు అనువారు కలుగగా

ఆ) ఇలకు-వృక్షలతాదులు — కాష్టకు-ఏకశపాలు
కద్రువకు-నాగులు — తామ్రకు-భాసాదులు
తిమికి-జలచరాలు — వినతకు-గరుడులు
సరమకు-శ్వానాదులు — సురభికి-గోమహిషాదులు

పుట్టినట్లు చెప్పబడింది. అయితే ఎప్పుడైనా మానవులకు జంతువులు కాని, జంతువులకు మానవులు గాని పుట్టడం ప్రకృతి విరుద్ధం.

ఒకపుడు హైదరాబాదులో మేక కడుపున సగం మనిషి సగం మేకగా ఉన్న నిసుగు పుట్టినట్లు, బీహార్ రాష్ట్రంలోని ఒక గ్రామంలో పీత కడుపులో మూడంగుళాల మానవ శిశువు వున్నట్లు పత్రికలలో వార్తలు వచ్చినవి కాని అంతమాత్రంచేత తిర్యక్కులకు మానవులు పుడతారనలేం. నేటి పరిశోధకులకు తోడేళ్లు ఎత్తుకుపోయి పెంచిన మానవబాలురు కొందరు లభించినారు. వారు తోడేళ్లవలెనే అరుస్తూ పచ్చి మాంసం తింటూ చేతులను గూడా కాళ్లుగా ఉపయోగించుకుని నడిచినారు. కాని వారు జంతువులుగా పరిగణింపబడలేదు.

సర్కసులలో మనకు చాలా విచిత్రమైన మనుష్యులు దర్శనమిస్తుంటారు. క్రీ. శ. 1884లో బి. టి. బర్నుగారి సర్కస్‌లో "జోజో" అనే కుఱ్ఱవాడుండేవాడట. అతని శరీరం నిండా బొచ్చుకుక్క రోమాలుండేవట. జర్మనీలోని మరో సర్కస్‌లో "లియోనస్" అనే మరోవ్యక్తి ఉండేవాడట. ఆయన ముఖంనిండా జూలు పెరిగి అచ్చంగా సింహంలాగా కనిపించేవాడట. మరో సర్కస్‌లో "జూలియాబస్త్రావా" అనే ఒక స్త్రీ ఉండేదట. ఆమె నల్లగా శరీరంనిండా రోమాలతో అచ్చంగా గొరిల్లాలాగే ఉండేదట.

ఇపుడు మనలో పిల్లికండ్లు - గద్దముక్కు - పులిమోర కలవారున్నారు గాబట్టి ఆనాటి కశ్యపుని సంతానంలో గూడా ఈలాటి జంతు లక్షణాలు కొన్ని ఉండిపచ్చు. అంతమాత్రంచేత వారిని మనం ఈనాడు పూర్తిగా జంతువులేనని తీర్మానించలేం.

సృష్టిలో మానవుడు జంతుకోటిలో పరాంకోటికెక్కి బుద్ధిబలంలో ఎంత ముందుకు పోయినా సౌందర్యంలో మాత్రం యింకా జంతువులతో పోటీ పడలేకనేపోతున్నాడు. లేడికండ్లు-

చిలుక పలుకులు, కోకిల కంఠం, సింహం నడుము, ఏనుగు నడక, ఒంటెపిల్ల తొడలు, తాబేటి పాదాలు అని అందానికి జంతువుల పోలికలనే చెప్పుకోక తప్పటం లేదు.

ఈనాడు అగ్రజాతుల వారందరికీ ఋషిగోత్రాలున్నవి. అవి నష్టమైనవారికి ఏ వృక్ష జంతువాచకాలో గోత్రాలుగా స్థిర పడినవి కాని నేటి పరిశోధకులు అశ్వలాయన శ్రౌత సూత్రాల లోని అనేక గోత్రాలను ఋషివాచకాలు కాక - వత్స=దూడ, శునక=కుక్క, రిక్క=ఎలుగుబంటి, భరద్వాజ=ఏట్రింత, ముద్గల=ఎట్టిచేప, కపి=కోతి, అజ=మేక, కాశ్యప=తాబేలు, గౌతమ=గోవు, కుశిక=గుడ్లగూబ, మండూక=కప్ప, తిత్తిర= తీతువు అని పశు పక్షి వృక్ష లతావాచకాలుగానే అభిప్రాయపడు తున్నారు. కాబట్టి పైన చెప్పబడిన కశ్యపుని సంతానం ఆయా ప్రాణులను తమ గణ సంకేతాలుగా స్వీకరించి, ఆరాధించి లేదా తమ లాంఛనాలుగా ధ్వజ చిహ్నాలుగా స్వీకరించి వాని పేర చలామణి అయినవారనవలసి ఉంది.

ఈనాడు బాలభట విద్యార్థులు తమ దళాలను జంతువుల పేర్లతోనే సంకేతించుకుంటారు. అందుచేత ఆనాటి కశ్యప మహర్షి సంతానాన్ని గూడా ఈ దృష్టితోనే చూడవలసి ఉంది. అపుడు మన కందులో ఉన్న అసంగతం తొలగిపోతుంది.

ఈనాడు మనకు తెలిసే రాజవంశాలలో కదంబ - శాక్య అనే వృక్షవాచకాలతో గర్దభ, మతంగ, మత్స్య-మూషక అనే జంతు వాచకాలతో ఉన్న తెగలు కనిపిస్తున్నవి.

కశ్యప ప్రజాపతి భార్యలలో ఇలా దేవికి కలిగిన సంతాన మంతా వృక్షలతాదులు. ఇక్కడ ఇలా దేవి పేరు వృక్షలతాదులు పుట్టటానికి కారణమైన భూమికి సంకేతంగా కనిపిస్తుంది. ఈమెకు ఇడాదేవి అని మరో పేరు గూడా ఉంది. సంస్కృత డకారం తెలుగులో దకారం అవుతుంది. తెలంగాణంలో ఇదమ్మ ఒక చాలా ప్రాచీనమైన గ్రామదేవత. ఇదమ్మకు సంబంధించిన కథలు సృష్టికంతా ఆమెనే మూలదేవతగా చెబుతవి. అందుచేతనే కాబోలు ఆమె జాతరలు ఎపుడైనా శ్రావణంలో జరుగుతవి.

జ్యోతిష్కులు సంవత్సరం చైత్రంలో ప్రారంభ మౌతుంది అంటే లోకయాత్రావేత్తలది శ్రావణంలో ప్రారంభం అంటారు.

అగ్రవర్ణాలలోని వివాహాది శుభకార్యాలలోని నాందీ ముఖంలో ఇడా వాచనం ఒకటి ఉంటుంది. అది దేవతానుమోద నార్థం పఠించబడుతుంది. అపుడు గేస్తులు కులదేవత పేర తమ తమకు నిర్ణయమైన ఒక వృక్షశాఖనే తెచ్చి దానికి వసుపు గుడ్డ చుట్టి పూజిస్తారు కాబట్టి ఇడావాచనంలో జరిగే ఈ కులదేవత ప్రతిష్ఠ కశ్యపుని భార్య యిలాదేవికి సంకేతంగానే కనిపిస్తుంది.

హరప్పా త్రవ్వకాలలో లతనుకంటున్న ఒక దేవతా ప్రతిమ లభించింది. ఆమె ఈ యిలాదేవియే కావచ్చు.

వృక్షవాచకాలతో వచ్చినవానిలో ఉత్తర భారతంలో శాక్య వంశం దక్షిణ భారతంలో కదంబ వంశం ప్రసిద్ధి చెందినవి.

శాక్యవంశంలోని బుద్ధుడు ఒక మతస్థాపకుడై ప్రపంచ ప్రసిద్ధిని పొందితే దక్షిణ భారతంలో కదంబ వంశస్థాపకుడైన మయూరశర్మ తెరకెక్కిన పురుషుడైనాడు. ఇక తక్కిన వంశాల వారి వివరాలు పరికించండి.

**1. సైంహికేయులు :-**

అంటే సింహ సంబంధమైనవారని అర్థం. వీరు ఆ పేరు గలవారి సంతానంగాని లేదా ఆ పేరుగల వంశానికి చెందినవారు గాని లేదా ఆ లాంఛనం కలవారు కూడా కావచ్చు.

మన పురాణకోశంలో సైంహికేయులు అన్నపుడు వాతా పీల్వలులు, రాహు కేతువులు దర్శనమిస్తారు. హిరణ్యకశిపుని సోదరి పేరు, కూతురి పేరు రెండూ ఒకటే. అది సింహిక. తెలుగులో ఇది సింగమ్మగారికి సమానం.

పై వారిలో వాతాపి-ఇల్వలులు హిరణ్యకశిపుని మేనల్లుండ్రు. రాహు కేతువులు అతని మనుమలు అవుతారు. ఇక ఈ పేరును గణసంకేతంగా లేదా వంశసంకేతంగా గ్రహించినపుడు, రఘు వంశంలో హిమాలయ సానువులలో నందినీ ధేనువును పట్టుకున్న కుంభోదరుడు ఈ తెగకు చెందుతాడు. అతడొక యక్షుడు. శివుని సేవకుడు. యక్షులు కామరూపులు కాబట్టి దిలీప మహారాజును పరీక్షించటానికి ఆ రూపంలో కనిపిస్తాడు.

యక్షులలో సింహగోష్ఠి కూడా ఒకటి ఉంది. అలాగే ఆ పేరున ఒక వంశం కూడా ఉండవచ్చు కాబట్టి కుంభోదరుడు ఆ వంశానికో లేదా ఆ గణానికో చెందుతాడు.

మన చరిత్రలో ప్రప్రథమాంధ్ర రాజ్యనిర్మాత శాతవాహ నుడు ఒక సింహ దంపతుల కుమారుడు. అతడు ఒకనాడు వేటలో దీపకర్ణి మహారాజుగారికి లభించినాడు.

శాతవాహనుని తండ్రి సాతుడొక యక్షుడు. తల్లి ఒక మునికన్య, వారిద్దరు వలచి వివాహం చేసికోగా దానికంగీకరించని మునులు వారిని సింహాలు కండని శపించినారు.

ఏ కాలంలోనైనా వ్యక్తులు తామంతవరకున్న కులమతాల నుండి బహిష్కృతులైనపుడు మరో వర్గంలో చేరటం పరిపాటి. పురాణ ప్రకారం గుహ్యకులు యక్షులు కుబేరుని ప్రజలు. సాతుని కాలంనాడు ధాన్యకటకాన్ని కుబీరకుడనే యక్షరాజు పరిపాలిస్తున్నాడు. అతడు సింహగోష్ఠికి అధిపతి. అది ఆ కాలంలో ఏర్పడిన ఒక నూతన సంఘం కావచ్చు.

సాతుడు-అతని ప్రియురాలు మునుల శాపంతో సింహాలైనారు అంటే స్వకులభ్రష్టులైన వీరానాడు కుబీరకుని సింహగోష్ఠిలో చేరినారని భావించవలసి ఉంది.

సాధారణంగా తలిదండ్రి వర్ణభ్రష్టులైనపుడు వారికి కలిగిన సంతానం ప్రతిభావంతులు పరాక్రమశాలులు అయితే ఆ తలిదండ్రి కళంకం మాసిపోతుంది. అదే మన పురాణ కథలలో పుత్ర ముఖ దర్శనంతో శాపావధిగా చిత్రించబడింది.

మన చరిత్రలో నందులకంటే మొదట మగధ సామ్రాజ్యాన్ని హర్యంక వంశీయులు పాలించినారు. బింబసారుడు, అజాతశత్రువు అదే వంశానికి చెందిన రాజులు. హరి అంటే సింహం కాబట్టి (హరి+అంకం) వీరు సింహలాంఛనులు కాని లేదా ఆ పేరుతో ప్రసిద్ధి చెందినవారుగాని కావచ్చు.

ఇక నందవంశం పిమ్మట వచ్చినవాడు బిందుసారుడు. చంద్రగుప్తుని కుమారుడైన యితనిది మౌర్య వంశం. ఈ వంశ నామాన్ని గురించి చారిత్రకులలో భిన్న భిన్న మతాలున్నవి. కొందరు చంద్రగుప్తుని తల్లి "ముర" అనే శూద్రస్త్రీ పేర ఆ పేరు ఏర్పడింది అంటే మరికొందరు "మౌర్య" అనే గ్రామం పేర ఏర్పడిందని, మరికొందరిది "మయూర" శబ్దరూపమని అన్నారు. అశోకుడు అంత ప్రసిద్ధ చక్రవర్తియైనా అతని వంశోత్పత్తి మాత్రం ఈ విధంగా సందేహాలతో ఉంది.

కళింగయుద్ధంతో పరమ శాంతుడైన అశోకుడు ఢిల్లీలో నిలిపిన స్తంభంపై నాలుగు సింహాలను నిలుపటం గమనార్హం. సింహం శాంతానికి సంకేతం కాదు గదా!

2. సృగాల వంశం :-

ఇపుడు మనకు ఒకే యింటి పేరుతో అన్ని వర్ణాల వారు కనిపించినట్లు పురాణాలలో ఒకే వంశంలో దేవతలు-రాక్షసులు - ఋషులు - మానవులు అనే అన్ని వర్గాలవారు కనిపిస్తుంటారు.

మార్కండేయ మహర్షిచేత అనేక ధర్మాలు తెలిసికొని విజ్ఞానియైన క్రోష్టుకి ఈ వంశానికి చెందిన ఒక ప్రసిద్ధ ఋషి.

మహాభారత కాలంనాటికే సృగాలవంశం బాగా ప్రసిద్ధి చెందింది. ఈ వంశంలోని వాసుదేవుడనేవాడు శ్రీకృష్ణునితో వైరం సాధించి వధింపబడినాడు కాని యాదవులతో పగ పెంచుకోవటం అంటే ఆ దినాలలో ఒక సామాన్యునితో అయ్యే పని మాత్రం కాదు.

3. శౌనకులు :-

మాయా కిరాతుడైన శివునివెంట, దత్తాత్రేయ రూపం ధరించిన విష్ణువు వెంట నాలుగు వేదాలు శునకరూపం ధరించి అనుసరించినవి కాబట్టి శౌనక గణమంతా ఉత్తమమైన బ్రాహ్మణులై తపస్స్వాధ్యాయ నిరతులై నైమిశం ఆటపట్టుగా నివసించి, అక్కడ ద్వాదశవర్షయాగం తలపెట్టి సూతమహర్షితో సమస్తమైన పురాణాలు భక్తిశ్రద్ధలతో విన్నారు. అందుచేత మనకిపుడే పురాణమైనా సూతుడు శౌనకాదులకు వినిపించినట్లే కనిపిస్తుంది. కలియుగం వచ్చిన పిమ్మట మహర్షులు పురాణ ప్రవచనం చేయటానికి యిక అదే ఆఖరు.

ఈ వంశానికి చెందిన సరమ అనే మరో ఆమె యింద్రుని గోపాలిక. ఒకపుడింద్రుడు విద్యుత్తు-సువిద్యుత్తు అనే రాక్షసులను చంపటానికి ఒక యాగం తలపెట్టి కొన్ని గోవులను తెచ్చి ఆమె కప్పగించినాడు. అది తెలిసి దానవులామెను మంచి చేసికొని వాని నపహరించినారు. అపుడది చూచిన యింద్రదూతలా వార్త తమ యజమానితో చెప్పగా అతడు వచ్చి ఈమెను దొక్కలో తన్నినాడు. అపుడు సరమ దానవులు పోసిన పాలు గ్రక్కుకొని యింద్రుని తీసికొనివెళ్ళి వారు గోవుల నెక్కడ దాచినారో చూపింది.

కుక్కలీనాడు విశ్వాసానికి మారుపేరు గాని ఆ వంశానికి చెందిన సరమ ఈ విధంగా ప్రవర్తించటం దురదృష్టం. ఆ వంశానికొక మచ్చ.

ఈ వంశం చాలాకాలం వరకు సాగివచ్చింది. మిక్కిలి ప్రాచీనమయింది కూడా. రామాయణంలో శ్రీరామునితో భిక్షు తాడితమైన ఒక శునకం తన గోడు చెప్పుకుంటుంది. అలాగే జనమేజయుని యాగానికి వచ్చిన సరమ కుమారులను అతని సోదరులు కూడా కొట్టివెళ్ల నడచినారు కాబట్టి ఈ జాతిలో విశ్వాసంతోపాటు ఏదో కొంత దౌష్ట్యం గూడా కనిపిస్తుంది.

4. ఋక్షులు :-

ఆంధ్ర భాగవతంలో చతుర్ముఖు డొనర్చిన యక్ష రాక్షసాది సృష్టిలో ఋక్షులు గూడా ఒకరుగా చెప్పబడినారు. వారిలో ఎలుగుబంటి లక్షణాలు కొన్ని కనిపించవచ్చుగాక! అంత మాత్రంచేత వారు జంతువులు గారు. కానక్కరలేదు. రామాయణాన్ని బట్టి జాంబవంతుడు గొప్ప మూలికా వైద్యుడైనట్లు తెలుస్తుంది. ఇప్పటికీ అడవులలో తిరిగే కోయలు గోండులు ఆ వైద్యంలో ఆరితేరినవారై ఉంటారు.

జాంబవంతుడు చిరంజీవి. బ్రహ్మదేవుని విజృంభణంలో పుట్టి విష్ణువుయొక్క త్రివిక్రమావతారాన్ని చూసి శ్రీకృష్ణునికి తన కూతురినిచ్చిన యితనికి యుగాలు సంవత్సరాలుగా మారిపోయినవి. కనుక ఆదియుగం నుండి ద్వాపరం వరకు ఉన్న జాంబవంతుడొక్కడేనా! వంశం ఒక్కటే కావచ్చు కాని వ్యక్తి ఒక్కడేనని అనలేం.

జాంబవంతుని నివాసం ఋక్షగిరి అని చెప్పబడింది. శ్రీకృష్ణుడతని కూతురు జాంబవతిని వివాహమాడిన వృత్తాంతం శ్యమంతకమణి కథలో వస్తుంది. విష్ణువు నృసింహావతారంలో చెంచితను, శ్రీకృష్ణావతారంలో జాంబవతిని వివాహమాడటం అతడు ద్రావిడులతో స్నేహం చేసి ఆర్య సంస్కృతిని అటవీ జాతుల వరకు ప్రాకించటమే అని చెప్పవలసి ఉంది. అంతేగాదు ఆ రూపంలో వారు వర్ణాంతర వివాహాలను గూడా అంగీకరించి ఆదర్శ పురుషులైనారు.

ఋక్షగిరి ప్రాంతాన్ని నేడు "గోండ్వానా" అంటున్నారు. అక్కడి ప్రజలకు జాంబవంతుడు మూలపురుషుడగునో లేదో, కులదైవం అగునో లేదో కాని తెలుగువారు మాత్రం ఎలుగుబంటిని "ఎలుగుగొడ్డు" అనే అంటారు. తెలంగాణంలో "చిందువారు" జాంబవంతుని కులదైవంగా చెప్పుకుంటారు. వీరు పగలే వీధులలో తమ యక్షగానా లభినయిస్తారు.

5. వానరులు :-

ఋక్షుల పిమ్మట చెప్పదగినవారు వానరులు. రామాయణ కాలంనాడు వర్ధిల్లిన వీరి సంస్కృతీ వికాసాలు అటు లంకలోని ద్రావిడ సంస్కృతికి ఇటు దక్షిణ భారతంలో దాదాపు దీటుగా ఉన్నవి. వీరిని కొందరు వానరకేతు లన్నారు.

ఈ వంశంలో వాలి సుగ్రీవులనే సోదరులు చెప్పదగినవారు. వారి జన్మను గురించి రెండు మూడు కథలు వ్యాప్తిలో ఉన్నా అన్నిటా వారు వానరులుగానే ఉన్నారు.

వానరజాతికి కామం ఎక్కువ. ఇపుడు పుంస్త్వబలం చాలని వారు మర్కటగ్రంధి సూదులు వేయించుకుంటారు. ఈ అతికామ లక్షణం మనకు వాలి సుగ్రీవులలో కనిపిస్తుంది. వాలి సుగ్రీవుని వెళ్ళగొట్టి అతని భార్యను చేపట్టితే శ్రీరాముని సహాయంతో రాజ్యాన్ని భార్యను తిరిగి పొందిన సుగ్రీవుడు అన్నగారి అనంతరం ఆయన భార్యను చేపట్టినాడు.

ఈ వంశంలో వాలి-హనుమంతులిద్దరు మహాబలవంతులు. వాలి ముందెవరు నిలిచినా వారి బలం వెంటనే వాలికి సగం చేరేదట. అందుచేత శ్రీరామునివంటి వీరుడు గూడ అతనిని చెట్టుచాటునుండి కొట్టవలసి వచ్చింది.

ఇక హనుమంతుడు లేని రామాయణాన్ని మనం ఊహించలేం. శ్రీరామునికి అనన్య భక్తుడైన ఈ మహనీయుడు మొదట సుగ్రీవుని బంటు, ఇతడు గొప్ప విద్యావేత్త. వ్యాకరణం చక్కగా చదివినవాడు. సంగీతవేత్త గూడ.

ఇతడు శివవీర్యంతో వాయుదేవుని వరంచేత కేసరి భార్యయైన అంజనాదేవి గర్భంలో జనించినాడు. కర్ణునికి పుట్టుకతోనే కవచ కుండలాలున్నట్లు ఇతనికి పుట్టుకతోనే కౌపీన కుండలాలున్నవి.

ఈ వానర వంశంలో అనేక శాఖలున్నవి. శ్రీరాముని సైన్యంలో నీలుడు అనే వానర విశ్వకర్మ ఉన్నాడు. అతడు సముద్రంపై లంకకు వారధి కట్టినాడు. అతడీ వంశంలో గోలాంగూల శాఖకు చెందినవాడు. గోలాంగూలాన్నిపుడు "కోనెంగ" అంటారు.

ఈ వానర వంశం ద్వాపరం వరకు సాగివచ్చింది. సుగ్రీవుని మంత్రివంశీయులైన మైంద ద్వివిదులను శ్రీకృష్ణుడు సంహరించినాడు.

హనుమంతుని జాతి కోతి యిపుడు కాశ్మీర ప్రాంతంలో ఉందట. దాన్ని "హనుమాన్ బందర్" అని అంటారని దాని నుదుట ఊర్ధ్వపుండ్రాలు ఉంటవని చెబుతారు.

6. ఆశ్వినేయులు :-

సూర్యుని భార్యయైన సంజ్ఞాదేవి అతని తాపానికి సహించలేక ఉత్తర కురుభూములకు వెళ్ళిపోయి అక్కడ బడబా రూపంలో నివసించింది. అపుడు సూర్యుడది తెలిసి ఆమె దగ్గరకు అశ్వ రూపంలో వెళ్ళి రమించగా నాసత్యుడు-దస్రుడు అనే కవలలు కలిగినట్లు మన పురాణాలు చెబుతవి.

కొన్ని పురాణా లతనికి సంజ్ఞా - ఛాయాదేవులతోపాటు బడబాదేవిని గూడా ఒక భార్యగా అంగీకరించినవి. అపుడామె

అశ్వ వంశానికి చెందినది అవుతుంది. అందుచేతనే ఆమె కుమారులు ఆశ్వినేయులైనారు. వీరు ప్రసిద్ధమైన దేవవైద్యులు. వికలమైన శరీర భాగాలను తొలగించి కృత్రిమ భాగాలమర్చటంలో ముఖ్యంగా వాజీకరణ తంత్రంలోను ప్రసిద్ధులు.

రేవంతుడు అశ్వవంశానికి చెందిన ఈ తల్లిగారికే పుట్టినాడు కాబట్టి అనంతరకాలంలో అతడు అశ్వశిక్షలో మొనగాడై శాస్త్రప్రవర్తకుడు గూడా అయినాడు. మధ్యయుగంనాటి ప్రభువులతని పేర తాము "దుష్టతురగరేఖా రేవంతుల"మని బిరుదులు పెట్టుకున్నారు.

దేవ యోనులలో కిన్నర కింపురుషులని రెండు జాతులవారున్నారు. వారిలో కిన్నరులకు అశ్వముఖం కింపురుషులకు అశ్వశరీరం ఉంటవట. అందుచేత వీరు ఈ వంశంలోనే చేరదగినట్లుగా కనిపిస్తారు.

దేవతలలో హయగ్రీవునికి రాక్షసులలో వేదాలు దొంగిలించిన హయగ్రీవునికి, దేవర్షులలో తుంబురునికి, మహర్షులలో దధ్యంగునికి గుఱ్ఱపుతలలే కాబట్టి వీరందరూ కిన్నరులలో చేరవలసినట్లుగానే కనిపిస్తారు.

కిన్నరులు గానవిద్యాప్రియులు, గానప్రవీణులు. ఈనాటి కిన్నెర అనే వాయిద్యం మనకు వారి చిహ్నంగానే మిగిలింది. ఇక రాజవంశాలలో ఆశ్వినేయులు మిగులలేదు కాని అశ్వపతులున్నారు.

**7. గర్దభులు :-**

గాడిద ఈనాడు మనకు హీనజంతువైనా దేవతలలో అది శీతలాదేవికి వాహనం, అశ్వినీ కుమారుల రధానికి రావణుని రధానికి గాడిదలే కట్టబడేవి.

ఈనాడు మనం చదువురాని వానిని "గాడిద" అని తిడతాం గాని పూర్వం వ్రాతకు గాడిదల చర్మాన్నే ఉపయోగించేవారు. అందుచేత వానిపై వ్రాసిన వ్రాతకు ఖరోష్టి లిపి అనే పేరు నిలిచిపోయింది. అశోక చక్రవర్తి కాలంలో దేశ భాషలకు ఆ లిపియే వాడబడేది.

ద్వాపర యుగంలో శ్రీకృష్ణుని బాల్యనాడు బృందావన సమీపంలోని "తాళవనం" "ధేనుకుడు" అనే గర్దభరాజు ఆధీనంలో ఉండేది. అతని సైన్యమంతా గాడిదలు. బృందావనానికి వెళ్ళిన పిమ్మట శ్రీరాముని కోరికపై రామకేశవులా సైన్యాన్ని తాటిచెట్లకు వేసి కొట్టి చంపి పిమ్మట ధేనుకుని వధించినారు.

**8. మాతంగులు :-**

మాతంగ - మూషక వంశాలు చాలా ప్రాచీనమైనవి. మౌర్యులకంటె చాలా మొదట మగధను మాతంగవంశ్యులు పాలించినారు. వారికి మూషకులకు ఎపుడూ పడకపోయేది. ఒక పర్యాయం మాతంగులు మూషకులను చిత్తుగా ఓడించి రాజరధం పట్టించుకున్నారు. చారిత్రకమైన ఈ సంఘటనయే ఈనాడు వినాయకునికి మూషక వాహనంగా రూపొందింది అని ఆధునికుల మతం.

వసువుల కూతురైన గుణవతిని దేవతలు మతంగ ముని తపోభంగానికి పంపిన విషయం మొదట ప్రస్తావించినాను. కాబట్టి దాన్నిబట్టి గజశాస్త్రవేత్తయైన పాలకాప్యుడు గూడా ఇదే వంశానికి చెందినవాడనవలసి ఉంది.

చతుష్పాత్తులలో ఈనాడు వరాహ వంశం కనిపించటం లేదు కాని వరాహ దేశం, వరాహ లాంఛనులైన ప్రభువులు ఉన్నారు. చాళుక్యులు వరాహ లాంఛనులు కాబట్టి వారి కాలం నుండియే మన రూపాయికి "వరహా" అనే పేరు నిలిచిపోయింది.

వరాహ వంశంలాగే, గౌతముడనే ఋషి ఉన్నా గౌతమ వంశం మాత్రం మిగులలేదు. గౌతముని గోత్రం మాత్రం నిలిచింది.

శివుని సేవకులలోని నందికేశ్వరుడు ఈ వంశానికే చెందుతాడు. ఆంధ్రదేశంలోని సామంతరాజ కుటుంబాలలో నంది వంశం కూడా ఒకటి ఉంది.

**9. మహిషకులు :-**

మన పురాణాలలో మహిషుని జననం సింధుద్వీపునినుండి, రంభునినుండి అని రెండు విధాలుగా చెప్పబడింది. అయితే తండ్రులెట్లా ఉన్నా తల్లి మాత్రం మహిష కన్యగానే ఉంది. అందుచేత యితడు మాతృస్వామ్యానికి చెందుతాడు.

ఇక తండ్రుల విషయంలో సింధుద్వీపుడు విశేషణమే గాని సంజ్ఞావాచకం కాదు. కాబట్టి రంభుడే సింధుద్వీపుడు కావచ్చు గూడ.

రామాయణంలో వాలిపై యుద్ధానికి వెళ్ళి సంహరింపబడిన దుందుభి అనే రక్కసు డీదేవంశానికి చెందుతాడు. మొరటుతనం ఈ జాతివారి ప్రధాన లక్షణంగా కనిపిస్తుంది.

ఈనాటి మైసూరు పురాణకాలంనాడు మహిషాసురుని రాజ్యమట. అక్కడ ఉన్న మహిషాసురుని దేవి వధించింది.

అనంతరం ఇపుడా రాజ్యం రూపం మార్చుకుని మహాశూరపురం అయింది.

తెలుగుదేశంలో మహిషమర్దని ప్రతిమలు చాలా ఉన్నవి. మా జిల్లాలో అవి నాలుగు విధాలుగా కనిపిస్తున్నవి. ఇంద్రకల్లులో పూర్వకాయం నరుడు ఉత్తరకాయం మహిషంగా, రామగిరిలో శిరస్సు మాత్రమే మహిషంగా, కందూరులో మానవ శిరస్సుకే మహిష శృంగాలుగా, తీగలపల్లిలో మానవుని వెనుక మహిషం వలువని ఉబ్బెత్తు చిత్రంగా ఉన్నవి. ఇది క్రమంగా శిల్పాలలో వచ్చిన భావపరిణతికి చిహ్నంగా ఉంది. మహిషాసురుడనేది పేరు మాత్రమేగాని వాడు నిజంగా పోతురాజు గాదు అనేది దీని వలన మనం గ్రహించదగిన అంశం.

కళాపూర్ణోదయంలో మహిషాసురుని మేనల్లుడు శల్యాసురుడు చెప్పబడినాడు. అతడభినవ కౌముదిని వెంటాడుతాడు. దీన్నిబట్టి ఆనాడు మహిషులకు శలులకు సంబంధ బాంధవ్యాలుండె నని తలపవచ్చు.

మధురలోని కంసుని ఆస్థానంలో గల చాణూరముష్టికుల శిష్యులలో శలతోసలులున్నారు. ఈ జంటలో శలుడు బహుశః శల్యాసురుని వంశానికి చెందినవాడే కావచ్చు.

10. హరిణకులు :-

తామస మనువు యొక్క తల్లి ఉత్పలావతి, ఋష్యశృంగుని తల్లి చిత్రరేఖ ఈ యిద్దరూ హరిణక వంశానికి చెందిన కన్యలు. ఉత్పలావతి జన్మాంతరం పొందినప్పటికి మళ్ళీ మొదటి భర్తచేతనే కుమారుని కని, చిత్రరేఖ విభాండక ఋషి వీర్యానికి కుమారుని కని శాపవిముక్తి పొందినారు.

మహాభారతంలో పాండురాజుచేత వేటలో కొట్టబడిన గిందమ దంపతులు కూడా ఈ హరిణక జాతికే చెందినవారనే భావించవలె. అందుచేతనే పాండురాజు వారిని జింకలనుకొని కొట్టినాడని కల్పించబడింది. మృగయులు వేటలో జంతువులని భ్రమించి మనుష్యులను కొట్టటంగూడ పరిపాటియే. దానికి రామాయణంలోని దశరధుడు మరో ఉదాహరణంగా ఉన్నాడు.

తెలుగుదేశాన్ని పాలించిన చిన్న వంశాలలో హరిణకులు గూడా ఒకరున్నారు. అంతేకాక బాణులు హరిణ లాంఛనులు.

11. నాగులు

భారతదేశంలో నాగులు మిక్కిలి ప్రాచీనజాతి. వీరొక్క భారతదేశంలోనే గాక ప్రపంచవ్యాప్తంగా ఉన్నట్లు ఈనాటి త్రవ్వకాలవల్ల తెలుస్తుంది. వీరిలో దుర్మార్గులు సన్మార్గులు అని రెండు రకాలవారున్నారు. నన్నయగారు తమ భారత భాగంలోని సర్పయాగ సందర్భంలో దుర్మార్గులను పాములని పూజనీయులను సర్పాలని వ్యవహరించినట్లు శ్రీ దివాకర్ల వెంకటావధాని గారు తమ నన్నయ భారత పరిశోధనమున తెలిపినారు.

నాగులలో చాలా తెగలున్నవి. ఇపుడు ఈ జాతిలో ఇరువదొక తెగలున్నట్లు లెక్కింపబడినారు. కాశ్మీరు లోయలో యిపుడు అనంతనాగ్ - వాసుకినాగ్ - శేషనాగ్ అని ఆనాటి నాగప్రభువులు నివసించిన నగరాలున్నవి. మహాభారత కాలం నాడు తక్షశిల తక్షకుడనే నాగరాజుచేత నిర్మింపబడిన ఒక గొప్ప పట్టణం.

ఈ వంశంలో విష్ణుభక్తులు శివభక్తులు యిద్దరూ ఉన్నారు. అనంతుడు విష్ణువు నాశ్రయించి అతనికి తల్పసేవ పాదుకాసేవ-ఛత్రసేవ చేస్తే వాసుకి శివుని ఆశ్రయించి హారసేవ చేసినాడు.

వాసుకి చెల్లెలు జరత్కారువు గొప్ప యోగిని. ఆమె అన్నగారి కోరికపై జరత్కారు మహర్షిని వివాహమాడి ఆస్తీకుని కని సర్పసత్ర వినాశంనుండి తమ అన్నగారి వంశరక్షణకు కారకురాలైంది.

ఈ వంశంలో ఏలాదేవి ఒక బ్రహ్మవాదిని. ఆమె బ్రహ్మ సభకు గూడా వెళ్లుతూ ఉండేది. తక్షకుడు - అతని కుమారుడు అశ్వసేనుడు, సోదరుడు ఇరావంతుడు ఈ వంశంలో గొప్ప వీరులు. తక్షకుడు తన కుమారుడైన అశ్వసేనునితో కలిసి అన్ని లోకాలు స్వేచ్ఛగా తిరిగేవాడు. ఇంద్రునికి మిక్కిలి మిత్రుడు.

ఖాండవ దహన సమయంలో వీరందులోనే ఉన్నారు. అశ్వసేనుడు తల్లితో తనను తప్పించి తీసుకుపొమ్మని చెప్పగా ఆమె అతనిని ఎత్తుకుని వెళ్లుతున్నది. అది చూచి అర్జునుడు మొదట ఆమె తలను త్రుంచి పిమ్మట అశ్వసేనుని తలనుగూడ ఎగురవేయబోయినాడు. అది చూచి యింద్రుడు అశ్వసేనుని తక్షకుడే అని భ్రమించి - కుమారునిలో తండ్రి పోలికలు ఉంటవి కాబట్టి - అర్జునుడు తక్షకుని చంపుతున్నాడనుకొని తన మాయను ప్రయోగించి అతనిని కనిపించకుండా చేసి కాపాడినాడు.

పరీక్షిత్తు మరణానికి కారణమైన తరువాత జనమేజయుని సర్పసత్రంలో ఆహుతి గాకుండా తక్షకుని యింద్రుడే రక్షించినాడు.

గర్గమహర్షి గుప్తంగా ఆలమందలో ఉండి తపం చేస్తున్నపుడు అతని వీర్యంతో కాలయవనుని కన్న గోపాలిక,

శ్రీకృష్ణుని బాల్యంలో మ్రింగటానికి ప్రయత్నించిన అఘాసురుడు వీరిద్దరు ఈ వంశంలో అజగరశాఖకు చెందినవారు.

అఘాసురుడు బకుని తమ్ముడుగా భాగవతంలో చెప్పబడినాడు. ఇవి కేవలం నామవాచకాలైతే సరేగాని వంశాలైతే మాత్రం కొంగ-కొండచిలువ ఒకే శాఖకు చెందవు. అందుచేత వీరి తల్లులు అప్పాచెల్లెండ్రై వేర్వేరు వంశాలకు వెళ్ళి ఉంటారనుకోవలె.

మహాభారతంలోని భృగువంశ కీర్తనంలో ప్రమద్వర వృత్తాంతం వస్తుంది. ఆమె స్థూలకేశుని ఆశ్రమంలో పెరుగుతూ సర్పదష్టయై చనిపోగా రురుడు ఆ ఆశ్రమంలోని సర్పాలన్నిటిని కొట్టి చంపుతాడు. అపుడతని దెబ్బలకు గురియైన "సహస్రపాదుడు" ఈ వంశంలో డుండుభ శాఖకు చెందినవాడు.

తీర్థయాత్రకు బయలుదేరిన అర్జునుని గంగాతీరంలో చూచి మోహించి తమ లోకానికి తీసికొని వెళ్ళిన ఉలూపి మరో వంశానికి చెందిన నాగకన్య. "ఉలూపి" అంటే ఎఱ్ఱత్రాచు.

ఈ విధంగా పురాణాలలో వీరింకా అక్కడక్కడ అనేకులు దర్శనమిస్తారు. వీరు తరుచుగా పర్వత ప్రాంతవాసులై స్వేచ్ఛాప్రియులుగా, నిశ్చింత స్వభావులుగా ఉండేవారు. ఆనందమయ జీవులు, స్నేహభరితులు కాని పగ ఏర్పడినపుడు మాత్రం దాన్ని వంశపరంపరగా సాధించి శత్రువును ఏ విధంగానైనా తరిమి తరిమి వధించటానికి వెనుదీయరు.

మహాభారతంలో జనమేజయుడు చేసిన సర్పయాగం ఆనాడతడు నాగులపై చేసిన దండయాత్రలే అని నేటి చరిత్రకారుల అభిప్రాయం. ఆ ప్రమాదంలో వీరనేక ప్రాంతాలకు పారిపోయి అక్కడ స్వతంత్ర రాజ్యాలు స్థాపించుకున్నారు.

ఆర్యులకు సముద్ర ప్రయాణం నిషిద్ధం కాబట్టి ఆ కాలంలో సముద్ర వ్యాపారమంతా వీరి చేతులలోనే ఉండేది.

ఉత్తర భారతంనుండి దక్షిణాపథానికి వచ్చిన పిమ్మట తమిళ ప్రాంతాన్ని పాలించినవారు చూటుకులులు అని, తెలుగు ప్రాంతాలను పాలించినవారు నాగవంశీయులు అని వ్యవహరించబడినారు.

తెలుగుదేశంలోని నాగవంశాన్ని ప్రక్కన ఉన్న మయూరవర్మ మయూరం సర్పాలను తలెత్తకుండా చేసినట్లు అణచివేసినాడు.

12. మాత్స్యులు :-

మన పురాణాలలో మత్స్యవంశం గూడా మిక్కిలి ప్రాచీనమై కనిపిస్తుంది. భరత వంశానికి కుదురైన మత్స్యగంధి ఉపరిచర వసువుయొక్క వీర్యంచేత ఒక మత్స్యకన్యకు కలిగిన బిడ్డ.

బృహస్పతి అలిగిపోయినపుడు సురాచార్యుడై యింద్రునికి నారాయణ కవచాన్ని సృజించి యిచ్చిన విశ్వరూపాచార్యుని భార్య మీనాదేవి మరో మత్స్యకన్య కూతురు. హనుమంతుని చెమట వలన కలిగిన మత్స్యవల్లభుడు ఒక మకరాంగన కుమారుడట. ఈ శాఖలో ఇదొక విచిత్రం.

నాథ సంప్రదాయానికి మూల పురుషుడైన మత్స్యేంద్రనాథుడు గూడా మత్స్యకన్య కుమారుడే. ఈ విధంగా ఈ వంశం పురాణేతిహాసాల యుగంనుండి చరిత్రయుగం వరకు సాగివచ్చింది. క్రీ॥శ॥ 13వ శతాబ్దిలో వడ్డాదిని పాలించిన ప్రభువులు మత్స్య వంశీయులుగా చెప్పబడినారు.

శ్రీమహావిష్ణువు మత్స్యావతారంవలెనే కూర్మావతారం గూడా ఎత్తినా ఎందుకో కూర్మంపేర ఏ రాజవంశాలు రాలేదు. కాని ఈనాటి సాంఘిక చరిత్రకారులు "కుంబి" పదాన్ని కూర్మరూపంగా భావిస్తున్నారు. కుంబీలను ఇపుడు కాపులు అంటారు. కాపు "కాంపిల్య" శబ్దభవం అని కూడా ఒక మతం ఉంది. కాబట్టి కాంపిల్య దేశవాసులు కూర్మవంశీయులా పరిశీలించవలసి ఉంది.

13. మాండవ్యులు :-

వేదంలో మండూక సూక్తాలున్నవి. ఉపనిషత్తులలో మాండూక్యోపనిషత్తు ప్రసిద్ధం కాబట్టి మహాభారత కాలంనాటికే మండూక వంశం పేరు చెందింది. పరీక్షిత్తు భార్య సుశోభనాదేవి ఆ వంశానికి చెందిన ఆయువు అనే మహారాజుగారి బిడ్డ.

ఈ వంశానికి మూల పురుషుడు మాండవ్యుడు కానచ్చు. సతీసుమతి చరిత్రలో ఒక మాండవ్యుని వృత్తాంతం వస్తుంది. అతడు బాల్యంలో తూనీగలను తుమ్మముండ్లకు గ్రుచ్చి ఆడిన ఫలితంగా కొరత వేయబడి ఉంటాడు. సుమతీదేవి తన భర్తను గంపలో వేశ్య యింటికి ఎత్తుకొని వెళ్లుతూ ఉండగా అతని కాలికి ఆ గంప తగిలి కౌశికుని శపిస్తాడు.

పాండురంగ మహాత్మ్యంలో అగస్త్యుని శిష్యులైన ఆయత నియతుల కథ ఉంది. ఆ సోదరులలో ఆయతుడు వాధూల

మహర్షి శాపంచేత మండూకమై పందరి క్షేత్రంలో నివసించి తన వలెనే మరో మండూకమైన కన్యాకుబ్జ రాకుమారితో కాపురం చేస్తాడు. వీరికిగూడా పుత్ర ముఖదర్శనంలో శాపవిముక్తి కలుగుతుంది.

ఈ ఆయత దంపతులు మండూకాలైనారు అంటే సాతుడు అనే యక్షునివలెనే తమ కులంనుండి వేరై మరో గణంలో చేరినారనుకోవలె.

**14.** మూషకులు :-

ఇంతవరకు తెలిపిన మాతంగ వంశంలో వీరి ప్రస్తావన వచ్చింది. మూషిక నగరం మూసీ కృష్ణా సంగమ స్థానంలో ఉండేదట. వీరిపై శాతకర్ణి గూడ దండెత్తినట్లు చరిత్ర చెబుతుంది కాని వీరిని గురించిన వివరాలేవీ తెలియలేదు.

**15.** గరుడులు :-

కశ్యప మహర్షి భార్యలలో వినత, తామ్ర అనే యిద్దరు భార్యలకు కలిగిన సంతానం పక్షులు.

వినతకు అనూరుడు గరుడడు అనే యిద్దరు కుమారులు కలిగినారు. అనూరునికి శ్యేని అనే భార్యవలన సంపాతి, జటాయువు అనే కుమారులు కలిగినారు. రామాయణంలో ఈ సోదరులిద్దరిది చాలా పెద్ద పాత్ర.

ఒకపుడీ సోదరులిద్దరు పందెం వేసికొని సూర్యమండలం వరకు ఎగిరినారు. అపుడు సంపాతి తన రెక్కలు కాలి ఒకచోట పడిపోయి మెల్లగా అక్కడ ఉన్న ఒక కొండపైకి ప్రాకి దాని గుహలో నివాసం ఏర్పరచుకున్నాడు.

దశరథుని భార్య కౌసల్య దక్షిణ కోసల ప్రభువైన భానుమంతుని కూతురు. తండ్రి ఆమెకు స్వయంవరం చాటించగా దశరథుడు దానికి బయలుదేరి దారిలో ఒక నదిలో కొట్టుకొనిపోయి సముద్రంలో పడినాడు.

ఈ లోపల రావణునికి కౌసల్య కుమారునితో తనకు మరణం కలుగుతుందని తెలిసింది. అతడు స్వయంవర మండపానికి వచ్చి కౌసల్యను హరించుకొనిపోయి సముద్రమధ్యంలోని ఒక ఏకాంత ద్వీపంలో విడిచినాడు. అపుడు ఈదుతూ దైవికంగా దశరథుడా దీవికి చేరినాడు. అతనికి అక్కడ కౌసల్య కనిపించింది. ఒకరి వివరాలు ఒకరు తెలిసికొని వారాదీవిలోనే వివాహం చేసికున్నారు.

జటాయువు దశరథునికి పరమమిత్రుడు. అతడానాడు సముద్రతీరానికి విహారానికి రాగా అతనికి ఏకాంతద్వీపంలో దశరథుడు కనిపించినాడు. అంత జటాయువు అక్కడికి వెళ్ళి వారిద్దరిని కుశలంగా యిల్లు చేర్చినాడు. అదృష్టం అనేది ఉంటే అన్నీ దానంతట అవే ఈ విధంగా సమకూడుతూ ఉంటవి.

ఈ జటాయువే మళ్ళీ సీతను రావణుడెత్తుకొనిపోగా అతని కడ్డుపడి పోరాడి ప్రాణావశిష్టుడైపడి శ్రీరాముని కామె విషయం చెప్పి ప్రాణాలు విడిచినాడు.

ఆ పిమ్మట సుగ్రీవుని పంపిన వానరులు సీతను వెదకుతూ వచ్చి జాడ తెలియక సముద్రతీరంలో గల కొండపై నిరాశులై కూర్చోగా అపుడక్కడ గుహలో ఉన్న సంపాతి బయటికి వచ్చి వారిని చూచి సంగతి తెలిసికొని తన వాడియైన చూపుతో రావణుడు సీతను కొనివెళ్లి లంకలో ఎక్కడ ఉంచింది చూచి చెప్పినాడు. ఈ విధంగా ఈ సోదరులిద్దరిది రామాయణంలో మరువరాని పాత్ర.

గ్రద్దల దృష్టి చాలా నిశితమయింది. అది ఎంతో ఎత్తున ఎగురుతున్నా నేలపై ఉన్న ఒక జొన్నగింజను కూడా చూడగలదు కాబట్టి ఆ తీక్ష్ణదృష్టి ఈ సంపాతి సోదరులలో కనిపించింది.

వీరి తండ్రియైన అనూరుడు తొడలు లేనివాడు. కాబట్టి సూర్యునికి సారధి కాగా తమ్ముడైన గరుడుడు విష్ణుమూర్తికి ధ్వజము, రధము అయి సేవ చేసినాడు. అతడు తామ్రయొక్క బిడ్డలైన భాసి-శుకి-క్రౌంచి-శ్యేని-ధృతరాష్ట్రి అనే అయిదుగురిని వివాహం చేసికున్నట్టు వారివల్లనే యిక సమస్త పక్షిగణం జన్మించినట్లు బ్రహ్మాండ పురాణం చెబుతుంది. నాగులలోవలె వీరిలో గూడ అనేక శాఖలున్నవి. వానిలో గరుడులకు నాగులకు మాత్రం ముఖ్యంగా వైరం ఉండేది. అది జీమూతవాహనుని ఆత్మత్యాగంతో తీరిపోయింది.

సీతారాములు అరణ్యంలో ఉన్నపుడు కాకి రూపంలో వచ్చి ఆమె స్తనాగ్రం చీరిన జయంతుడొక రక్కసుడైతే అదే శాఖలో భుశుండుడు ఒక మహాయోగి - మార్కండేయ మహర్షి కంటే గొప్పవాడు. కాకవంశానికి చెందిన వీరిది పాక్షికదృష్టి.

బకులలో శ్రీకృష్ణుని మ్రింగటానికి ప్రయత్నించిన బకుడు ఒక రక్కసుడైతే అదే శాఖలో నాడీజంఘుడు పరోపకార

పారీణుడైన ఉత్తమ పురుషుడు. అతనికి రాజధర్ముడని మరో పేరు. అతడు బ్రహ్మదేవునికి మిత్రుడు.

కౌశిక శాఖలో "ప్రావార కర్ణుడు" ఒక దీర్ఘజీవి. గాన బంధుడు అనేవాడు గొప్ప విష్ణుభక్తుడు. వీరుదివాంధులు - అంటే పగలు బాగా చూడలేకపోయేవారు. విశ్వామిత్రుడు అనంతర కాలంలో ఇదే వంశంలో వచ్చిన ఒక గొప్ప రాజర్షి.

మహాభారతంలో "పూజని" అనే ఒక గొరవంక వృత్తాంతం వస్తుంది. ఆమె శారికా వంశానికి చెందిన స్త్రీ యనవలె. అదేవిధంగా జరిత లావుక (లవంక) శాఖకు చెందిన యువతి. ఆమెను సంతానార్థమై మందపాల మహర్షి చేపట్టినాడు. వారికి జరితారి, సారిసృకుడు, అపస్తంబమిత్రుడు, ద్రోణుడు అనే నలుపురు కుమారులు కలిగినారు. వీరు బ్రహ్మవిదులు.

వీరిలో ద్రోణుని భార్య తార్షి. ఈ దంపతులకు పింగాక్షుడు, విరాటుడు, వృతుడు, సుముఖుడు అనే నలుపురు కుమారులు కలిగినారు. వీరికి ధర్మపక్షులని వ్యవహారం. ఈ సోదరులు వింధ్య పర్వతంపై తపం చేసుకుంటూ ఉండగా జైమిని మహర్షి వారి దగ్గరకు వెళ్ళి మహాభారతంలో తనకుగల ధర్మ సందేహాలన్నీ అడిగి తెలుసుకున్నాడు.

ఈ విధంగా వీరి వంశం శాఖోపశాఖలుగా విస్తరించి మహాభారత కాలంవరకు మనిఉన్నది. గాంధారదేశపు రాజైన సుబలుడు ఇదే వంశానికి చెందినవాడు. "గాంధారం" అంటే ఒక జాతి గ్రద్ద. ఆయన కూతురైన గాంధారిని ధృతరాష్ట్రుడు వివాహమాడినాడు. కాబట్టి గాంధారి గరుడ వంశానికి చెందిన కన్య.

కౌసల్య, కైకేయి, గాంధారి అనే పేర్లు దేశ వాచకాలతో ఏర్పడిన తద్ధితాలు కాని వీరి నిజనామం ఏదో తెలియదు.

ఈ సందర్భంలో గాంధారి సోదరుని పేరు శకుని, అతని కుమారుని పేరు ఉలూకుడు అనేవి గమనించదగిన అంశాలు. అవి వీరు పక్షిజాతికి చెందినవారు అని స్పష్టంగా తెలుపుతవి.

కశ్యప మహర్షి సంతానంలో మొదటి వర్గంవారు పితృస్వామ్యంతో జీవించగా రెండవ వర్గంవారు మాతృస్వామ్యంతో బ్రతికినారు. మొదటివారు తమ గణ సంకేతాన్ని ఋషినామంగా దిద్దుకొని గోత్రంగా మార్చుకోగా రెండవవారు దాన్నలాగే జాతి వాచకంగా ఉంచుకున్నారనిపిస్తుంది. దీనికి ఈ వ్యాసం మొదట నేను చూపిన గోత్రనామాలు ఒక ఉదాహరణంగా ఉన్నవి.

ఇక మాతృస్వామ్యంలో నిలిచినవారిలో కన్యలే ఎక్కువగా కనిపిస్తున్నారు. వారిని మహారాజులు, మహర్షులు వంశ వివక్షత లేకుండా వివాహమాడి సంతానాన్ని పొందినారు. వారికి కలిగిన సంతానం తండ్రి గోత్రాలకు చెందినారు. అంటే క్రమంగా యీ రూపంలో మాతృస్వామ్యం పితృస్వామ్యంగా రూపొందింది.

పురాణాలలోని కన్యలు శాపగ్రస్తలై జాంతవ గణాలకు చెందినపుడు పుత్ర ముఖదర్శనంతో వారికి శాపవిముక్తి కలగటం పరిపాటి.

అశోకుని కాలంలో బానిస విధానం ఉండేది కాని ఆ బానిస స్త్రీ తమ యజమానికి ఒక బిడ్డను కన్నట్టయితే ఆమెకు దాస్యవిముక్తి కలిగి కలిగిన బిడ్డకు తండ్రి వారసత్వం లభించేది కనుక బహుశః ఆ నియమమే మన పురాణాలలో పుత్రముఖ దర్శనంతో శాపావసానంగా రూపుదిద్దుకున్నది అనిపిస్తుంది.

పితృస్వామ్యానికి చెందినవారంతా మైదానాలకు చేరి పెద్ద పెద్ద పట్టణాలు కట్టి నాగరికతకు పునాదులు వేస్తే మాతృస్వామ్యంవారు వీలైనంతవరకు అరణ్యాలలోనే ఉండి ప్రాకృతిక జీవితాన్ని అవలంబించినారు. అయినా వారిద్దరి నడుమ సంబంధ బాంధవ్యాలు మాత్రం తెగిపోలేదు.

యీ విధంగా చరిత్రలో గతించిన సుదీర్ఘకాలంలో యీనాటి ఆర్య-ద్రావిడ వాదం యీ వంశాలతోనే రూపుదిద్దుకున్నదా అనిపిస్తుంది. జిజ్ఞాసువు లెవరైనా పరిశోధిస్తే యీ వంశాల వెనుక యింకా ఎన్నెన్నో విశేషాలు బయటపడగలవు.



# విన్నపం

ఉదయ సంధ్యారాగ
విచిత్ర వర్ణ సమ్మేళనంలో
ఉరికే కిరణ తరంగాల
వింత వైభవ హాసరేఖవై-
మలయానిల వీచికా పరంపరల
భావ సుగంధ వీణియపై
మధుర స్వరఝురుల
వినూత్న సంగీత లహరివై-,
పూల తీవెల మృదుల
పుప్పొడుల పెదవులపై
నింగికేసి తొంగి చూచిన
మరంద బిందు వాహినివై-,
వినీల గగనాన విహరించు
విహంగం గుండె గూటిలో
స్వేచ్ఛావాయువులు పీల్చుకున్న
విముక్త రెక్కల సవ్వడివై-,
కఠిన శిలామయ తలంలో
ముగ్ధ సౌందర్య శిల్పకళా రీతిలో
నేత్రానంద విలసిత
నవజీవన రాగిణివై-,
చదల మూకల స్వాంతంలో
స్వాతి చినుకు జల్లువై విరిసి
ఎండిన పుడమి గుండెల్ని
సేదదీర్చే సస్యశ్యామల మూర్తివై
కీర్తితో చరితార్థతతో
సఫలమైన మానవత్వమా....!
ఈ జన హృదాంతరాళాల్లో
కరుణామృతవాహినివై పయనించు!!

# జీవనగీతం

కన్ను పొడుచుకున్నా కరగని యీ చీకటిలో
ఎన్ని కన్నీటి బిందువుల్ని రాల్చాను....
ఎడతెగని ఈ ఎడారి దారులలో
ఎన్ని వత్సరాలు పయనించాను....
వినిర్మలమైన ఈ మనో విహాయసంలో
ఎన్ని ఊహాసౌధాలు నిర్మించుకున్నాను....
చిత్ర విచిత్ర భాసితమైన ఈ ప్రకృతిలో
ఎన్ని అనుభూతులు దాచుకున్నాను....
నిరంతరం సాగే జీవన పోరాటంలో
ఎన్ని అనుభవాలు గడించుకున్నాను....
ఎండిన మాకుల గుండెల్లో కదలాడి
ఎన్ని శిశిరాల శిరాలను స్పృశించాను....
వికసించిన పువ్వుల్లో పరాగ రేణువునై
ఎన్ని చైత్రమాసాల మధురిమలు చవిచూశాను....
వెన్నెల వెచ్చని పొత్తిళ్ళలో కూర్చొని
ఎన్నిసార్లు ఆనందాబ్ధిలో ఓలలాడాను....
వేడి కిరణాలు నెత్తిపై మొత్తినపుడు
ఎన్నిసార్లు విషాద సాగరంలో మునిగిపోయాను...
ఎంతో వైరుధ్యమైనది జీవితం!
వింత వైవిధ్య భావాల భూషితం!!

# చేతన

గుండెలో
వీణ మ్రోగుతుంది
అపశృతులు సవరిస్తూ
అనురాగం వివరిస్తూ!

గుబురులో
గువ్వ పలుకుతుంది
స్వేచ్ఛకు సంకేతాలిస్తూ
స్వచ్ఛతకు సందేశమిస్తూ!

గూటిలో
దివ్వె వెలుగుతుంది
చీకటిని కరిగిస్తూ
చైతన్యం రగిలిస్తూ!

కొమ్మలో
పువ్వు పరిమళిస్తుంది
కంపును తొలగిస్తూ
ఇంపును ఆహ్వానిస్తూ!!

## కాలం

కడుపు నిండినవాడికి
వినోద సుధా లహరి!
కడుపు నిండనివాడికి
విషాద వ్యథా విభావరి!!

శ్రీ సి. కామేశ్వరరావు

## ఊహించకుండా జీవించలేం

ఊహలు వాస్తవాలు కాకపోవచ్చు,
అంతమాత్రాన—
ఊహించకుండా జీవించలేం.

అభేదాలవి క్షీర నీరాల్లా.
అంతర్భూతాలవి పువ్వుల్లో దారాల్లా.

ఊహ లేంది ఊపిరి లేదు—
వూపిరి లేంది వూహ లేదు—
ఊహల్లో వున్నోడు వృథాజీవియని—
అపోహలో అవహేళన చేయకండి.

అదే నిజమైతే ఏమౌతారు?
తలలు దించుకుంటారా?
తప్పొప్పుకొని చప్పట్లు చరుస్తారా?

## ఇప్పుడివి వార్తలే కావు?!

ఇప్పటివరకు
సూర్యుడు తూర్పున ఉదయించడం,
భూమి సూర్యునిచుట్టు తిరగడం,
నీరు పల్లానికి ప్రవహించడం,
నిప్పుకాల్చడం లాంటివి కొన్నే నిత్యసత్యాలు.

ఇప్పుడు
వీటికితోడు యీ కొన్నింటిని చేర్చుకోవాలి.

మూకుమ్మడి హత్యలు—
టెర్రరిస్టుల ఘాతుకాలు—
స్వయం ప్రతిపత్తికై సాగే సమరాలు—
బాంబుల ప్రేలుళ్ళు—
ఇప్పుడివి చెప్పుకోదగిన వార్తలు కావు.
ఎప్పుడింతే లెమ్మనుకొనే వాస్తవాలు!!

కమల్

శ్రీ కాళూరి హనుమంతరావు

# ఒక చిన్న పాఠభేదం - పెద్ద చర్చ

మహాభారత విరాటపర్వంలో భీముడు ద్రౌపదిని ఊరడిస్తూ అన్న వాక్యాలలో ఒక శ్లోకం భండార్కర్ ప్రాచ్యవిద్యా సంశోధన మందిరం ప్రకాశింపజేసిన సంశోధిత ప్రతిలో ఇట్లా ఉంది.

"మా దీర్ఘం క్షమ కాలం త్వం మాసమధ్యర్ధ సంమితమ్
పూర్ణే త్రయోదశే వర్షే రాజ్ఞో రాజ్ఞీ భవిష్యసి." (20, 13)

[ఇక నీవు ఎక్కువ కాలం సహించనక్కరలేదు. అర్ధ మాసం ఎక్కువతో కూడిన మాసం (అనగా ఒకటిన్నర నెలలు) క్షమ గలిగిఉంటే చాలును. పదమూడవ ఏడు పూర్తయిన వెంటనే నీవు మహారాణివి అవుతావు.]

దీనినిబట్టి ఆనాటికి ఇంకా వారి అజ్ఞాతవాసం ముగియడానికి ఒకటిన్నర నెలల వ్యవధి ఉన్నట్లు అర్థమవుతున్నది. ఆ మరునాటి రాత్రి కీచకవధ, ఆ మరునాడు ఉపకీచకవధ జరిగిన పిమ్మట అంతఃపురానికి వెళ్ళిన సైరంధ్రి (ద్రౌపది) ని సుధేష్ణ సవినయంగా రాజ్యం వదిలి వెళ్ళిపొమ్మంటే ద్రౌపది "త్రయోదశాహ మాత్రం మే రాజా క్షమతు భామిని" (23, 27) (ఇంక పదమూడు దినములు మాత్రం రాజు నన్ను క్షమించును గాక) అంటుంది. ఈ వాక్యం దాదాపు ఇదే రూపంలో అన్ని ప్రతుల* లోనూ ఉంది. సంశోధిత ప్రతి దీనిని నిస్సందేహ పాఠంగా పేర్కొన్నది. అంటే ఆనాటికి అజ్ఞాతవాస కాలం పదమూడు దినములు మాత్రం మిగిలి ఉన్నట్లు నిస్సంశయంగా తెలుస్తున్నది. పై లెక్కకీ యీ లెక్కకీ సుమారు నెల రోజులు తేడా వస్తున్నది. కనుక భీమ వాక్యంలో "మాస మధ్యర్ధ సమ్మితమ్" అన్న పాఠం పరిశీలించాలి. సంశోధిత ప్రతిలో ఆ మాటల క్రింద వంకరటింకర గీత పెట్టబడి ఉండటం ఈ పాఠం సందేహాస్పద మని సూచిస్తుంది. కాని యీ పాఠం పరిశీలించేముందు ఇంకొక సారి కాలగణనం చెయ్యాలి.

పాండవులు విరాట నగరంలో అజ్ఞాతవాసం ప్రారంభించిన పది నెలల తర్వాత కీచకుడు ద్రౌపదిని చూశాడు (13, 1-3). కీచకుడు తనను పరాభవించిననాటి రాత్రి భీమునితో ఆ వృత్తాంతం చెబుతూ "కీచకోఽయం సుదుష్టాత్మా సదా పార్థయతే హి మామ్" (20, 17) (దుష్టుడైన కీచకుడు నన్ను సదా ప్రార్థిస్తున్నాడు) అని ద్రౌపది అన్న వాక్యాన్నిబట్టి ఆమె తిరస్కరించినా ప్రతి దినమూ ఆమెను కీచకుడు వేధింపసాగాడని తెలుస్తున్నది. తర్వాత మరునాటి ఉదయం కీచకుడితో మాటాడి రాత్రి నర్తనాగారానికి రమ్మని ద్రౌపది చెబుతుంది. వాడికి తాను అట్లా చెప్పినట్లూ వాడు నర్తనాగారానికి ఒక్కడే వస్తాడనీ తిరిగి ఆ మధ్యాహ్నమో సాయంకాలమో వెళ్ళి భీముడికి ఆమె చెబుతుంది.

"తమర్థం ప్రతిజల్పంత్యాః కృష్ణాయాః కీచకేన హ
దివసార్ధం సమభవన్మాసేనైవ సమం నృప." (21, 18)

[యీ సంగతి భీముడికి చెప్పడానికి తాను ప్రతీక్షించిన ఆ దినంలో అవశిష్టమైన సగం భాగం మాసంతో సమానంగా ద్రౌపదికి గడిచింది) అన్న వాక్యాన్నిబట్టి కీచకుడు ఆమెను ఒడబరచడానికి నెల రోజులు ప్రతిదినం ప్రయత్నించాడని ఊహించవచ్చును. అంతకుముందు నెల రోజులుగా కీచకుడి గురించి భీముడికి చెప్పాలనే ద్రౌపది అనుకొంటున్నది కాని సహించి ఊరకొంటున్నది అని అభిప్రాయం. ఇందాకటి పది నెలలూ యీ నెలా కచ్చితంగా కాక కొద్దిరోజులు ఇటూ అటూగా తీసుకోవాలి. అంటే అప్పటికి పదకొండున్నర నెలలు పూర్తయా యన్న మాట. తర్వాత కీచకుల హత్యావార్త కౌరవ సభకి చేరడానికి కొన్నిరోజులూ అనంతరం కౌరవులు విరాట నగరంపై దాడి జరపడానికి కొన్నినాళ్లూ పట్టింది. ఆ విధంగా సుశర్మ విరాటనగర దక్షిణ దిశలో గోవులను పట్టిననాటికి ముందే పాండవుల అజ్ఞాతవాసం పూర్తయిందని కవి స్పష్టంగా చెప్పాడు. (30, 1-2).

కౌరవ సభకి కీచక హతివార్త చేరిననాటికి కొద్దిరోజులు మాత్రమే అజ్ఞాతవాసకాలం మిగిలి ఉండగా దుర్యోధనుడు దానిలో

* గీతా ప్రెస్ ప్రతి, శ్రీపాద దామోదర సాతవ లేకర్ ప్రతి, దాక్షిణాత్య ప్రతి - సంపాదకులు టి. ఆర్. కృష్ణాచార్య, టి. ఆర్. వ్యాసాచార్య. "క్షమతు"కి బదులు "క్షామ్యతు" అని కొన్నిటిలో ఉండటమే చిన్న తేడా.

చాలాభాగం గడిచింది, కొంతకాలం మాత్రం మిగిలి ఉంది, వారి జాడ తెలియలేదు అనీ (25, 2-3), కర్ణుడు వారిని ఇంకా బాగా వెతికించాలనీ (25, 8-12) అంటారు. దుశ్శాసనుడు వారు చచ్చిపోయి ఉంటారు కనుక నిశ్చింతగా ఉందామంటాడు (25, 14-17). అంతేతప్ప కీచకుడిని చంపినవాడు భీముడయి ఉంటాడనీ, పాండవులు విరాట నగరంలో ఉండవచ్చుననీ వారికి ఆలోచన కలుగలేదు. తర్వాత సుశర్మ విరాటుడిని దండించడానికి దండెత్తి వెళ్తాననగానే కౌరవులు పాండవుల సంగతి ఉపేక్షించి విరాటనగర దండయాత్రకి సన్నద్ధులయ్యారు (29). పాండవులు విరాట నగరంలో ఉండవచ్చునని ఊహించి దుర్యోధనుడు వారిని తెలుసుకొనే యుక్తితో ద్వివిధంగా వ్యూహం పన్ని గోహరణం జరిపాడని కొన్ని మహాభారత ప్రతులలో కనిపించే గ్రంథభాగం సంశోధిత ప్రతిలో ప్రక్షిప్తంగా తొలగించబడింది. కనుక ఆ భాగం మహాభారతంలో లేదు, కౌరవులకి ఆ ఆలోచన లేదు.

అర్జునుడిని చూసి ఇతడు అజ్ఞాతవాసం ముగియకముందు వ్యక్తురయ్యాడని దుర్యోధనుడంటే (42, 46) భీష్ముడు ఆనాటి కాలగణన పద్ధతులని పేర్కొని - ప్రతి ఐదవఏటా రెండు అధిక మాసాలు ఉంటాయని (పంచమే పంచమే వర్షే ద్వౌ మాసా వుపజాయతః), ఆ విధంగా ఆ పదమూడేళ్ళకీ ఐదు నెలల పన్నెండు దినములు అధికంగా వస్తాయని చెప్పి అదంతా కూడా పాండవులు ఒప్పందం ప్రకారం పూర్తిచేశారనీ అందుచేతనే అర్జునుడు ప్రకాశితుడయ్యాడనీ నిర్ధారణ చేశాడు (47, 1-5). దుర్యోధనుడది అంగీకరించాడు. అయితే, దుర్యోధనాదులకి గాని, ద్రోణాదులకి గాని యీ కాల గణనం ముందుగా ఎందుకు తెలియలేదు?

దీనికి రెండు కారణాలు చెప్పవచ్చును. క్రీస్తు తర్వాత తొమ్మిదవ శతాబ్దంనుంచి మాత్రమే చాంద్రమాన సూర్యమానాల సమీకరణలో ఉత్పన్నములయే అధికమాసాలు ఎక్కడ ఉంచాలి అన్నది సువిహితమైంది. అంతకుమునుపు అధిక మాసాలు ఎక్కడ ఉంచాలన్న విషయంలో ఏకత్వం లేదు. ఒక్కొక్కరొక్కొక్క విధంగా పాటించేవారు. అంధుచేత చివరి [illegible]దేళ్ళకీ అదనంగా చెందిన నెలమీద కొద్దిరోజులు కౌరవ పాండవుల కాలగణనాలలో తేడా వచ్చిఉండవచ్చును. అందుచేతనే అజ్ఞాతవాసం ఇక కొద్ది రోజులలోనే పూర్తవుతూ ఉంటే ఇంకా కొంతకాలం వ్యవధి ఉన్నట్లుగా దుర్యోధనుడు మాట్లాడాడు. అజ్ఞాతవాసం ఎప్పటికి పూర్తవుతుందని దుర్యోధనాదులు అదివరకు భీష్మణ్ణి అడిగి ఉండరు.

రెండవ కారణం కౌరవులప్రమత్తత కూడా కావచ్చును. కీచక హత్య గురించి వినినా కూడా పాండవుల ఉనికిని వారు ఊహించకుండా గోహరణ సంరంభంలో మునిగిపోవడం దీనిని సమర్థిస్తుంది.

ఈ చర్చవలన భీముడు ద్రౌపదిని ఊరడించిననాటికి సరిగా పదిహేను దినాలు అజ్ఞాతవాసం మిగిలిఉన్నట్లు నిశ్చితమవుతున్నది. వ్యాసారంభంలో ఉదాహృతమైన శ్లోకం సుప్రసిద్ధములైన గీతా ప్రెస్ ప్రచురణంలోనూ శ్రీపాద దామోదర సాతవలేకర్ ప్రచురణంలోనూ ఇట్లా ఉంది.

"మా దీర్ఘం క్షమ కాలం త్వం మాసమర్ధంచ సమ్మితమ్
పూర్ణే త్రయోదశే వర్షే రాజ్ఞాం రాజ్ఞీ భవిష్యసి." (21, 17)

దీనికి సాతవలేకర్ ఇచ్చిన తాత్పర్యం - ఇక నీవు ఎన్నో దినాలు ఈ దుఃఖాలు సహించనక్కరలేదు. సమయం పూర్తవడానికి ఇహ పదిహేను దినములు మాత్రమే మిగిలి ఉంది. పదమూడవ ఏడు పూర్తవగానే నీవు మహారాణివి అవుతావు - అని. ఇక్కడ "మాస మర్ధం చ సమ్మితమ్" అన్నది పాఠం. అర్ధం మాసం సంమితం చ అని దీనికి అన్వయం. 'చ' అన్నది కేవల పాదపూరణకి వాడినదే తప్ప మరియు అన్న అర్థంలో కాదు (అమరకోశము 3-4-5). సంమితము అనగా అంతటి పరిమాణము కల అన్న అర్థం గ్రహించగా అర్ధ మాస పరిమితమైన కాలము అని ఇక్కడ అర్థం సరిగా కుదురుతోంది. సంమితము అనగా సంయుతము అన్న అర్థం గ్రహించి మాసమూ దానితో కూడిన అర్ధమాసమూ వెరసి ఒకటిన్నర నెలలు అని కూడా ఈ వాక్యానికి అర్థం చెప్పవచ్చును. ఇంతకన్నా పై అర్థం ఎక్కువ సరళంగానూ సందర్భానికి తగినట్లుగానూ ఉంది. సంశోధిత ప్రతిలోని "మాస మధ్యర్ధ సంమితమ్" అన్న పాఠానికి ఒకటిన్నర నెలలనే తప్ప పక్షం రోజులన్న అర్థం రానేరాదు.

కనుక ఈ శ్లోకంలో సంశోధిత ప్రతిలోని పాఠంకన్నా ప్రసిద్ధ సాధారణ ప్రతులలోని పాఠం సరైనదిగా తోస్తున్నది. కాని సంశోధిత ప్రతిలోని పాఠాన్ని తిరస్కరించేముందు అసలు ఆ ప్రతి నిర్మాణం ఎట్లా జరిగిందో విచారించాలి.

అనేక ప్రతులని పరిశీలించి ఎక్కువ ప్రతులలోని పాఠాన్ని ప్రధాన పాఠంగా ఇచ్చి తక్కువ ప్రతులలోని పాఠాంతరాలు అధస్సూచికలో ఇచ్చారు. తక్కువ ప్రతులలోని గ్రంథభాగాలను ప్రక్షిప్తాలుగా తొలగించారు. వీటిని అనుబంధంలో సూచించారు. ప్రక్షిప్తాల విషయంలో వారు చేసినది ఒప్పు కావ

చ్చును గాని ఎక్కువ ప్రతులలోని పాఠాలు ప్రధాన పాఠాలుగా గ్రహించడం సర్వదా ఒప్పు కాకపోవచ్చును. సరైన పాఠం అప్పుడప్పుడు తక్కువ ప్రతులలోనిదే కావచ్చును. పైగా ప్రధాన పాఠ నిర్ణయంలో సంశోధిత ప్రతి నిర్మాతలు అర్థానికన్నా పదాలకే ప్రాధాన్యం ఇచ్చినట్లుంది. సాధారణ ప్రతుల నిర్మాతలు అనుసరించిన పద్ధతి ఇది కాదు. వారు అన్ని హెచ్చు సంఖ్యలో ప్రతులు పరిశీలించి ఉండకపోవచ్చునుగాని వారు పరిశీలించిన ప్రతులనిబట్టి అర్థం బాగా కుదరేటట్లుగా పాఠాలు గ్రహించి శ్లోక తాత్పర్యాలు రచించారు. అందుచేత సాధారణ ప్రతులు ప్రక్షిప్త సంకీర్ణమై గ్రంథ విస్తృతి కలిగిఉన్నా శ్లోకాల అర్థాలకి క్షతి ఉండదు. సంశోధిత ప్రతిలో ప్రక్షిప్త గ్రంథభాగాలు తొలగిపోయినా కొన్నిచోట్ల అర్థం కుదరదు. దీనికి కొన్ని ఉదాహరణలు చూపుతాను.

ఉత్తరుడు తన రథాన్ని కృష్ణుని రథంతో సరిపోల్చుతూ గుర్రాలు సుగ్రీవ మేఘ పుష్ప శైబ్య వలాహకముల వంటివంటాడు (గీతా ప్రెస్, విరా, 45, 20-24). అన్ని ప్రతులలోనూ "శైబ్య" అని ఉంటే సంశోధిత ప్రతిలో శైబ్యకి బదులుగా "సైస్య" అని అర్థరహిత పాఠం ఉంది (40, 20). శైబ్య అన్న పదం తక్కువ ప్రతులలోనిదని అప్రధాన పాఠంగా అధస్సూచికలో మాత్రమే ఇచ్చారు. ఈ మాట ఉద్యోగపర్వంలో కూడా (81-19, 58) రెండుసార్లు వచ్చింది. అక్కడ కూడా "సైన్య" అనే అర్థరహిత పదం ప్రధాన పాఠంగా ఇచ్చారు. సైన్య శబ్దానికి శైబ్యమనే కృష్ణుడి గుర్రమన్న అర్థం ఏ నిఘంటువులోనూ లేదు.

బ్రాహ్మణుడు బకాసురుడికి తన కుటుంబంనుంచి ఒకరిని భోజనంగా పంపడానికి దుఃఖిస్తూ "ధిగిదం జీవితం లోకే గతసారమనర్థకమ్" (గీతా, ఆది, 156, 20) (ఛీ ఛీ! ఈ లోకంలో జీవితం సారహీనమూ అనర్థకమూ అయినది) అంటాడు. అన్ని ప్రతులలోనూ ఈ పంక్తి ఇట్లాగే ఉంది. కాని సంశోధిత ప్రతిలో "ధిగిదం జీవితం లోకేఽనలసార మనర్థకమ్" అని అనలసారమ్ అన్న అర్థంలేని పాఠం ఇచ్చారు (145, 20). "నల" క్రింద వంకరగీత పెట్టి ఆ పాఠం సందేహాస్పదమైనదని సూచించారు. అంటే ఎక్కువ ప్రతులలో అక్కడ సరైన పాఠం వారికి దొరకలేదన్న మాట. అధస్సూచికలో "గత సారమ్" అన్న తక్కువ ప్రతులలోని పాఠం ఇచ్చారు. ఈ పాఠం ప్రధానంగా గ్రహిస్తే అర్థం కుదురుతోంది కదా! లేదా అవగ్రహం తొలగించి "ధిగిదం జీవితం లోకే నలసార మనర్థకమ్" (జీవితం గడ్డివలె నిస్సారము) అన్నా అర్థం కుదురుతుంది. నన్నయభట్టు దీనిని "నలసారము సంసారము" (ఆది, 6, 2-48) అని తెనిగించాడు. సంశోధిత ప్రతిలో ఇచ్చిన "అనలసారమ్" అన్న ప్రధాన పాఠంతో అర్థం కుదరదు. అవగ్రహంతో కూడిన పై పాఠం నల శబ్దానికి అర్థం తెలియని వ్రాయసకాళ్ల పొరపాటు వ్రాత వలన ఎక్కువ లిఖిత ప్రతులలో ఉండడం, దానిని సంశోధిత ప్రతి నిర్మాతలు ప్రధాన పాఠంగా గ్రహించడం జరిగిందా?

అంబని తన తమ్మునికిచ్చి భీష్ముడు వివాహం చెయ్యబూనినప్పుడు ఆమె "అబ్రవీద్ధసతీ తదా" (సాతవలేకర్ 102, 60) (ఆమె నవ్వుతూ* ఇలా అన్నది) అని సాధారణ ప్రతులలో ఉండగా సంశోధిత ప్రతిలో "అబ్రవీద్ధ సతీ తదా" (96, 47) అని అర్థరహిత పదచ్ఛేదం ఇచ్చారు. సంశోధిత ప్రతిలోనూ దాని ననుసరించిన ప్రధాన మూలగ్రంథ ప్రతి'*'లోనూ రెండింటిలోనూ ఈ పదచ్ఛేదం ఇలాగే ఉంది కనుక ఇది అచ్చుతప్పు కాదు. ఇలాటి ఉదాహరణలు ఎన్నో చూపవచ్చును.

సంశోధిత ప్రతి నిర్మాణంలో ఆ సంపాదకులు ఎదుర్కొన్న సమస్యలు చాలా గొప్పవి. 1936లో ప్రకాశితమైన విరాటపర్వ ప్రతి సంపాదకులు రఘువీర తన ఉపోద్ఘాతంలో ఇట్లా వ్రాశారు — "అవుట్ ఆఫ్ ఎ టోటల్ ఆఫ్ 1834 స్టంజాస్ ఆఫ్ ది కన్‌స్టిట్యూటడ్ టెక్స్ట్ ది ఎడిటర్ ఈజ్ ష్యూర్ ఫార్ ఓన్లీ అబవుట్ 300 స్టంజాస్. ది రెస్ట్ బేర్ ది వేవీ లైన్, యైదర్ ఫార్ ఎ పార్ట్ ఆర్ ఫార్ ది హోల్, యాన్ ఇండికేషన్ దట్ ది మానుస్క్రిప్ట్స్ డు నాట్ పర్మిట్ ఎ క్లియర్ వ్యూ ఆఫ్ ది కామన్ సోర్స్. అండ్ టెన్ ఫార్ ఒన్ ఫోర్త్ ఆఫ్ ది ఎంటయిర్ ఎక్స్‌టెంట్ ఆఫ్ ది వైరాటా, ది సీక్వెన్స్ ఆఫ్ స్టంజాస్, కనెక్టెడ్ ఆర్ ఈవెన్ డిస్‌కనెక్టెడ్ విత్ ది ఆర్డర్ ఆఫ్ ఈవెంట్స్, ఈజ్ ఫార్ ఫ్రమ్ సర్టన్."

---

* హసతీ అన్నది పాణినీయం ప్రకారం హసంతీ అని ఉండాలి. కాని ఇట్లాటి అపాణినీయాలు మహాభారతంలో కోకొల్లలు.

'*' భండార్కర్ ప్రాచ్యవిద్యా సంశోధన మందిరంవారు తయారు చేసిన మహాభారత సంశోధిత ప్రతి రెండు విధాలు. ఒకటి ప్రధాన గ్రంథం, అప్రధాన పాఠాల అధస్సూచికలు, తొలగించిన ప్రక్షిప్తాల అనుబంధాలతో కూడిన బృహద్గ్రంథం. రెండవది, కేవల ప్రధాన గ్రంథం మాత్రం. ఒక్క ఈ రెండవ గ్రంథం మాత్రం చూస్తే ఇతర పాఠాంతరాలు తెలియవు. అందులోని పాఠమే శుద్ధ పాఠమన్న భ్రమ కలుగుతుంది.

సంశోధిత ప్రతిలో పై శ్లోకంలోని "మానమద్యర్ధ సంమితమ్" అన్న పదాలక్రింద సంపాదకులు పైన చెప్పిన తరంగరేఖ ఉంది. అంటే పాఠం సరైనదో కాదో వారే నిశ్చయంగా చెప్పజాలరన్నమాట. కాబట్టి దాని స్థానంలో వారు అధస్సూచికలో అప్రధాన పాఠంగా ఇచ్చినదీ, సుప్రసిద్ధ సాధారణ ప్రతులలోనిదీ అయిన అర్థవంతమైన "మాన మర్థం చ సంమితమ్" అన్న పాఠం గ్రాహ్యం.

సంశోధిత ప్రతి నిర్మాణం చాలా గొప్ప కార్యమే. దాని వలన చాలా ప్రక్షిప్తాలు తొలగిపోయి కొంతవరకు అసలు గ్రంథం నిర్ధారితమయింది. కాని కొన్ని కొన్ని పాఠాలు పునః పరిశీలించవలసి ఉంది. పాఠానికి అర్థం కదా ప్రధానమైనది. ఎక్కువ ప్రతులలో ఉన్నంతమాత్రాన అర్థం కుదరని పాఠాల వలన ప్రయోజనమేమిటి? కనుక సంశోధిత ప్రతిలో అర్థక్లేశం ఏర్పడినచోట్లలో పండిత పరిష్కృతములైన ప్రసిద్ధ సాధారణ ప్రతులలోనుండి అర్థ నిర్ణయం జరిగిన పాఠాలు గ్రహించి ప్రధాన పాఠాలుగా వాటిని ఇచ్చి మహాభారత సాధు సంశోధిత ప్రతిని క్రొత్తగా నిర్మించవలసి ఉంది. సంశోధిత ప్రతిలోని ఆ పాఠాలు అధస్సూచికలో ఇవ్వవచ్చును. పండితులచేత శ్లోక తాత్పర్యాలు కూడా రచింపజేసి ప్రచురించాలి. అప్పుడే పఠితలకు సంశోధితమైన సుబోధమైన మహాభారత ప్రతి లభ్యమవుతుంది.

ఈ మహాకార్యం ఏదైనా సుప్రసిద్ధ సంస్థ చేపట్టుతుందని ఆశించుదాం.

---

# పుస్తకాల షాపులో...

## ఒబ్బిని

క్రెస్టుగేట్లు తీసి ఉన్న ఆనకట్టని
ఫోటో తీసినట్లున్నాయి
పుస్తకాల ర్యాకులు.

ఓ రోజు ఓ సమయంలో
కాలువచంచున చేరిన నీటి నురగలాంటి పుస్తకం
ఆబగా
రెండు చేతుల్లో కూర్చొబడి
కళ్ల గాలితో రెండు పేజీలు కరగడం మొదలయ్యింది.

మరో నాలుగు పేజీలు మడతలు బడ్డాయి
మరుసటిరోజు.

....

ఇంకా కొన్ని పేజీలు ఇంగబడ్డాయి
ఇంకోరోజు.

ముక్కుమీది కోపంతో
సేల్సుమెన్ కస్సు బుస్సు రాగం ఆలపించిన రోజు
చివరి నాలుగు పేజీలు చదివేస్తే
నురుగు కరిగిపోయే సమయం.

....

పుస్తక పుష్పాన్ని పట్టుకున్నబ్బాయి
కళ్లనుండి నీరు ప్రవాహంలా
కాళ్లు చేతులు హార్మోనియంలా

....

కరుణాకరు డవతారమెత్తాడు
సేల్స్‌మెన్.
ఆ అబ్బాయింట్లో ప్రత్యక్షమయ్యింది
ఓ పుస్తకం ఉచితంగా.

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

# ఆ దినపు వేట

కన్నడ మూలం :
**త. రా. సు.**

తెలుగు అనువాదం :
**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

రాత్రి పదుకొండు గంటల సమయం. నల్లని ఆకాశంలో వానమబ్బులు కమ్ముకుని చీకటి చిమ్మచీకటిగా మారింది. పోలీస్ కానిస్టేబుల్ నం॥ 127, శివన్న, డ్యూటీ పాయింట్‌లో నిలుచుని వున్నాడు. మబ్బులు కమ్ముకున్న ఆకాశంలానే అతని మనసు కూడా నల్లబారి వుంది. మామూలు ఉల్లాసం లేదు. నెల చివర. పొద్దున్నుంచీ కాఫీకీ, తిండికీ కక్కుర్తిగా వుంది. రోజూ, ఎవరైనా ఒకరో, ఇద్దరో గిరాకీలు దొరికి, 'శాకాయ, లవణాయ' కాఫీ ఖర్చుకయినా గిట్టుతూండేది. ఎంత లేకున్నా, చివరకు, ఇంటికి వెళ్ళేటప్పుడు మరుసటి రోజుకు కూరగాయలూ, పెళ్ళాముకు ఒక మూర పూలూ కొనుక్కువి వెళ్ళేందుకైనా చేతికి లంచం దొరుకుతూండేది. ఆ రోజు అతడి పాలిటికి దుర్దినం. ఒక రెండ ణాల ముఖం కూడా చూడటానికి వీలుపడలేదు. పొద్దున్నుంచీ సాయంత్రందాకా సూపరిండెంటుగారి ఇంటి పని వుండటంచేత అలా అలా విహారం చేయడానికి అవకాశం దొరకలేదు. సాయంత్రమయిన తర్వాత జట్కాలూ, బస్సులూ సంచరించని మారుమూలలో డ్యూటీ పడింది. ఏదైనా మృగం వలలోకి పడు తుందేమో, రోజు ఖర్చంతా గిట్టించుకుందామని చాతక వ్రతం చేశాడు. లాభం లేదు. ఎవరి గ్రహచారమూ చెడలేదు. చివరకు బీడీలకు కూడా చిల్లిగవ్వ లేక అంగడి దొరస్వామితో బీడీ తిరిప మడిగి ఇప్పించుకోవలసి వచ్చింది. ఎక్కడలేని విసుగూ ఆవ రించింది అతడికి. సాయంకాలమయింది. మునిమాపు వేళయింది. చీకటి పడింది. నిర్మలాకాశం మబ్బుపట్టి, ముఖం చిట్లించి, మెరపు మెరిపించి, ఉరిమింది. అతడి అదృష్టం కళ్ళు తెరవలేదు.

ఇకేం, డ్యూటీ ముగిసే సమయ మాసన్నమైంది. వాన వచ్చేందుకు ముందు వీచే చల్లగాలి జోరుగా వీస్తోంది. అల్లంత దూరాన ఎవరో ఒకరు వేగంగా సైకిలు తొక్కుకుంటూ వస్తూ న్నారు. కంటిలో కన్ను పెట్టుకుని చూశాడు శివన్న; సైకిలు దీపం వెలుగుతోంది. నిరాశతో నిట్టూర్పు వదిలి, ముఖం పక్కకు తిప్పుకునేటంతట్లోనే, దూరంలో కనిపించిన సైకిలు దీపం దగ్గర కొచ్చినపుడు కనిపించలేదు. ఒక్కుమ్మడిగా నృత్యం చేసింది అతడి ఎద. ఇంతకూ అతడి దేవుడు అతడి చేతిని వదల్లేదు. దీపం గాలికి ఆరిపోతేమాత్రమేమి? తన దగ్గరికి వచ్చినప్పుడు దీపం లేదు కదా? దబాయిస్తే ఏనిమిదణాలు తప్పక దొరుకుతా యని ముఖం ముడివేసుకుని లేచి నిలబడ్డాడు. దగ్గరికి, ఇంకా దగ్గరికి, ఇతడి దగ్గరికే వచ్చింది సైకిల్. మరొకసారి చూసి ఖచ్చితపరచుకున్నాడు. నిజంగానే దీపం లేదు.

"దిగండీ కిందికి?" అధికారవాణితో గద్దించాడు శివన్న.

"గాలికి దీపమారిపోయిందయ్యా. ముట్టించుకునే వచ్చాను. ఆరిపోయింది గమనించలేదు" సైకిలువాలా దీపమారిపోయి నందుకు కారణం వివరించాడు.

"ఈ కాకమ్మ గువ్వమ్మ కథలన్నీ నమ్మేవాళ్ళకు చెప్పండి. నా ముందర విప్పకండి మీ పురాణం. మీలాంటివాళ్ళని వేలాదిమందిని చూశాన్నేను", శివన్న గద్దించాడు.

"లేదండి. నిజంగా ఇప్పుడే దీపమారిపోయింది. నిజం చెప్తున్నానండీ నేను"

"ఊఁ. హరిశ్చంద్రుడు. నీవొక్కడివేకదా నిజం చెబు తూండేది?" బహువచనంనించీ ఏకవచన సంబోధనకు దిగాడు శివన్న - ఆసామి మెతకబారడం గమనించి.

"అలా అయితే నేనేం అబద్ధం చెబుతూన్నానేమండీ?"

"ఊహూ. నీవు కాదు అబద్ధం చెబుతున్నది; నేను కదూ? లేకుంటే, నా కళ్ళు గుడ్డివి. పోలీసువాళ్ళ ముఖం చూసిన వెంటనే ఆరిపొమ్మని దీపానికి పాఠం నేర్పించావేమి? పదవయ్యా, స్టేషనుకు. ప్రొద్దున మ్యాజిస్ట్రేటు ముందు చెప్పుదువుగానీ నీ కథ."

"నా మాటలు వినండి"

"సరి! మాటలు వినాలట. అందుకిపుడు విరామం లేదు. కేసు ముగిసిన తర్వాత జరిమానా యిచ్చిరా. తర్వాత నెమ్మదిగా కూచుని మాట్లాడుకుందాం. ఇప్పుడు నడు స్టేషనుకు."

"ఈసారి క్షమించండి. తప్పయింది." ఇలా అయినా,

తప్పు ఒప్పుకోవడం వల్లనయినా, మెతకబారుతాడేమోనని ఆలోచించాడతడు.

"క్షమించేందుకు నేనెవడిని? నేను కూడా ఒక బంటుని. చెప్పేదేమున్నా కోర్టులో చెప్పుకో. ఇపుడూరికే తొందర కలిగించకు. కోపించుకుంటే నేను మంచివాడిని కాను, చూడు!"

"అది కాదండీ...."

"ఏయ్! నీ 'అదికాదండీ' కింత అగ్గివడ! మంచిమాటల్తో స్టేషనుకు రావయ్యా అంటే, లేనిపోని మాటలన్నీ పెంచుతాడు. ఇపుడేమి నీవు వూరికే వస్తావో, లేదో?" అంటూ ఓర్పు నశించిన వాడిలా మండిపడ్డాడు శివన్న. సైకిలువాలాకూ అది తెలిసినట్లగుపించింది. మెల్లగా జేబులో చేయిపెట్టాడు. శివన్న మనస్సు కూడా విచ్చుకుంది. అతడు జేబులో చేయిపెట్టి తడుమాడుతున్నాడు. ఇప్పుడే మంచి మాటలు ప్రారంభించాలి అన్నది శివన్న అనుభవంతో అభ్యసించిన మనస్తత్వశాస్త్రం.

"అదికాదండీ" అతడి చేయి జేబువద్దకు వెళ్ళినంతనే బహువచన సంబోధన మళ్ళీ ఆరంభమయింది. "అదికాదండీ. మీరు చూసేందుకు కాలేజీలో చదువుకునే యువకుడిలా వున్నారు. మీలాంటి తెలిసినవాళ్ళే ఇలా చేయవచ్చునేమండీ? ఎవరి మంచి కండీ సర్కారువాళ్ళు చట్టంచేసి వుండేది? మీరు సైకిళ్ళకు దీపాలు ముట్టించుకుని వస్తే, మా పొట్టలు నిండుతాయేమండీ? మందికి తొందర కలుగకూడదని చట్టం చేస్తే, ఇదేనా మీరు చదువుకున్నవాళ్ళు దానికి చూపే మర్యాద?"

శివన్న మెల్లగా మాట్లాడడానికి ప్రారంభించిన వెంటనే, అతడి మనస్సు కరిగింది అని తెలిసో యేమో అతడు జేబులో పెట్టిన చేయి బయటికి తీసి చేతిగుడ్డతో ముఖం తుడుచుకుంటూ, "ఖండితంగా చెబుతూన్నానండీ నేను. ఇలాంటి చిల్లర విషయాలకంతా అబద్ధం చెప్పేవాడిని కాను నేను. నిజంగా దీపం ముట్టించుకునే వచ్చాను. పాడు గాలి. ఎప్పుడారిపోయిందో అది కూడా తెలీలేదు. పరీక్షించాలంటే, మీరే ముట్టి చూడండి. ల్యాంపు ఇంకనూ వెచ్చగా ఉంది." అంటూ మళ్ళీ మాటలకు లంకించుకున్నాడు.

శివన్నకు ఎక్కడలేని కోపమూ వచ్చింది ఈసారి.

"కాదయ్యా, మళ్ళీ మొదలు పెట్టావే, నీ పుక్కిటి పురాణం. నన్నిక్కడ సర్కారువాళ్ళు జీతమిచ్చి నియమించి వుండడం నీ దీపం చల్లగుందో, వెచ్చగుందో పరీక్షించేందుక్కాదు"

"నిజం చెప్పినా నమ్మకపోతే నేనేం చేయాలండీ?"

"అదే చెప్తూన్నా. నీవేమీ చేయవద్దు. స్టేషనుకు పద అని చెప్పాను గదా?"

మబ్బుపట్టి గగనం చినుకులు రాల్చుతోంది. చినుకులు రాలడం మొదలవడంతో శివన్నకు తొందర కూడా ఎక్కువవుతోంది. అయితే అతడు ఇటు స్టేషనుకూ బయలుదేరడు; అటు అక్కడే తీర్మానమూ చేసుకోడు.

"ఇప్పుడు నీవు మంచి మాటల్తో బయల్దేరుతావో, లేక రెట్టపట్టి లాక్కుపోవాలో?"

"ఏమండీ, లాక్కుపోతాను, గీక్కుపోతానంటూ శానా జోరుగా మాట్లాడుతారు? కొంచెం గౌరవంగా మాట్లాడండి."

"అరే, పదవయ్యా. గౌరవం కావలసినవాడివి గౌరమ్మలా ఇంట్లో వుండాల్సింది. దీపం లేకుండా సైకిలు వేసుకుని వచ్చి, లేనిపోని గౌరవాన్ని గూర్చి మాట్లాడతాడు నా ముందు!"

"చూడండి. మీరలా మాట్లాడకండి."

"పోరా, పోరా, పోరగా! నీలాంటి పోరగాళ్ళని వేలాది మందిని చూశాను. మాట్లాడవద్దంటావ్? ఏం మొరుగుతావో, మొరుగరా, చూద్దాం."

అందుకతడు ఏమి జవాబు చెప్పేవాడో యేమో, శివన్న బిగుస్తూన్న పిడికిలి ఏమి ఉత్తరం చెప్పేదో యేమో? అంతలోనే ఎవరో లక్షణంగా సూటూ, జలతారు తలపాగా ధరించినవారొకరు వచ్చి, "ఏమయ్యా, గోల?" అన్నారు. వేరేవాళ్ళయి వుంటే శివన్న 'మూసుకొని పోవోయ్, నీకెందుకు' అంటూ దబాయించి పంపివుండేవాడు. అయితే ఈ ఆసామి వైభవోపేతంగా సూటు వేసుకుని, నిగనిగలాడే జలతారు పాగా ధరించి, చేత దంతపు పిడి గల వాహ్యాళి కర్ర పట్టుకుని వచ్చివున్నాడు. ఎవరో, ఏమో! అసలే చన్నీళ్ళు చల్లార్చుకుని తాగే కాలం! అందుచేత వినయ విధేయతలతో గోలకు దారితీసిన కారణం వివరించాడు. 'ఏం లేదండి, సార్. దీపం లేకుండా సైకిల్ తొక్కుకుంటూ వచ్చారు. స్టేషనుకు రాండి అన్నాను. లేనిపోని పంచాయితి చేస్తూన్నారు సార్." అన్నాడు.

శివన్న మాటలు ముగించేటంతట్లోనే, అతడు, "అలా కాదు, సార్. మంచి సమయానికి వచ్చారు మీరు. సైకిల్ దీపం ముట్టించుకునే వచ్చాను, సార్. పాడైన గాలి చూడండి, సార్. ఎలా రయ్యమని వీచుతోందో? మనుషులే దీని దాడికి తట్టుకోలేరు. మరి, దీపం తట్టుకోగలదా? ఆరిపోయింది. అలా అని చెబితే ఇతడు నా మాట నమ్మటంలేదు"

"మీరే చెప్పండి, సార్. ఇతడి మాట నమ్మాలా? నా కళ్ళు నమ్మాలా? దీపం లేదనడం నా కళ్ళు చూస్తున్నాయి. ఇతడు మాత్రం అప్పటినుండీ తను పట్టిన మొండిపట్టును అంటి పెట్టుకు కూర్చున్నాడు."

"నా మాటా నమ్మకండి. ఇతడి మాటా నమ్మకండి. దీపం ముట్టి చూడండి, సార్ - ఇంకా వేడిగానే వుంది"

ఆ దీపాన్ని తినివేయాలనేటంతటి కోపం వచ్చింది శివన్నకు. అదీకాక, మూడవవాడి పంచాయితీ వినేటంతటి ఓపిక కూడా ఉండలేదతనికి. అయితే, ఏం చెయ్యాలి? జలతారు పాగా, సర్జ్ సూటూ, దంతపు పిడి వాహ్యాళి కర్ర! అదృష్టంమీద భారం వేసి పూరకయ్యాడు.

సూటుధారి దీపం ముట్టుకుని చూశారు - వాగ్వాదం నడిచే టప్పుడు. లంచానికి ఓడిపోని సాక్షిలాగా వెచ్చగా వుండటానికి దీపమేమి ప్రాణముండే వస్తువా? ఎంతైనా సత్తుది కదా, కొంత సేపట్లోనే చల్లగై వుంది. వారు సైకిల్‌వాలా, శివన్నల ముఖాలను తదేకంగా చూశారు. ఏమి చెబుతారో అంటూ వాళ్ళిద్దరూ ఆత్రంగా ఉన్నారు. సైకిల్‌వాలా ముఖం అబద్ధాలు చెప్పేవాడి ముఖంలా లేదు. అయినా అతడు మాత్రం ఏమి చెప్పగలడు-దీపం చల్లారి పోయి వుంది కనుక! అయినా వారు సైకిల్‌వాలాలాంటి అనుభవ రహితులు కారు. శివన్న ముఖం చూసి తెచ్చికోలు నవ్వుతో, 'ఇక్కడ రండి' అని పిలిచారు సైకిలువాలాను.

శివన్నకు ప్రాణసంకటం. సూటుదారి సైకిలువాలాకు ఏమని బోధిస్తాడో, చేతికందిన ముద్ద ఎక్కడ నోటికందక పోతుందో, ఇక ఈ పాపి, 'పదా, స్టేషనుకు వస్తాను' అంటే, సుఖంగా ఇంటికి పోవడానికి బదులుగా స్టేషనుకు పోయి చావాలి కదా, ఈ ఉపద్రవం ఎందుకొచ్చిందిరా భగవాన్ ఈ రోజు? అంటూ మనసులోనే క్వినైన్ మాత్రలు మింగుతూన్నాడు.

అంతలోనే సూటుధారి సైకిల్‌వాలాకు ఏమో చెప్పి, శివన్నవైపుకు తిరిగి 'నీ పేరేమయ్యా?' అన్నారు. శివన్న ప్రాణం గొంతులో ఇరుక్కుంది. 'శివన్న, సార్' అన్నాడు గుక్కిళ్ళు మింగుతూ. "ఇక్కడ చూడు, శివన్నా, ఇలాంటి పొరపాట్లు ఒక్కొక్కసారి తెలిసో, తెలియకో జరుగుతాయి. ఏం చేయాలి? ఊరికే కోర్టు కచేరీలకు తిరగడం వద్దు. ఏమున్నా ఇక్కడే సర్దుబాటు చేసుకుని పంపించు పాపం - వీరిని ఇంటికి. ప్రొద్దుకాని పొద్దు." అని, "ఏమండీ, మీరు కూడా అలా మాట్లాడకూడదండి. ఎలానో సర్దుకుపోవాలి. పోలీసువాళ్ళు కూడా మనుషులేగా? వాళ్ళకు దయాదాక్షిణ్యా లుండవా? ఇంత పొద్దులో అతడికి మీరు కావాలి; మీకతడు కావాలి. ఎలానో ఇక్కడే సర్దుకుని ఇళ్ళకు పోండి" అంటూ చెప్పి, వెళ్ళిపోయారు బూటు కాళ్ళు టపీ టపీమనిపిస్తూ. శివన్న యాంత్రికంగా సలాం కొట్టి, తన వలలోని మృగంవంక చూశాడు. వారు మాట్లాడిన మాటలు విని, అతని హృదయంలో ఆశ పొటమరించింది.

"పోనీ వదలండి. ఈ సంగతి మరచిపోండి" అంటూ సైకిలువాలా మళ్ళీ జేబులోకి చెయ్యి పెట్టాడు. కలగా మారి పోయిన శివన్న ఆశ మళ్ళీ కనబడే ఆకారాన్ని ధరించ ప్రారంభించింది.

"వారిలాంటి పెద్దవాళ్ళు చెప్పినాక మరేం చేయాలి చెప్పండి" అన్నాడు శివన్న పట్టు వదిలి.

అతడు ఏమోతీసి పిడికిటిలోనే మూసిపెట్టుకుని, శివన్న వైపు చేయి చాచాడు. శివన్న పిడికిలినే చూశాడు. ఎంత అనటం కనబడలేదు. అయినా చాచాడు చేయి. అతడు తన చేతిలో వుండేదాన్ని శివన్న చేతికి చేర్చి "ఇంతే ఉండేది. క్షమించాలి" అన్నాడు. శివన్న తీసి చూశాడు. ఎనిమిదణాల వెండి నాణెం. వేరే దినం, వేరే సమయంలో అయితే ఇచ్చినవాడి ముఖానికే దాన్ని తీసి కొట్టివుండేవాడు. అయితే అన్ని దినాల్లా కాదు ఆ దినం. అదీకాక, అతడు "ఇంతే వుండేది" అంటూ చెబు తూన్నాడు కూడా. ఊరక వాగ్వాదమెందుకని, 'చూడండి సార్. నేనలాగా లంచానికి నోరు తెరిచేవాడిని కాదు. అయినా ఆ పెద్ద వారు చెప్పినాక, వారి మాట తీసివేయడాని కవుతుందా? వెళ్ళండి, పాపం. పొద్దయింది." అన్నాడు. అతడు 'థ్యాంక్స్' అంటూ చెప్పి, సైకిల్ ఎక్కబోతూన్నాడు. అంతలోనే యేదో మతికి తట్టి, మళ్ళీ కిందికి దిగి, ఆరిపోయిన సైకిలు దీపమంటించి, శివన్న ముఖం చూసి నవ్వి, బయల్దేరాడు. శివన్న కూడా నవ్వాడు. అతడికీ అర్థమై వుంది.

ఇంతకూ వ్యర్థం కాలేదు అంతసేపూ పడిన కష్టం. ఖాళీ చేతుల్తో ఇంటికి పోవాలి కదా!-అంటూ బాధపడుతూన్న శివన్నకు ఎనిమిదణాలు చిక్కడం సంతోషంగా ఉంది. దూరంలోని గోపురం గంట 12 కొట్టింది. అతడికి బదులుగా వచ్చే పోలీసు వాడూ వచ్చాడు. అతడి దగ్గరనే ఒక బీడీ ఇప్పించుకుని, ముట్టించుకుని, ఈల వేసుకుంటూ ఇంటివైపు నడిచాడు. సేట్ హోటలులో గమగమలాడే ఒక లోటా కాఫీ తాగి, ఇక కట్ట బీడీలు కొనుక్కునిపోతే, మరుసటిరోజు మధ్యాహ్నం వరకూ ఫరవాలేదు. అయితే చాలా పొద్దుపోవడంవల్ల రోజూలాగ పెళ్ళా

నికి పూలు తీసుకుపోవడం కాదు కదా అంటూ మనస్సులో బాధ అతడికి. అయితే యేం? ఆమెకూ ఒక పావు కారపుతిండి కట్టించుకు వెళ్ళితే సరి. ఇద్దరూ నెమరువేయవచ్చు అని సమాధానపడుతూ, హోటల్ దిక్కుగా వేగంగా అడుగులు వేశాడు - ఆలస్యమైతే అతడు కూడా తలుపులు మూస్తాడనుకుంటూ.

హోటలు తలుపు మాత్రం ఇంకా తెరిచే వుంది. అయితే దాని ప్రక్కలోని బీడీల అంగడి నాయుడు అప్పుడే తలుపులు మూయడం మొదలెడుతూన్నాడు. అందుచేత హోటల్లోకి వెళ్ళేందుకు ముందే, బీడీల అంగడికెళ్ళాడు. తలుపులు మూస్తూన్న నాయుడు, "ఏం కావాలి, శివన్నా? ఎందుకింత ఆలస్యం? భోజనమయిందా? లేక, ఇంకా ఇంటికి పోలేదా?" అంటూ ప్రశ్న పరంపర గుప్పించాడు. "లేదు నాయుడూ. ఇంకా భోజనమూ లేదు; ఏమీ లేదు. ఇప్పుడే డ్యూటీ ముగిసింది. అలా కాఫీ తాగి పోదామని వచ్చాను. ఒక కట్ట గణేశ్ బీడీలివ్వు" అన్నాడు. నాయుడు బీడీలకట్ట తీసియిచ్చాడు. శివన్న అతడికి ఎనిమిదణాల నాణెం ఇచ్చాడు. నాయుడు ఆ నాణేన్ని అలానే గల్లాపెట్టెమీద పెట్టాడు. 'ఇంకా భోంచేయలేదంటావ్. సొగసైన మాంచి లేత మైసూరు తమలపాకులొచ్చాయి. తీసుకోపోరాదా? ఒక రోజయినా జల్సాచేయి." అన్నాడు. పూలు లేకుండా పోనీవాలే అంటూ భయపడుతూన్న శివన్నకు అది సరైందని అనిపించింది. "ఔం. ఒకణా తమలపాకులివ్వు. జల్సా చేసివేద్దాం. ఎవరి నాన్న సొమ్మేం పోవాలి?" అన్నాడు. ఒక అణా తమలపాకులు ఎంచి యిచ్చి, మిగిలిన ఆరణాల పోడిచిల్లర శివన్న చేతిలో పెట్టాడు. నాయుడు. చిల్లర జేబులో వేసుకుని వెళ్ళిపోయాడు శివన్న.

ఇంకా హోటలు వాకిలి కూడా చేరలేదు - శివన్న. అంతలోనే, "ఏయ్, శివన్నా, రా, ఇక్కడ." అంటూ అరిచాడు నాయుడు. ఇదేమి గ్రహచారం దేవుడా అంటూ వెనుదిరిగాడు శివన్న. "మాంచి పెద్దమనిషిలా ఉన్నావు కదయ్యా నీవు? చీకటి పొద్దంటూ చెల్లని నాణాన్నా, నీవిచ్చేది?" అంటూ దబాయించి నాయుడు శివన్న ఇచ్చిన ఎనిమిదణాల నాణేన్ని అతని ముఖానికి పట్టి చూపించాడు. శివన్న చూశాడు. చూస్తే చెల్లని నాణెంలా కనపడలేదు. వేలిమీద పెట్టుకుని పైకెగిరించాడు. 'టంగ్' అన్నది ఎనిమిదణాలు. కంచు శబ్దం! "ఫరవాలేదయ్యా, పోలీసోడై యిలాంటి మోసమా చేసేది? డబ్బు లేకుంటే, తర్వాత ఇస్తానంటే అప్పిచ్చేవాడిని కదా?" అన్నాడు నాయుడు. గాయం మీద ఉప్పు నూరినలా అయింది. శివన్నకు నోరు పెగల్లేదు. ముఖం తెల్లబోయింది. తమలపాకులూ, బీడీల కట్టా, చిల్లర డబ్బూ - అన్నింటినీ అంగడిలోకే విసరిపారేసి, బయలుదేరాడు!

---

# విశ్వ తృష్ణలు

## శ్రీ చెన్నోజు రామమోహనరావు

దైనందిన జీవన కలత నిదురలు
అర్వో కలర్ కలల సినీ రీళ్ళు
జాగ్రదవస్థ జీవన బరువుల బుక్కలు
ఈ నిస్తబ్ద నీరవ చీకటి యామినులు
కీచురాళ్ల కింకృతాలు - శబ్ద పద్మవ్యూహాలు
కృషీవలుల ఆహారోత్పత్తి ధాన్య రాశులు
'ఏమీ కాని-ఏమీ లేని సుషుప్తి' నైరూప్య చిత్రాలు
రాత్రి రెండు గంటలప్పటి మేల్కొన్న నిశిత నిశ్శబ్దాలు
ఒక ఘడియ నిస్తేజాలు - పర ఘడియ తేజోవంతాలు
కవులు సృష్టించు కావ్యాలు - చదివి స్పందించు
హృదయాలు
జీవసహిత జీవరహిత విశ్వ ప్రపంచాలు
శూన్య జఢ చైతన్యాల ప్రవాహాలు
నిరామయ అఖండ వెలుగులు
తురీయ పిపాసలు - తాదాత్మ్యతలు - సంలీనాలు
శక్తియుత ఆత్మ శకలాల జన్మ రాహిత్యాలు
ఇలా —
ఈ అనంత మహా విశ్వానికి
ఎన్నెన్ని అనురాగ తృష్ణలో—
మరెన్ని అందాల అభినయ కౌశలాలో—

# అనంత పునరావృత పరంపరలో...

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

ఎన్నాళ్లదో
ఈ సాగర ఘోష
అనంతంగా
ఆద్యంతం నా అంతరాత్మలా!
కొండ లెన్ని శిలలైనా
శిలలెన్ని శిల్పాలైనా
ఆ శిల్పాలు అణువులై
సాగర గర్భంలో కలుస్తోంది
ఎన్ని చరిత్రలు అందులో కూరుకొనిపోయాయో
అందుకే అంత బడబానలం
నా గుండెలో మల్లే!

శిథిలాలు....
విషాద మధుర స్మృతులు
వగరు తీపి గురుతులు
గత వైభవ సంకేతాలు
కనుమరుగైన వసంతాలు
అనుభూతులై
మరపురాని అంతర్య శ్రుతుల్లో
కలకలం రేపుతుంది
రేపు అంటే కళ్లు తెరిచే నా ఆశ
రెప్పలు రెప రెపలాడించుకొన్నప్పుడు
నాలో కలిగే కోలాహలం లాగున!

ఆశయమనే
చెలియలి కట్టను చేరుకోవాలని
పరువంపు ప్రాయాల
పరుగు పరుగుల పడచు కెరటాలు
ఎంతో ఆశతో
నాలో ఉన్నంత ఆశతో
ఉవ్విళ్లూరుతూ వస్తే

చేరీ చేరకముందే ప్రాణత్యాగం
ఆశ నిరాశైనప్పుడు
నిట్టూర్పలేక నేను
నవ్వుసి త్యాగం చేసినట్లు!

తలుపులూ తలపులూ రెండూ వాలిపోయి
బీడుపడి తల పండిన దేవళంలో
జీర్ణమైపోతున్న ప్రతిమ ముందు
కొడిగడుతున్న దీపం
గాలి వేటుకు తప్పించుకొంటుందా
ఈ నగటు మనిషి కోరికలా
రెప్పలక్రిందే
గుండె పొరల క్రిందే
అణగారిపోతుంది తప్ప!

శిల్పి లేడు
కళా ఉండదు
ఛిద్ర శకలాలు ఉండవు
ఆనవాళ్ల జ్ఞాపకాలే ఉండవు
ఈ సాగరం చాల గొప్పది
మధించి పారేస్తోంది!
అంతఃసాగరం దాన్ని మించింది
అనంతాన్ని అద్భుతంగా దాచుకుంటోంది!

అయినా ఆ నీలి కెరటాలు వస్తూనే ఉంటాయి
ఉలి లయలు అలలు అలలుగా వినిపిస్తూనే ఉంటాయి
శిల్పాలు కదలాడుతునే ఉంటాయి
మట్టి రేణువులు ఈదులాడుతునే ఉంటాయి
ఈ సముద్రగర్భం అగాధమౌతూనే ఉంటుంది!
ఎంతకూ అర్థంకాని ఆర్తి పెరుగుతునే ఉంటుంది!
ఈ చర్యలన్నీ చిరంజీవులు!
వీటికి ప్రత్యక్ష సాక్షి నిత్య కాల ప్రవాహం!

డా॥ చిలకమర్తి దుర్గాప్రసాదరావు

# వసుచరిత్రకారునిపై కాళిదాసు ప్రభావం

ఆంధ్ర సాహిత్య చరిత్రలో రాయల యుగమొక స్వర్ణ యుగం. ఈ యుగాన్నే ప్రబంధ యుగమని కూడ వ్యవహరిస్తూ ఉంటారు. ఈ యుగంలో వెలువడ్డ ప్రబంధాల్లో వసుచరిత్ర సానలందీరిన జాతిరత్నంగా చెప్పబడుతోంది. ఇది ఒక విలక్షణ మైన మహాప్రబంధం. ప్రబంధముల పంక్తిలో దీనికొక ప్రత్యేకమైన స్థానముంది. రామరాజ భూషణుడు ఈ గ్రంథాన్ని రచించడానికి తన యావచ్ఛక్తి నుపయోగించి యున్నాడనియు; వసుచరిత్రమునందు శ్లేషయో, ధ్వనియో, శబ్దాలంకారమో, అపూర్వమగు భావసౌష్ఠవమో, వర్ణనా చమత్కారమో లేని పద్య మరుదనుట సాహసము కాదని శేషాద్రి వేంకటరమణ కవులు పేర్కొన్నారు. ఈ వసుచరిత్ర తిరుమల దేవరాయునకు అంకిత మీయబడినది.

సాధారణంగా సంస్కృత కావ్యములు తెలుగులోని కనువ దింపబడటం అనాదిగా వస్తున్న సంప్రదాయం. కాని వసుచరిత్ర విషయంలో అది తారుమారైనది. ఆ కావ్య సౌందర్యానికి ముగ్ధుడైన కాళహస్తి కవి ఆ కావ్యాన్ని సంస్కృత భాషలోనికి అనువదించడంవల్ల ఆ గౌరవం మున్ముందటగా వసుచరిత్రకే దక్కిందని చెప్పాలి. అంతేగాక ఆ కావ్యం మఱెన్నో భారతీయ భాషలలోనికి అనువదింపబడింది.

సాధారణంగా ప్రాచీన కవుల పోకడలను అనువదించడమో లేక అనుకరించడమో అర్వాచీన కవులకు పరిపాటి. వసుచరిత్ర కారుడు కూడ ఈ సంప్రదాయాన్నే అనుసరించాడు. ముఖ్యంగా కవికుల తిలకుడైన కాళిదాసు యొక్క ప్రభావం ఆయనపై ఎంతో ఉంది. ఈ అంశాన్ని శ్రీ శేషాద్రి రమణ కవులు తమ వసుచరిత్ర పీఠికలో సంక్షిప్తంగా ప్రస్తావించారు. ప్రస్తుతం ఈ వ్యాసంలో మఱికొన్ని విశేషములు సంగ్రహంగా పొందుపరచ బడుచున్నవి.

వసుచరిత్రకారునకు మహాకవి కాళిదాసుపై అమితమైన గౌరవముంది. ఆయన తన కావ్యావతారికలో ప్రాచీన కవులను స్తుతిస్తూ "నేను నీవను మాట వెనయించె నెవ్వాడు" (1ఆ. 9ప) అని పలికాడు.[1] ముఖ్యంగా వసుచరిత్ర కర్తపై శాకుంతల కుమార సంభవాలు అధిక ప్రభావాన్ని ప్రదర్శించాయి. అసలు కాళిదాసును అనుకరించడం కోసమే కవి అటువంటి ఇతివృత్తాన్ని స్వీకరించియుండునని భావించడంలో తప్పేమీ లేదు. కాళిదాసుని పార్వతి పర్వత పుత్రిక. వసుకారుని నాయికయగు గిరికయు పర్వత పుత్రికయే. అంతేగాక ఆమె తండ్రి సాక్షాత్తుగా జగజ్జననికి అనుంగు దమ్ముడగుట విశేషం. మఱియు కాళిదాసుని పార్వతి వలె వసుకారుని గిరికయు ముగ్ధయే. కాని పార్వతిలోని పట్టుదల, కార్యదక్షత ఈమెలో అంతగా కన్పించవు. ఈ విధంగా పార్వతీ గిరికలకు చాల పోలికలు కన్పిస్తాయి. గిరిక బాల్యక్రీడలు, పార్వతి బాల్యక్రీడలవలె కవిచే సహజ సుందరంగా వర్ణింప బడ్డాయి. గిరికపాత్ర ముఖ్యంగా బాల్యమందు పార్వతిని, యౌవనమున శకుంతలను తలపింపజేయును.

వసుచరిత్ర కావ్యనాయకుడగు వసురాజు ప్రవేశము శాకుంతల నాటకములోని దుష్యంతుని ప్రవేశమును జ్ఞప్తికి దెచ్చును. గిరికా వసురాజుల సమాగమం శకుంతలా దుష్యంతుల సమాగమాన్ని పోలియున్నది. వసుచరిత్రలోని మంజువాణి శాకుంతలములోని ప్రియంవదవలె చతురవచో విలాసిని. నాయిక యగు గిరికయొక్క చెలులు ఆమె జన్మ వృత్తాంతాన్ని నాయకు డగు వసురాజుకు వివరించుట అభిజ్ఞాన శాకుంతలములోని శకుంతలా వృత్తాంత కథనాన్ని పోలియున్నది. ఇంక దుష్యంతు నకు విదూషకునివలె వసురాజుకు కూడ సహచరుడు కలడు. కాని ఇతడు కాళిదాసుని విదూషకునివలె మృత్పిండబుద్ధి కాక మిక్కిలి చతురుడై గిరికా వసువుల సంధానకర్తగా వ్యవహరించును.

కాళిదాసు తన కుమార సంభవంలో పార్వతియొక్క ముఖ సౌందర్యాన్ని గూర్చి వర్ణిస్తూ.

"చంద్రం గతా పద్మగుణాన్న భుంక్తే
పద్మాశ్రితా చాంద్రమసీ మభిఖ్యాం
ఉమా ముఖం తు ప్రతిపద్య లోలా
ద్విసంశ్రయం ప్రీతి మవాపలక్ష్మీః" (1సర్గ. 43శ్లో)

అనే శ్లోకాన్ని రచించాడు. ఈ శ్లోకంలోని కల్పనా చమత్కృతిని ఆధారంగా గైకొని వసుచరిత్రకారుడు నాయిక

1. "త్వమేవాహం న సంశయః"

యగు గిరికయొక్క నేత్ర సౌందర్యాన్ని వర్ణిస్తూ తనయొక్క సహజ శ్లేష కవనా చమత్కృతితో ఇంకను రామణీయకతను చేకూర్చినాడు.

"తన రాజీవ కరం బెఱుంగదు నిశా తత్వంబు లేగల్వ తూ
పునకుంజాలదు వేగలీల యని యా పూముల్కు-లెగ్గించి క్రొ
న్ననవిల్కాఁడు నవాంబుజోత్పల వితానంబీను మీనాక్షి లో
చన ముల్వింట ఘటింపఁ బొల్చెనవి నిస్తంద్రాంబక ఖ్యాతులన్"

ఆమె నేత్రములు తెల్లదామర రేకుల కంటెను, నల్ల గల్వ రేకుల కంటెను అతిశయించిన చక్కదనము గలిగి మన్మథ బాణముల వలెనున్నవని వర్ణించుటలో కాళిదాసుని ఉక్తివైచిత్రిని అనుసరించినాడు.

కణ్వుడు శకుంతలను అత్తవారింటికి పంపు సందర్భంలో కాళిదాసు రచించిన శ్లోకములు సార్వకాలికములు సార్వభౌమికములు. అందువల్లనే "కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా, తత్రాపి స చతుర్థోంఽకః, తత్ర శ్లోక చతుష్టయమ్" అనే నానుడి పండిత లోకంలో బాగా విస్తరించింది. ఆ శ్లోక చతుష్టయ సౌందర్యానికి ముగ్ధుడైన వసుకారుడు అందలి కొన్ని శ్లోకములను అనుసరించకుండ ఉండలేకపోయాడు. గిరికను అత్తవారింటికి సాగనంపు ఘట్టంలో కవి ఆ యవకాశాన్ని పూర్తిగా వినియోగించుకున్నాడు.

"యా స్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట
ముత్కంఠయా
కంఠస్తంభిత బాష్పవృత్తి కలుష శ్చింతాజడం దర్శనమ్
వైక్లబ్యం మమ తావదీ దృశమహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం ను తనయా విశ్లేష దుఃఖై ర్నవైః"
(అభిజ్ఞాన శాకుంతలం 4- ).

"హేమలతా నిభాంగికి నధీశ నివేశ నవప్రవేశ దీ
క్షా మహనీయ మంగళము సర్వము సాంగముగా ఘటించి య
క్కోమలిఁ జేరఁబిల్చి తలగ్రుచ్చి కవుంగిటఁజేర్చి భూధర
గ్రామణి వల్కు-గాఢతర గద్గదికా ఘన నిస్వనంబునన్"
(వసు - 6-54)

ఇట "కంఠ స్తంభిత బాష్పవృత్తి కలుషః" - అనే కాళిదాసోక్తిని "గాఢతర గద్గదికా ఘననిస్వనంబునన్" అని వసుకారుడు యథాతథముగా అనుకరించుట గమనార్హము.

అదేవిధంగా

"శుశ్రూషస్వ గురూన్ కురుప్రియసఖీ వృత్తం సపత్నీజనే
భర్తృ ర్విప్రకృతాపి రోషణతయా మా స్మప్రతీపం గమః
భూయిష్టం భవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సే కినీ
యా న్త్యేవం గృహిణీపదం యుపతయోవా మా కులస్యాధయః"

-అనే కణ్వుని బోధనలోని సారాంశాన్ని వసుచరిత్రకారుడు రెండు పద్యాల్లో నిబద్ధించాడు. మఱియు తన సహజసిద్ధమైన శ్లేష కవనా చమత్కృతితో ఇంకా కొంత రామణీయకతను కూడ సాధించినాడు.

"మాఱు మాటాడదు మఱచియైనను గురు
వ్యాహారమునకీ యహార్యతనయ
యానమ్ర గతిబూను మానంపు సవతు లె
న్తైన నీ దివ్య రత్నానుజాత
తాగయై యేర మీ అదొకప్పుడును ఘన
శ్రీలఁ బొంగియును నీ సింధుకన్య
యేకాకృతి వహించు నినురాగవృత్తికి
నపరాగ వృత్తికి నబ్జసహజ

తే॥ యచ్చెరువు వింత యబ్బురం బరిది యనుచు
విశ్వధాత్రీశ్వరులు మెచ్చ వెలయవమ్మ
యమ్మ భవదీయ చిత్ర గుణాతిశయము
వలన మాకెల్ల వన్నె రా మెలగవమ్మ (వసు-6-56)

"పతికృత ధర్మకౌశలము పట్టునఁ దోడగునారి నారి దాఁ
చిత్ప్ర శరణ ప్రచింత మదిబెట్టక యీశవివేశితాత్మయో
నతి సతి రాశికెక్కి యనసత్కృతిఁ గైకొను కన్య కన్య శా
శ్వత మతి నిట్లుగా మనిన వామయె వామ గదమ్మ కోమలీ"

ఈ పద్యములలో శ్లేషవలన అర్థస్ఫూర్తికి కొంత ఆటంకము వాటిల్లినను రామణీయకతకు భంగము వాటిల్లలేదు, "యా న్త్యేవం గృహిణీపదం యువతయో వామా కులస్యాధయః" అన్న కాళిదాసు వాక్యములలోని అభిప్రాయాన్ని వేతొకరీతిలో "శాశ్వతమతి నిట్లుగా మనినవామయె వామ గదమ్మ కోమలీ" అని సంతరించుట గమనార్హము. ఇచ్చట వామయను శబ్దమును సందర్భానుగుణముగా ప్రయోగించుట కవి చాతుర్యమును సూచించుచున్నది.

మఱియు అదే సందర్భంలో కోలాహలుడు గిరికతో పల్కిన పల్కులలో

"ఈశైవాలవతీ ప్రతీర భజనం బీనిర్మల ప్రస్తరో
ద్దేశావాస మునీమృగార్భక శకుంతానఖ్యమున్ లేమి చిం
తాశల్యంబు వహింపకమ్మ" అను పద్యంలోని "మృగార్భక శకుంతాసఖ్యమున్" మున్నగు పదములు అభిజ్ఞాన శాకుంతలాన్ని పాఠకులచే తలపింపఁజేయడానికే కవి ఉపయోగించి యుండనోపునని భావించడంలో అసామంజస్యమేదియు నుండబోదని నా అభిప్రాయము.

ఈ విధంగా వసుకారుడైన రామరాజభూషణుడు యధావకాశం కాళిదాసును అనుకరించి రచన కావించాడు. ఇటువంటి విశేషములు గ్రంథమందింకను ఎన్నో ఉన్నప్పటికి గ్రంథవిస్తర భీతిచే వాటన్నిఁటిని పొందుపఱుప వీలుగామిఁ బాఠకుల స్వయముగా నరయఁ గోరుచున్నాను.

# డిసెంబర్...

ఈ జామున మంచు పలుచని
తెల్లకాగితంలా నేలని తాకుతోంది.
చలి తన ఇంటి అడ్రసు దొరక్క
వీధులన్నీ తిరుగుతోంది.

గది మూల దాగి ముడుచుకుంటున్న పిల్లి శరీరంలో-
నేలని కొద్దివరకూ తవ్వి-అందులో గువ్వలా ఒదిగిన
కుక్క అంతరంగంలో
పొలిమేరన దేవాలయంలో
గోడచాటు కూర్చుని చాలని బట్టలతో
వణుకుతున్న వృద్ధ బిచ్చగాడి హృదయంలో
చలి విశ్వరూపం కనిపిస్తోంది.

# శాంతి కోసం...

ప్రకృతిని శ్వాసిస్తూ
విషాన్ని నిశ్వాసించే
ఈ మనుషుల మధ్య మనలేక
తగిలిన గాయాలని నెమరేసుకుంటూ
తగుల్తున్న గాయాల్ని ఓదార్చుతూ-
వర్తమానంతో రాజీ కుదరక
భవిష్యత్తు నూహించే ధైర్యం లేక
ఏ జామురాత్తో, ఈ విషవలయం నుండి
ఎడారులకేసి దౌడు తీయాలని-
సతమతమవుతున్న నా మనసు సేద తీర్చాలని.

శాంతికపోతాలు-హిమ సమూహాలు-తెల్లగులాబీలు
ఈ అంతులేని ముళ్లడొంకలని దాటలేవని
దాటి మనలేవని, ఏ రాత్రి గర్భంలోనో
హద్దులేని ఆ విశాల అడివిలో-వెల్లని చంద్రుని నీడలో
ఏ చెట్టు కిందయినా అడివే నేస్తం
నిశ్శబ్దంగా పారుతున్న నదియే నేస్తం
అక్కడ తెల్లగులాబీలు ప్రశాంతంగా
వికసిస్తాయి.
శాంతికపోతాలు హిమ సమూహాలతో
కలసి స్నేహం ప్రకటిస్తాయి.

# వెన్నెల వసంతం

గజల్ ఆస్వాదనలో నన్ను మరచి నడుస్తున్నాను
దారి పొడుగునా మంచు పాడే పాటకు
చర్మం పులకరిస్తోంది.

వీధంతా నిద్రమత్తుకు గురికాగా-
రాత్రి సుమాలు శీతగాలి చేత
ఏవో సందేశాలని పంపుతున్నాయి.

పెర్‌ఫ్యూమ్‌లా ఆవరించిన
నిశ్శబ్ద నేపథ్యంలో
స్వచ్ఛంగా వెలుగుతూ
నాకూ, నా నీడకు దారి చూపిస్తున్నాడు చంద్రుడు.

వసంత స్త్రీ ఊరిని తన తెల్లని చీర కొంగులో
దాచేసింది.

చలి ముందు దుప్పటి కూడా
తన ఓటమిని అంగీకరిస్తోంది.

అగరుబత్తి గదినిండా పొగలాంటి
తన సోయగపు పరిమళాన్ని పరచి
మళ్లీ గజల్ వినిపిస్తోంది!

రఫి

డా॥ ఎ. హనుమంతప్ప

# కుమార భారతి - అభిషేక గాథ

'కుమార భారతి' ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు రచించిన కావ్యకమలము. అందులో కుమారస్వామిని దేవతల సైన్యాధిపతిగా నియమించే సమయంలో జరిగిన సుందరమైన అభిషేక ఘట్టం - ఈ వ్యాసంలో ప్రదర్శించడం జరిగింది.

కుమారస్వామి తాను పుట్టిన మూడు దినాలకే క్రౌంచ పర్వతాన్ని శివధనుస్సుతో తొలిచి రంధ్రం చేస్తాడు. అప్పుడు బ్రహ్మాండమైన శబ్దం ముల్లోకాలు దద్దరిల్లేటట్లు వస్తుంది. ఆ శబ్దం శత్రువుదేమో అన్న భయంతో ఇంద్రుడు తన పెద్ద సైన్యాన్ని తీసుకొని ఆ శబ్దం వచ్చినవైపు వస్తాడు. పుట్టిన మూడు దినాలకే దిక్కుల జరాల తొండాల నెత్తుకొని ఘీంకారంతో పరిగెత్తుతున్నట్లుగా శివధనుస్సును పట్టి పెనవెట్టి ఆవల వేసినటువంటి కుమారస్వామి జన్మవృత్తాంతం (దీనిపై పూర్తి వివరణ కోసం చూ. 'కుమార భారతి-కుమార జననం', భారతి, ఏప్రిల్, 1989) ఇంద్రుడు బ్రహ్మదేవుని ద్వారా విని, దేవ సేనా నాయకత్వాన్ని కుమారస్వామికి అప్పగించడానికి పూనుకుంటాడు.

షష్ఠి నేడు సరస్వతీ సైకతముల
సోమతీర్థాన దేవసేనా మనోజ్ఞ
ప్రభుతకున్ - వీని కఖిల శివంకరముగ
నిర్వహింపుమ - అభిషేక పర్వగాథ

(చతుర్థ కమలం - 56)

శరీరంపై కవచం కూడా లేకుండా శివధనుస్సు చేత పట్టుకొని ఉన్న చిఱుప్రాయం గల కుమారస్వామి - చాలా విస్తారమైన ఇంద్రుని సైన్యం ముందు నిలబడి ఉంటాడు. అట్టి కుమారస్వామిని (చ.క-4) సేనానాయకునిగా అభిషేకించుమని ఇంద్రునికి బ్రహ్మ చెప్తాడు. నేడు షష్ఠి. సరస్వతీ నదీతీరాన గల సోమతీర్థంలో ఈ అభిషేక కార్యాన్ని నిర్వహించమని బ్రహ్మ నిర్దేశిస్తాడు.

బ్రహ్మదేవుని వాక్కులు ఇంద్రుని మనస్సులో భక్తిని పుట్టింపజేయగా ఆర్ద్రతా క్లుప్తితో అధిక తేజోమయుడైన కార్తికేయుని చూసి ఈ విధంగా ప్రార్థిస్తాడు (చ.క-57).

కవిరాజ విరాజితము :

"జయ జయ రత్న సుసంగత కంకణ! స్వర్ణకిరీట దృషత్ ప్రసరా!
జయ జయ కుండల సంఘటితారుణ సాంధ్య కటస్థల చారుతరా
జయ జయ స్వర్ణ విశాల నగేశ్వష శక్తివిదారిత శత్రువరా
జయ జయ హే ఋతశాసన కారణజన్మ జగద్ధిత శాంతికరా"

(చ.క-58)

ఇక్కడ ఇంద్రునిచేత స్కందుని (కార్తికేయుని=కుమారస్వామిని) కవిరాజ విరాజితములో స్తుతింపజేయడం అందంగా ఉంది. కవిరాజ విరాజితమైతే స్తుతి చేసుకోవడానికి వీలున్న నడక - ఈ ఛందస్సులో ఉంది. ఇక్కడ పద్యం పాడాలి తప్ప చదువకూడదు. పద్యం పాడినప్పుడే ఎఫెక్ట్ కమ్యూనికేట్ అవుతుంది. (భావల ముక్తసరిగా అభివ్యక్తం అవుతుంది). ఈ పద్యంలో ఒక అంతర్లయ విశ్రుగతిలో ఉంది.

"తల్లి జగత్ప్రసూత మఱి తండ్రి జగత్పతి నీవు పుట్టి మూ
న్నాళ్లును కాసు లేదు భువనత్రయ దీవ్యదుదార ధర్మ సం
పల్లత కూతకోల యగు వజ్రము కుంఠితమయ్యె త్వద్భుజా
పల్లవితోగ్ర శక్తి - త్రిభువమ్ములకున్ బతి వీవ కాదగున్"

(చ.క-59)

'మీ తల్లిదండ్రులు జగత్తుకే తల్లిదండ్రులు. మరి నీవేమో పుట్టి మూనాళ్ళు కూడా కాలేదు. ముల్లోకాలలో ధర్మాన్ని సంరక్షించడానికి ఊతకోలయైన వజ్రాయుధము ప్రస్తుతం అశక్తమయింది. నీ గొప్ప భుజ పరాక్రమం చూస్తే నిజంగా ముల్లోకాలకూ పతి అయ్యే తాహత్తు నీకుంది' - అని కుమారస్వామిని మనసారా ఇంద్రుడు వేడుకుంటాడు.

దేవ సమూహమంతా నిశ్శబ్దంగా ఉంది. ఇంద్రుడు అంజలి ఘటించి భక్తితో త్రిదివలోకాధినాథుడైన స్వామివైపే చూస్తూ ఉన్నాడు. శివరూపాన్ని ధరించినటువంటి కుమారుని ఆత్మ, స్రవించి శబ్దరూపమయింది.

అంజలి ఘటించి భక్త్యాత్ముడై నవాని
త్రిదివలోకాధినాథుని తీరు గాంచి
ధృత కుమారతా శివ కృపార్ద్రీ కృతాత్మ
పైకి గ్రనవియించె శబ్దరూపమ్ము దాల్చి (చ.క-61)

ఇక్కడ శివరూపం ధరించినటువంటి కుమారుని ముందు ఇంద్రుడు ఎంత వినయంగా భక్తిగా ఉన్నాడో ఈ పద్యం చూస్తే తెలుస్తుంది తప్ప వాక్యంలో చెప్పడానికి వీలుపడదు. 'శబ్ద రూపమ్ము దాల్చి' అని కవి వాడటం ఇక్కడ గమనించదగ్గ విషయం. శబ్దము కూడా భగవంతుని లక్షణమే అవుతుంది. అంటే భగవంతుడు శబ్దరూపాన్ని దాల్చబోతున్నాడు అని చెప్పడం భౌతికంగా మాత్రమే కాదు-శబ్దమన్నది భగవల్లక్షణా లలో ఒక ప్రముఖమైన లక్షణం. దేవుడు శబ్దస్వరూపుడై జిహ్వతో (గురువుతో) కూడుకొని మూగవాని (నరుని) చేత ఇహ పర వాక్కులను పలికిస్తున్నాడు - అనే మర్మగర్భితమైన వేదాంత రహస్యమొకటి మనకు ఉంది. మానవుని లక్షణం మూగతనం. భగవంతుని లక్షణమైన శబ్దం గురు లక్షణంతో కూడుకొని మానవునిలో ఉన్న మూగతనాన్ని (అచేతనాన్ని) పోగొట్టి శబ్దరూపం ద్వారా పలికిస్తున్నాడు - అంటే అచేత నత్వాన్ని చైతన్యం చేయడం భగవల్లక్షణం. అందుకే ఇక్కడ శివరూపం శబ్దరూపంగా మారిందని చెప్పడం. కవి ఒక శబ్దం ద్వారా ఎంత సత్యాన్ని చెప్తాడో జాగ్రత్తగా చూసుకోక తప్పదు. ప్రతి పదాన్ని పాఠకుడైనవాడు మెలకువగా చూసుకోవాలి. ముఖ్యంగా ఇటువంటి ప్రౌఢ కావ్యాల్లో శబ్దం వెనుక రెండు శబ్దా లను కూర్చడం ద్వారా ఎన్ని లోతులు దాగి ఉంటాయో తెలు స్తుంది. ఇదేమాట రెండు రకాలుగానూ చెప్పవచ్చు. ఇంద్రుని చూసి కుమారస్వామి 'ఈ విధంగా చెప్పెను'-అంటే పాఠకునికి మామూలు మాట అయిపోతుంది. కుమార రూపం శబ్దరూపం దాల్చింది అని ఎప్పుడైతే కవి అన్నాడో మనం కూడా కవి స్థానంలోకి పోయి ఆలోచించక తప్పదు.

కుమారస్వామి ఏమి చెప్తాడో అని దేవ సైనికులందరూ ఎంతో ఆసక్తిగా నిశ్శబ్దంగా ఎదురుచూస్తున్నారు (చ.క-62)

"కట్టా! మహామృతాంధస్సకల పూజ్య సామ్రాజ్య ధర్మ
ఘట్టాంక పరిపాలనా విఘటిత నిర్మల కీర్తి నీవు
పుట్టి మూన్నాళ్ల కాని పసిపూప నిసుగను నేనెద
ఇట్టి లోకత్రయీ భారధృతి యేడ పాడియా నీకు?

మహాక్కర :

శశికళా స్నిగ్ధ కోమలాత్ముడు-క్ష్మాధర ధనుః పాణి
పశుపతి కృపాలవమ్ము చేపట్టగల్గుదు విల్లింత
వశ పడిన కయ్యమున సాయపడగలనేమో కాని
ప్రస్ఫురద్ బ్రహ్మ వాక్కుండె పై శిరోధార్యమ్ముగా

(చ.క - 63, 64)

మధ్యాక్కర, మహాక్కరలు సంభాషణకు అనుకూలంగా ఉంటాయి. స్పష్టమైన తెలుగు నుడికారాలతో చెప్పడం పై పద్యాలలో కనిపిస్తుంది. అంత మహా భుజ బల పరాక్రమశాలి అయి కూడా ఈ క్రింది నుడికారాలతో ఎంత చక్కగా వినయంగా కార్తికేయుడు ఇంద్రునికి చెప్పాడో చూడండి. మరి దేవేంద్రు డంటే సామాన్యుడు కాడు కదా! స్వర్గాధిపతి. అటువంటివానితో ఎట్లా వినయం ప్రదర్శించాలి. అందుకే ఈ మధ్యాక్కర, మహాక్కరలు.

'విశాలమైన మహా సామ్రాజ్యాన్ని ధర్మంగా పరిపాలించి నిర్మలమైన కీర్తి పొందిన మహారాజువు నీవెక్కడ! పుట్టి మునాళ్ళు కూడా కాని పసిబిడ్డను నేనెక్కడ! ఇటువంటి ముల్లోకా లను పరిపాలించే భారమెక్కడ! (దీన్ని ఆధారంగా చేసుకునే ఇటీవలి ఆధునిక నుడికారం - నా సర్వీసంత లేదు నీ ఏజ్ అంటూండటం మనం చూస్తుంటాం. కాకపోతే ఈ ఆధునిక నుడికారంలో తన ఎక్స్‌పీరియన్స్ తానే చెప్పుకుంటాడు. కుమార స్వామి వినయశీలుడు కనుక ఇంద్రుని అనుభవ కాలాన్ని (ఎక్స్‌పీరియన్స్‌ని), గొప్పతనాన్ని గుర్తించి చెప్తున్నాడు).

శశికలా స్నిగ్ధ కోమలాత్ముడు, కొండను విల్లుగా చేసు కున్నవాడు అయినట్టి శివుని కృపచేత విల్లు చేపట్టగల్గి, యుద్ధ ములో నయితే సాయపడగలనేమో కాని ఈ లోకత్రయీ భార మన్నది నాకు సాధ్యమా? ఆ పైన బ్రహ్మవాక్కు ఎట్లా ఉంటే అదే శిరోధార్య మవుతుంది. అంతటి నీవెక్కడ, పుట్టి మూనాళ్ల కాని నేనెక్కడ అనటంలో చక్కని తెలుగు నుడికారం ఇక్కడ అందంగా ఉంది. ఏదో శివుని దయచేత విల్లు చేపట్టగల్గుదునేమో కాని అనడంలో చక్కటి తెలుగు నుడికారంతోపాటు వినయమూ ఉంది. ఈ వినయ సంపద అన్నది పాత్ర వ్యక్తిత్వాన్ని ఎలివేట్ చేస్తుంది. పాత్ర ఎంత ఉన్నతస్థాయిలో ఉందో మనకు తెలుస్తుంది. అంతటితో వదలకుండా 'ప్రస్ఫురద్ బ్రహ్మ వాక్కుండె పై శిరోధార్యమ్ముగా' అనటంతో ఈ విషయం పరాకాష్ఠ చేరుకుంది.

బ్రహ్మ ముందు పోగా సైన్య రథాలు సరస్వతీ సోమతీర్థ సైకతముల దగ్గరకు త్వరత్వరగా వెళ్ళాయి. సరస్వతీ నది ఒడ్డున దేవతా సమూహం దిగింది. మేరు పర్వతమును, అలకనందను చుట్టి హేమకూట పర్వతాలు మొదలైనవాటి మీదుగా ఉత్తర కురుదేశాన్ని దేవ సైనికులందరూ చేరుకున్నారు.

(చ.క - 67)

మా ని ని :

అందు వితస్తను దాటి-యసిక్నికి నావల బాహ్లిక దుహ్యకముల్
చెంది-పరుష్ణీ శతద్రువు చేరి తరుష్న పథోపరిగా చనుచున్
ఛంద చతుష్కము నందలి దాద్యము స్పష్టపడంగనినట్టి భువిన్
పొంది సరస్వతి యొడ్డు సుపర్వ సమూహము డిగ్గె వసుంధరకున్

(చ.క - 68)

ఈ మానినీ వృత్తపు నడక రథభ్రమణాన్ని వర్ణించడానికి చక్కగా ఉంటుంది. ఈ ఛందస్సులో రథగమనం ధ్వనిస్తుంది. దీనికంటే ముందు పద్యం ఉత్సాహవృత్తంలో (చ.క.67) చెప్పబడింది. సైన్యం ఉత్సాహంగా ముందుకు సాగిపోవడంలోను, అభిషేకాన్ని చూడటానికి ఉత్సాహం పడుతున్నట్టుగానూ అక్కడ కవి ఉత్సాహ వృత్తాన్ని ఎన్నుకున్నాడు. ఇక్కడ రథగమనాన్ని ధ్వనింపజేయడానికి మానిని వృత్తాన్ని ఎన్నుకున్నాడు. ఈ దేవతా సైన్యం వితస్తను దాటి అసిక్ని అనే నదిని దాటి బాహ్లిక దేశాన్ని చేరి, పరుష్ణీ శతద్రువును (పంజాబు దేశంలోని ఒక ప్రకృతి భాగం-గంగానది) చేరి, తరుష్న అన్న దేశం మీదుగా చతుర్వేదాలలో ఆది వేదమైనట్టి, ఋగ్వేదం స్పష్టపడినట్టి భూ ప్రాంతాన్ని చేరుకొని దేవతా సమూహమంతా సరస్వతీ నది ఒడ్డుకు చేరుకున్నది ('వేదము సరస్వతీ నది ఒడ్డుననే స్పష్టపడినదని ప్రాచీన వాఙ్మయం, ఆధునిక పాశ్చాత్య పండితులు చెప్పిన సత్యము' - కుమార భారతి - పుట. 52). అందుకోసమే అభిషేకానికి అంత పవిత్రమైన స్థలం ఎన్నుకోవటం.

అల త్రివిక్రమమూర్తి చాచిన మహా హస్తంబునన్ బాఱు దాఁ
టి లసద్ధార వలెన్-విశాల పులినాంత క్ష్మా మహాకావ్య మం
జుల శబ్దాంతర సూక్ష్మ సూత్రము రసస్రోతస్వినీమూర్తి త
త్పలిలో ధార సరస్వతిం గని అజస్వారాట్ కుమారానుగా
ములు నాకౌకసు లెల్లరున్ విడిసి రామూలంబులన్ గుంపులై

(చ.క - 70)

త్రివిక్రముడు తన మహా హస్తాన్ని చాచి లసద్ధారవలె పోతున్నట్టుగాను విశాలమైన మహోన్నతమైన ఒక మహా కావ్యము యొక్క మనోజ్ఞమైనటువంటి శబ్దాల అంతరంలోని సూక్ష్మరస సూత్రంవంటి నీటిధారతో ఉన్న సరస్వతీ నదని చూసి ఇంద్రుడు ఇంద్రుని సైనికులందరూ గుంపులు గుంపులుగా ఆ ప్రాంతంలో విడిది చేశారు. ఇక్కడ సరస్వతీ నది పవిత్ర భావాన్ని చెప్పడానికి రెండు పోలికలు చెప్పారు కవి. ఒకటి - త్రివిక్రముడు తన మహా హస్తాన్ని చాచినట్టుగా సరస్వతీ నది ఉంది అని చెప్పటం. రెండు-మహాకావ్య వాక్కులోని సూక్ష్మమైన రస సూత్రంతోను సరస్వతీ నదిని పోల్చడం. ఇక్కడ పవిత్రతను నొక్కి చెప్పడానికి మహా హస్తమని మహాకావ్యమని రెండుసార్లు 'మహా' విశేషణాన్ని కవి చెప్పడంతో సరస్వతీ నది పవిత్రత ఎంత ఉన్నతమైనదో ఈ విశేషణాలు పై పోలికలనుబట్టి తెలుస్తుంది. అట్టి ప్రాంతాన్ని అభిషేకానికి ఎన్నుకొన్నారు. పై పద్యం పంచపాది. వృత్తము నాలుగు పదాలు. ఇందులో మిగులు పాదం నాలుగు పాదాల చివర బిందువుల్ని కలుపుతూంటుంది.

రవరవలాడు గాడ్పు పెరల్ సృజియించెడి నీటి నంపు లె
ల్ల విరిసి సైకతాంగణములన్ పవనాశన శాబక క్రియన్
సవసవలాడుచున్ బుసల్ పొనరించెడి సద్దు తక్క ఏ
రవమును లేని శాంత మధురంబగు బ్రాహ్మ ముహూర్తవేళలో

(చ.క - 77)

దూరమున జలజంతు వేదో ప్రశాంత
వారి నెగిరిపడ్డట్టి సవ్వడి విధాన
ప్రకృతి శాంతత చీల్చుచు వచ్చె సాగి
వృషభవాహు డంతఃపురాన్వితు డగుచు

(చ.క - 77, 78)

ఇక్కడ సైనికులు విడిది చేసినటువంటి సరస్వతీ నది సైకత స్థలము, ఆ వాతావరణము ప్రశాంతంగా, నిశ్చలంగా ఉంది. ఏవో రవరవలాడు గాడ్పులు, నదిలోని నీటి అలలు ఒడ్డునందలి ఇసుకను తాకినపుడు లేతపాము పిల్లలవలె సవసవలాడే నీటి అలల శబ్దము, ఇలాంటి బుసబుసలు చేసే శబ్దాలు తప్ప ఏ శబ్దమూ లేని ప్రశాంతమైన మధురమైన బ్రహ్మ ముహూర్త వేళలో (తెల్లవారుజామున) ప్రశాంతమైన సముద్రంలో ఎక్కడో దూరాన జలజంతువు ఎగిరిపడ్డప్పుడు వచ్చే శబ్దము విధంగా ప్రశాంతమైన ప్రకృతిని భేదిస్తూ శివుడు కుటుంబ పరివార సమేతంగా అక్కడికి వచ్చాడు.

లోకాల కన్నతల్లి పార్వతీదేవి, అగ్నిదేవుడు అందరూ అక్కడికి వచ్చి చేరుకున్నారు.

తనయుని మూర్ధముం బుణికి తారకలందు ముదశ్రుబిందువుల్
చినుకగ లుప్తదృష్టియై శ్రీ శివతేజము మూర్తిగొన్న స్కందుని
నను చూర్ణకుంతలము దువ్వుచు ముద్దిడుకో శ్రిలో
చనుడు నిజాకృతిం గనిన చాడ్పున నద్దమునన్ సుతుం గనెన్

(చ.క - 81)

శివుడు కుమారుని చూసి కనులలో ఆనందభాష్పాలు పొర్లగా దృష్టి కొంచెం లుప్తమయింది (లోపించింది). శ్రీ శివతేజాన్ని మూర్తిగొన్నటువంటి (ఆకృతి దాల్చినట్టి) కుమారస్వామి యొక్క తల వెంట్రుకలను నిమురుతూ (దువ్వుతూ) ముద్దు పెట్టుకున్నాడు. అప్పుడు శివుడు తన నిజరూపాన్ని అద్దంలో చూసుకొన్నట్లుగా తన కుమారుని చూసుకొన్నాడు. ఇక్కడ ఒక తండ్రి తన రూపాన్ని అద్దంలో చూసినట్లుగా కుమారుణ్ని చూసుకున్నాడు - అనడం ఒక అందమైన పోలిక. చాలా సహజమైన పోలిక కూడా.

నన్నయ భారతంలో ఇదే విషయం ఈ భావననే చెప్తోంది.

"....పురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబున బుత్రుండై తాన యుద్భవిల్లుఁ గావున నజ్గా దజ్గాత్సమ్భవసి యను నిది యాదిగాఁ గల వేద వచనంబుల యందును జనకుండును బుత్రుండును నను భేదంబు లేదు."

(నన్నయ-మదాంధ్ర మహాభారతము ఆది. 4-85)

పురుషుడు భార్యలో ప్రవేశించి గర్భములో పుత్రుడవుతున్నాడు. అంటే తండ్రి కుమారుడిగా ట్రాన్స్ఫర్ అవుతున్నాడు. కనుక కుమారునికి తండ్రికి భేదము లేదు. తండ్రి అంగాంగమునుండి కుమారు డదేవిధంగా పుడతాడు.

అందుకే ఇక్కడ శివుడు అద్దంలో తన నిజరూపాన్ని చూసుకున్నట్టుగా కుమారస్వామిని చూసుకున్నాడని కవి అనటం.

అగ్ని అక్కడికి వచ్చి చేరుకున్నాడనుకున్నాం కదా. అగ్ని రాకతో అక్కడి వాతావరణం ఎలా అయిందీ అంటే-

అవిరళ చంద్రికా మృదు పిశాంశువు స్వర్ణభమై వితప్త దు
గ్ధ విధిగఁగా సుధా తుహినకాంతి కవోష్ణము గాగ వచ్చె తా
నెవని ముఖంబుగా నమరు లెల్లరు తృప్తులు దృప్తులౌదు రా
ప్రవిమల యాజ్ఞికాకృతియు-వైదిక తేజమునైన వహ్నియున్

(చ.క - 82)

మృదువైన తెల్లని ప్రకాశవంతమైన వెన్నెల మరగబెట్టిన పాలరంగులాగా అమృతంవంటి మంచువెన్నెల కాంతులు అగ్ని రాకతో కలగబారినాయి.

ఈ వాతావరణాన్ని, కుమారస్వామికి జరుగుతున్న వైభవోత్సవాన్ని అగ్ని చూస్తున్నాడు. చూసి తనలో ఈ విధంగా అనుకుంటున్నాడు.

ఈ మృదువైన తేజమును నేన భరంపడి నేటి దాక ఎ
ట్లో మఱి తాల్చియుండిన నహో! ద్రుహిణాండము తెల్పుకాశర
త్సామయిక క్షపాకర ప్రసన్న కళాపిత చంద్రికా యశ
శ్రీమహితుండ నౌదునను చింత కుమారుని జూచె వహ్నియున్

(చ.క - 83)

ఇక్కడ అగ్నిదేవుని మనఃప్రవృత్తిని కవి చక్కగా వర్ణించాడు. సాధారణంగా మనిషి ఫలితం దగ్గరకు వచ్చేటప్పటికి మనస్సులో కొంత వ్యాకులం పడతాడు. కష్టపడి అందరూ ఒక కార్యాన్ని సాధించలేరు. కాని ఎవడైనా తన శక్తిమేరకు లేదా తన శక్తిని మించి ఆ కార్యాన్ని సాధిస్తే ఆ వచ్చిన ఫలితాన్ని చూసి అరే- ఆ కార్యం నేనే చేసిఉంటే బాగుండేదేనే అని అనుకుంటాడు. కష్టం దగ్గర, కృషి చెయ్యటం దగ్గర అనుకోడు కాని ఫలితం దగ్గర మాత్రం ఆశిస్తాడు. అంటే ఆ మంచి రిజల్టు మాత్రం ఆశిస్తాడు కాని కృషిని గురించి ఆలోచించడు. ఇది మానవుని మనఃప్రవృత్తి. ఇలాంటి మనఃప్రవృత్తినే అగ్నిదేవుడు తనలో అనుకున్న విధానం ద్వారా కవి చాలా చక్కగా ప్రదర్శించాడు.

కుమారుని ప్రసవించటంలో గంగ పడ్డ బాధ అంతా ఇంతా కాదు. శివుని మహా వీర్యాణువు అగ్ని మోయలేక బ్రహ్మదేవుని సాయంతో గంగలో వదులుతాడు. అప్పుడు ఆ గంగాదేవి ఆ వీర్యాగ్ని తనపై ఉన్నప్పుడు - అడుగున బాగా మంట మండుతున్నప్పుడు - పొయ్యిమీదున్న కుండలోని నీళ్ళు బుడబుడమని పొంగి తెర్లుతున్నట్లుగా బాధపడుతూ ముందుకు సాగింది. (దీని పూర్తి వివరణకు చూ. 'కుమార భారతి-కుమార జననం', భారతి, ఏప్రిల్, 1989). ఇలాంటి బాధ - బరువు మోయలేకనే అగ్ని ఆనాడు గంగాదేవిని వేడుకొని తనమీద మోపబడ్డ ఆ మహా వీర్యాణువును గంగలో విడిచి పెట్టాడు. ఆ మహా వీర్యాణువు నుంచి ఉద్భవించినవాడే ఇప్పుడు అభిషేకము చేయించుకుంటున్న కుమారస్వామి. అది చూసి చివరిదాకా ఎట్లో కష్టపడి మోసిఉంటే ఇప్పటి ఘనకీర్తి అంతా నాకే దక్కి

ఉండేది కదా అని కుమారుని చూపి తనలో అనుకుంటాడు. ఈ భావన 'ఎట్టో' అన్న దగ్గర పద్యపాదం తెగిపోయింది. 'ఎ' పైన ఊనిక ఉంది. 'ట్టో' పైన దీర్ఘమూ ఉంది. దీనిద్వారా- ఎట్లో ఒకలాగా కష్టపడి కొంతకాలం కండ్లు (కన్నులు) మూసుకొని కష్టాన్ని భరించిఉంటే ఎంత బాగుండేది కదా అని అగ్ని దేవుని మనోభావన 'ఎట్టో' అన్న పదంద్వారా అభివ్యక్తమవుతుంది.

అగ్ని తర్వాత గంగాదేవి వస్తుంది. గంగ ఎలా వస్తుంది అంటే-

బంధురశీతల శ్వసన పంక్తి కరళ్ళ కరళ్ళ గాగ-సౌ
గంధిక నూత్న పంకజ సుగంధిలముల్ సనుదేర ముందు-స్వ
చ్ఛేందు మయూఖపాళి మెఱుగెక్కగ జేయుచు రత్నపాదుకా
సుందరభూష-సత్కవి విశుద్ధ వచోద్భుళ వచ్చె గంగయున్.
(చ.క - 84)

ఎర్ర కలువలు, వినూత్న పద్మముల సువాసనలతో కూడుకొని చిక్కనైన శీతలమైన లేతగాలులు కరళ్ళ కరళ్ళగా స్వచ్ఛమైన చంద్ర కిరణాలను మెఱుగు పరచినట్లుగా - ఒక సత్కవియొక్క పరిశుద్ధమైన వాక్కులాగా గంగ వచ్చింది.

ఇంక కొంతసేపులో గంగ అక్కడికి చేరుకుంటుందనగా ముందుగా పూల సువాసనలతో కూడుకొని శీతలమైన లేతగాలులు వస్తాయి. ఇక్కడ చాలా సహజమైన వర్ణన ఉంది. గంగాదేవి చల్లగా ఉంటుంది. ఆమె వచ్చేటప్పుడు ఆమెమీదుగా పిల్లగాలులు వీచేటప్పుడు నదిలోని నీటిని తాకుతూ ఆ గాలులు రావటంవల్ల గాలి ఇంకా చల్లబడుతుంది. ఇది సహజం. ఇకపోతే చంద్ర కిరణాలు మొదటనే చల్లగా ఉంటాయి. దానికితోడు గంగ అక్కడికి వచ్చినప్పుడు ఆ వెన్నెల ఇంకా ఎంత చల్లబడుతుందో మనం ఊహించుకోవచ్చు. గంగానది అంటే పరిశుద్ధం చేసే గుణం కలది అని అర్థం. పరిశుద్ధానికి మారుపేరే గంగ అన వచ్చు. ఈ గంగ ఎంత స్వచ్ఛంగా పరిశుద్ధంగా ఉందంటే ఒక సత్కవి వాక్కులాగా ఉంది అనటంలో ఎంత మధురమైన భావన! సాధారణంగా సత్కవి వాక్కు గంగలాగా పరిశుద్ధంగా ఉంది అని చెప్పడం ఒక పద్ధతి. ఇక్కడ సత్కవి వాక్కులాగా గంగ పరిశుద్ధంగా ఉంది అని చెప్పడంవల్ల సత్కవి వాక్కు కూడా అంత స్వచ్ఛంగా ఉంటుంది అని చెప్పడమే కాకుండా గంగ పవిత్రత ఇక్కడ ఎలివేట్ అయింది. భవభూతి నా నోటి నుంచి వచ్చిన మాట గంగలాగా పరిశుద్ధంగానూ, లక్ష్మిలాగానూ ఉంటుందని తన వాక్కును గంగతో పోల్చాడు. కవి వాక్కు అంత స్పష్టంగా, స్వచ్ఛంగా ఉంటుంది. ఇక్కడ కవి ఏం చేశాడంటే - ఉపమానంగా ప్రసిద్ధమైన దాన్ని ఉపమేయంగా కల్పించి చెప్పాడు. కనుక దీన్ని ప్రతీపాలంకారంగా చెప్ప వచ్చు. ఈ కావ్యమంతా అక్కడక్కడ విచిత్రమైనట్టి, విలక్షణమైనట్టి, అందమైనట్టి మధురభావనతో కూడిన పోలికలు మనకు అగపడతాయి. వాటిని పాఠకులు ప్రత్యేకంగా జాగ్రత్తగా పరిశీలించుకోవాలి.

పై రెండు పద్యాలను (అగ్ని రాకను తెలిపేది-82, గంగ రాకను తెలిపేది-84) పరిశీలిస్తే అగ్ని రావడానికి, గంగ రావడానికి తేడా కనిపిస్తుంది. అది స్త్రీ, పురుష స్వభావంలోని తేడా.

అక్కడకు వచ్చిన దేవతలందరూ పరస్పరం క్షేమ సమాచారాలతో కూడుకొన్న సంభాషణలు జరుపుకొన్న తర్వాత గంగను, అగ్నిని రత్నాసనముల మీద ఆసీనులను గావించి చిరత్నాలతో వారిద్దరికి పూజ చేశారు. (చ.క-85)

కార్తికిక మాస తుహిన శీకర చయమ్ము
వెలది వెన్నెల వెల్గులో కలిసి కురిసి
దేవ సేనాధిపాభిషేకావసరము
కైన పన్నీటి చిఱువెల్లియై రహించె (చ.క-86)

అది కార్తిక మాసం. మంచు బిందువుల సమూహం నిర్మలమైన తెల్లని వెన్నెల వెలుగులో కలిసి చిన్న పన్నీటి ప్రవాహంలాగా దేవసేనాధిపాభిషేకం కోసం ప్రవహించింది. కార్తికమాసపు వెన్నెల ఎంత నిర్మలంగా ఉంటుందో, ఎంత తెల్లగా స్వచ్ఛంగా ఉంటుందో అందరి అనుభవంలో ఉన్నదే. ఈ అభిషేకం జరుపడానికోసమే ఈ వెన్నెల మంచుబిందువుల నీటి సమూహంతో కలిసి కురిసింది అనడంవల్ల ఇది హేతూత్ప్రేక్ష.

దేవతలు కుమారస్వామికి అభిషేకం చేసేదానికి ముందుగా విఘ్నాధిపతి - వినాయకుడిని పూజించారు. ఆ విఘ్నాధిపతి వర్ణనాశిల్పం ఇక్కడ చూద్దాం.

ఊర్ధ్వకుండాన సర్గ మథోవనత క
రాన లయము, ద్విధాభూతమైనదాన
స్థితిని - సూచించు భంగిమా త్రితయ హస్త
ప్రణవమూర్తిని విఘ్నాధిపతిని గొల్చి (చ.క-87)

విఘ్నేశ్వరుని తొండము మూడు రకాలుగా శిల్పించబడి ఉంటుంది. ఒకటి - తొండం పైకెత్తినట్లుగా ఉండటం. ఇది

ఊర్ధ్వముఖం. రెండు - క్రిందికి దించుకొన్నట్లుగా ఉంటుంది. ఇది అధోముఖం. మూడు - నడుమ రెండుగా కనబడేటట్లు తొండముయొక్క చివరి భాగం పైకెత్తబడి కొద్దిగా దించినట్లు ఉంటుంది. ఇది ద్విధావ్యావృత్తము. ఊర్ధ్వముఖం సర్గమును సూచిస్తుంది. అంటే సృష్టిని సూచిస్తుందన్నమాట. అధోముఖం ప్రళయాన్ని సూచిస్తుంది. ద్విధావ్యావృత్తం సర్గ, ప్రతిసర్గల లయాన్విత స్థితి నిర్వహణకిది సూచకం. అంటే పరిపాలనా నిర్వహణాన్ని సూచిస్తుందని తాత్పర్యం. ఓంకారంలోని అ-ఉ-మ-సర్గ-లయ- స్థితులకు సూచకాలైతే వినాయకుడు సూక్ష్మమైన ఓంకారం యొక్క వ్యక్తీకృత స్థూల రూపము (కుమార భారతి, పుట-57). అందుకే ప్రతి మంత్రానికి 'ఓం' అని ముందు పలుకుతాము. త్రిభంగిమ - కాలి దగ్గర, హస్తము లేదా మెడవద్ద స్త్రీ నాట్యశిల్పం చెక్కబడి ఉంటాయి కొన్నిచోట్ల. ఈ త్రిభంగిమ అందాన్ని సూచిస్తుంది. చిన్నపిల్లలకు డ్యాన్స్ పాజిటివ్. వారికి నాట్యం అనుకూలం. వారిలో అదే ఎక్కువగా కనిపిస్తుంది. ఏ పని చేసినా నాట్యాయమానంగా వారి చేష్ట ఉంటుంది. సర్వ కళలలోనూ కళాతత్వాన్ని కల్గింపజేస్తుంది నాట్యం. ఓంకారానికి ఆకారమిస్తే అదే వినాయకుడు. అందుకే మొదటి పూజ విఘ్నేశ్వరునికి చేయడం. సాంప్రదాయపు సోపానాలు తెలిస్తేనే అందులో భావసౌందర్యం తెలిసేది.

కుమారస్వామికి అభిషేకం చేసే సమయంలో ఎవరెవరు ఏయే పనులను ఎట్లా నిర్వహించారో ఈ కింద చూడవచ్చు.

గంధాంబులు చల్లి - ఘనసార మృగమదో
జ్జ్వల రంగవల్లు లచ్చరలు తీర్ప
ఔదుంబరమయ మృగాంక పీఠిక కుశా
స్తరణములో హిమగిరి రచింప
కృత్తికల్ సప్తమాతృకలు సేసలు వెట్ట
పుణ్యాహ ఘోషంబు మునులు పలుక
హోమకార్య మమరేజ్యుడు నిర్వహింపగ
గంధర్వ బంధురగాన మెసగ
శంఖతూర్యాది మంగళస్వాన మెసగ
కాంతకుంభ కుంభానీత జహ్నవీ ప
విత్ర సారస్వతాంబువుల్ విబుధ గణ చ
మూధవోత్తమాంగమునందు పోసె గురువు.

(చ.క - 88)

గంధము, పన్నీరు చల్లి; కస్తూరి, పునుగులతో అప్సరలు రంగవల్లులు తీర్చారు. మేడిచెట్టు కలపతో చేసిన పీఠంపై మంచి దర్భలతో కూడుకున్న చాప పరచారు. సప్తమాతృకలైన కృత్తికలు అక్షింతలు పెట్టారు. పుణ్యము, పవిత్రమైన ముహూర్తాన్ని మునులు నిశ్చయించి చెప్పారు. హోమకార్యాన్ని బృహస్పతి నిర్వహించాడు. మేలైన రసవత్తరమైన గానం గంధర్వులు పాడారు. శంఖతూర్యము మొదలైన మంగళ శబ్దాలు మ్రోగాయి. బంగారు కుండతో తెచ్చిన పవిత్రమైన జాహ్నవి నది, సరస్వతీ నదీజలాలు దేవ సేనానాయకుడైనటువంటి కుమారస్వామిపై దేవగురువైన బృహస్పతి పోశాడు.

అభిషేకము = వైదికకర్మ...దైవ శక్తులను అతనిలో నిక్షిప్తం చేయడం. అభి = చక్కగా; షేకము = తడపడము. పై సీసపద్యం నన్నయ శైలిలాగా ఎక్కడా విరగకుండా పోతుంటుంది.

స్ఫటిక మూర్తిపై వెన్నెల పాటినట్లు
పశుపతి కుమారు తనువునన్ బ్రాకులాడె
చిఱు తరగ కట్టి దివ్యాభిషేక సమయ
స్వర్గ గంగా సరస్వతీ స్వచ్ఛవారి.

సకల త్రైలోక్య ధర్మ సంస్థాపనమున
బూనియున్నట్టి కొమరు నా మూర్ధపదము
విమలజల నేత్ర తల్లి చుంబించినట్లు
తరళజలమూర్తి శ్రీ గంగ దబకలాడె.

(చ.క - 89, 90)

పాలరాతిపై వెన్నెల పరచుకున్నట్లు చిన్న చిన్న తరంగాలు కట్టి స్వర్గ గంగా సరస్వతీ స్వచ్ఛజలములు కుమారస్వామి తనువునంతా ప్రాకులాడాయి. ముల్లోకాలలోనూ ధర్మ సంస్థాపనం చేయబూనినట్టి తన కుమారుడిని ఆ మూర్ధపదమూ తల్లి చుంబించినట్లుగా గంగాదేవి జలం రూపంలో కుమారుని తనువు దబకలాడింది. ఇక్కడ అభిషేకంతోపాటు ఒక తల్లి ప్రేమానురాగానుభవాన్ని కూడా కవి చక్కగా చెప్తున్నాడు. తల మీద పుణికితో మొదలు పాదంవరకు చెయ్యిపెట్టి నిమరడం. దీన్ని గంగాదేవి ఎట్లా చేసిందంటే ఆమె జలమూర్తి కాగా తల మీద పోయబడ్డ నీళ్ళు పాదం వరకు స్పృశిస్తూ దబకలాడింది. ఆమె ఆ విధంగా కుమారుడిని ఆ మూర్ధపదమూ ముద్దులాడింది. జలబిందువులో కూడా చైతన్యముంటుంది.

దేవగురువు బృహస్పతి బంగారు చెంబుతో స్వామిపై పోసిన నీరు తనువుపై తామరపూల కొత్తరేకులవలే తోచి దేవ సేనతో విచిత్ర ప్రణయం జరిగినట్లుగా భ్రాంతి గొలిపింది.

(చ.క - 91)

కుంచిత దేహుడై గుహుడు-గోత్రభిదర్పిత దివ్యకాంతిమత్
కాంచన సన్మణీ మకుట ఖడ్గ ధృతిన్-మృగపీఠి వీడుచున్
ప్రాంచిత భక్తి నీశ్వర శివానల గంగా నమస్క్రియార్థ మే
తెంచెను నాల్గు మూర్తుల దిదృక్ష దివౌకసు లద్భుతంబడన్

(చ.క - 92)

దివ్యమైన ప్రకాశంగా భాసిస్తున్న మణులతో కూడుకున్న బంగారు కిరీటము, ఖడ్గమూ ధరించిన గుహుడు (కుమారస్వామి), వినమ్రభావంతో తన ఆసనాన్ని విడిచి అత్యంత భక్తితో శివునికి, పార్వతికి, గంగకు, అగ్నికి నమస్కారం చెయ్యడానికి నాలుగు రూపాలుగా చీలి ఆసక్తిగా చూస్తున్నటువంటి దేవత లందరూ అద్భుతం పడేటట్లుగా వచ్చాడు. ఇక్కడ కుమార స్వామి తన తల్లిదండ్రుల వద్దకు - నలుగురి దగ్గరకు ఒకేసారి వెళ్ళాడు. ఆ నలుగురి దగ్గరకు ఒకేసారి నాలుగు రూపాలతో పోయి వాటికి కొరతలేకుండా జేశాడు. ఇక్కడ తన జన్మకు కారణభూతులైన వారినందరిని ఒకేసారి నాలుగు రూపాలతో కలుసుకున్నా డన్నది మనం గమనించవలసిన విషయం. (యోగ శక్తుల్లో అనేక మూర్తిధారణ చేయటం ఉందట).

శివ పార్వతులు, మరియు అగ్ని, గంగల ఆశీర్వాదాన్ని పొంది; బ్రహ్మకు, కృత్తికలకు నమస్కరించి, ఇంద్రుని చూసి 'ప్రభూ ఆజ్ఞ' అన్నాడు (చ.క-93). ఏమి ఆజ్ఞ ఇస్తారో ఇవ్వండి. మీ ఆజ్ఞను పాటిస్తానన్నాడు.

కుమారస్వామి ఎప్పుడైతే వినయంతో 'ప్రభు ఆజ్ఞ' అన్నాడో ఇంద్రుని కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

కన్నుల గిట్టునన్ దిరుగగా జలముల్ 'ప్రభు! వచ్చి నేటి కీ
నన్నును విష్టపత్రయము - నాకము గావక తారకాసుర
చ్ఛిన్న సమస్త వీర్యు నను జేరి 'ప్రభు' యన నీకు న్యాయమా!
అన్న! ప్రభుండ వీవు - భటుడై పని విందున ఏలుకో ప్రభూ!'

(చ.క - 94)

కుమారస్వామి 'ప్రభూ మీ ఆజ్ఞ' అన్న వెంటనే ఇంద్రుని కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. 'తారకాసురుని చేత దెబ్బతిని ఎదుర్కొనలేక ముల్లోకాలను, స్వర్గలోకాన్ని సరిగా పరిపాలించజాలక ఉన్న నన్ను పట్టుకొని ప్రభూ! అనడం నీకు న్యాయంగా ఉందా! ప్రభువు నీవు, నేను భటుడై పని వింటాను'- అని ఇంద్రుడన్నాడు.

అను మఘువుం గనుంగొనుచు నార్ద్రమనస్కుడు కార్తికేయుడున్
ఘనసుర వాహినిం గనుచు-కర్బుర పర్వత చాపలంబమౌ
గుణము స్పృశించుచున్ శివునకున్ పితృదేవునకున్ మనోబ్జమం
దునను నమస్కరించి కని దుశ్చ్యవనున్ 'సరియట్లె' యంచనన్.

(చ.క - 95)

ఆ విధంగా అన్న ఇంద్రుని చూసి ఆర్ద్ర మనస్కుడై కార్తికేయుడు గంగాదేవిని చూస్తూ శివధనుస్సుయొక్క వింటి నారిని స్పర్శిస్తూ మీటుతూ పితృదేవుడైన శివునికి మనస్సులోనే నమస్కరించి 'సరి అట్లే కానిలే' అన్నాడు. 'సరి అట్లే' అనే మాట ఇంద్రుడిని చూసి అనలేదు. తల్లిదండ్రులను చూస్తూ అన్నాడు. కళ్ళు తిప్పకుండా చూడటం సిగ్గులేనితనాన్ని చెబుతుంది. తల్లిదండ్రులను చూస్తూ, నారిని స్పృశిస్తూ ఆ మాట అనటంతో అతని వినయం వ్యక్తమవుతుంది.

ఇక తూర్పు దిక్కునుంచి ఈ అభిషేకం వేడుకను చూడా లని సూర్యుడు ఎంతో ఆసక్తితో తూర్పు కొండను దాటుకొని వస్తున్నాడు. సూర్యుడు ఈ సంబరాన్ని (సంభ్రమాన్ని) చూడా లని తొందర పడుతున్నాడు. బంధురమైన తామరస పంక్తులతో కప్పబడిన కుమారస్వామి పదపద్మాలను చూడాలని ఉత్సుకత చూపుతున్నాడు. అతని ఆదుర్దా ఎలా ఉందో ఈ కింద చూడండి.

పిచ్చుక కుంటు సారథిగ పెట్టుకొనం గదు మోసమిట్లుగా
వచ్చెనటన్ త్వరన్ సవిత సారథి రథ్యచయమ్ము తోలుమన్
హెచ్చరికం బొనర్చుకొను చిందుని చూచి క్రుధావ్యదాత్ముడై
వచ్చిన తన్మహస్సు నిశి వచ్చినదే యని కుత్స సేయుచున్.

(చ.క - 97)

'సామర్థ్యము లేని సారథిని పెట్టుకొని ఇట్లా మోసం జరిగిపోయింది. రథం వేగంగా పోని కారణంచేతనే కదా నేను స్కందుని అభిషేకం చూడలేకపోయాను' అని మనస్సులో క్రుంగిపోయాడు సూర్యుడు. తొందరగా గుర్రాలను తోలుమని అప్పుడప్పుడు దారిలో సారథిని హెచ్చరిస్తూనే వచ్చాడు. తీరా అక్కడికి చేరుకుందామని అనుకున్నంతలో చంద్రుడిని చూసి

రాత్రి ఇంకా ఉండే అని మనస్సులోనే వ్యథ పడుతున్నాడు. ఇక్కడ సూర్యుడి మనస్సును స్పష్టంగా విశదపరిచాడు కవి. ఎవరైనా కాని ఒక సంభ్రమాన్ని చూడాలనుకున్నప్పుడు చూడ లేకపోతే ఆ మనస్సు ఎట్లా ఉంటుంది మరి! అంతేకాకుండా సూర్యోదయం కూడా కాబోతుంది అని మనకు తెలుస్తుంది. దీనికి పై వర్ణన బహు సుందరంగా జోడించాడు కవి.

దేవసేనాధిపతి దివ్యాంఘ్రి సీమల
 సిందూరకాంతులు చిలుకరించి
పార్వతీపతి పదపద్మద్వయమ్మున
 కుముద కింజల్కముల్ కుప్పవోసి
స్వర్గాధ్వమున సాగు చౌదంతి సితదంత
 శిఖరాగ్ర సీమలన్ శితమొనర్చి
సకల దైవత పదాబ్జ స్పర్శపూతమౌ
 సోమతీర్థము శిరస్సుననమించి
స్కందవాహన పింఛముల్ సవదరించి
ద్యుపథగామరాళులకు సూదులయి గ్రుచ్చి
ప్రాతరభ్యంచితోష్ణ గభస్తి చయము
సకలలోకోర్ధ్వగామియై సాగివచ్చె (చ.క-99)

రథికుని మనస్సు తెలుసుకొని సారథి గుర్రాల మూపులపై ములుకోలతో ఒక దెబ్బ కొట్టాడు. బంగారు గజ్జెల ధ్వని వ్యాపించేటట్లుగా రథము రివ్వుమని ఆకాశంలో తురంగలించింది (ఎగిరింది) [చ.క-99]. అప్పుడు ప్రాతఃకాలపు సూర్యకాంతి కిరణాలు ఎలా వ్యాపించాయి అంటే దేవసేనాధిపతి అయిన కుమారస్వామి యొక్క దివ్యమైన పాదాలపై ఎర్రటి కాంతి చిలుకరించింది. పార్వతీపతి శివుని పాదద్వయంపై తెల్ల కలువలు కుప్ప పోసినట్లుగా కాంతి పడింది. స్వర్గ మార్గంవైపు పోతున్నటువంటి ఐరావతం యొక్క దంతాగ్రముల (దంతముల చివరి కొసల)పై పదును పెట్టినట్లుగా కాంతి వెదజల్లింది. సోమ తీర్థములోని దేవతలందరి పాదాలకు పూత పూసినట్లుగా కాంతి విరజిమ్మింది. స్కందుని వాహనమైన నెమలి పింఛములపై కాంతి తళుక్కుమన్నట్లుగా పడింది. ఆకాశంవైపు వెళుతున్న అమరులపై ప్రాతఃకాలపు సూర్యకాంతి కిరణాలు పడి సూదుల లాగా గ్రుచ్చుకుంటున్నాయి. ఈ విధంగా సకల లోకాలను ఊర్ధ్వ గామియై సాగివచ్చాడు సూర్యుడు. ఇక్కడ సూర్యకాంతి వర్ణన అందంగా ఉంది. 'ఊర్ధ్వగామియై సాగివచ్చె' అనటంవల్ల అమరులు కూడా అభిషేక కార్యాన్ని పూర్తి చేసుకొని ఊర్ధ్వ లోకానికి పోతున్నారు అనే భావనను సూచించినట్లయింది.

అమరులందరూ వెళుతూ వెళుతూ ఈ సరస్వతీ నదీతీర ప్రాంతానికి 'సోమతీర్థ' మనే పేరు ఎట్లా వచ్చిందో అని మొద లైన మాటలు మాట్లాడుకుంటూ స్వర్గసీమ చేరుకున్నారు.

'ఇది సోమతీర్థమన్ ప్రథ యెట్లు వడసెనో?!'
 'అతడిందు రాజసూయమ్ము చేసె'
'ఇచటికే రా నానతిచ్చె నేమి యజుండు'
 మనస్వామి నముచి చంపందగిలిన
పాప మీ కైవలవారియే క్షాళించె
 ఈ తల్లి నదపతి కెడద మెచ్చి
మును వశిష్ఠ మహర్షి పొగడె సద్భక్తి త
 త్సరత నాంగిరస మంత్రముల యందు
మంకణ ప్రముఖ మహర్షి మండలమ్ము
లీ నదీతీర్థములనే తరించె మున్ను
ఓహో! యేమి సరస్వతియో యటంచు
చెప్పుకొంచు సురల్ స్వర్గసీమ(జనిరి (చ.క-101)

సోమతీర్థమనే పేరు ఈ ప్రాంతానికెట్లు వచ్చిందో! ఇక్కడికే రావాలని బ్రహ్మ ఎందుకు ఆజ్ఞాపించాడో! మన స్వర్గాధిపతి అయిన ఇంద్రుడు నముచి అన్న రాక్షసుని చంపగా తగిలిన పాపాన్ని ఇక్కడే ప్రక్షాళనం చేసుకొన్నాడు. పూర్వం వశిష్ఠ మహర్షి అంగిరస మంత్రాల (వేదాల్లోని భాగాలు)ను ఇక్కడే చదివాడు. పూర్వం మంకణ మొదలైన మహర్షుల సమూహ మంతా ఈ నదీతీర్థాలనే సేవించి తరించింది. ఓహో ఎంత పవిత్రమైన సరస్వతీ నది ఇది! అని మాట్లాడుకుంటూ దేవత లందరూ స్వర్గలోకాన్ని చేరుకున్నారు. ఇంత పవిత్రమైన స్థలం కాబట్టే బ్రహ్మ ఇక్కడ అభిషేకం జరపాలని ఆజ్ఞాపించాడు.

కావ్యంలోని కథనంతా పూర్వపరాలను సమన్వయించిన అభిషేకమన్న నామం కల చతుర్థ కమలమిది. ఈ విధంగా కవి పవిత్రంగా సద్భావంతోనూ, సద్భక్తితోనూ ఎంతో మెలకువగా ఈ గ్రంథాన్ని ఆద్యంతమూ మలిచాడు.

# అక్షరాలుగా...!

అక్షరాలలో
ఆలోచనా సంద్రాలను
అలవోకగా నిక్షిప్తపరుస్తాడు!
ఆనంద బాష్పాలకు
అక్షయవల్లరిగా మార్చుతాడు
కలలకు కమ్మని స్వరాన్ని
జీవితంపై గాఢానురక్తి పురిని ఎక్కిస్తాడు
కోట్ల అనుభవాల్ని....
కోరికల తరంగాల్ని....
కళలుగా, కమ్మని గీతాలుగా....
నిర్వికారాన్ని
నిజస్వరూప రూపాలుగా....
మనస్సులో....
మథనముతో....
అవ్యక్త ఆవేదనలను
అణవణువు స్ఫూర్తితో
వ్యక్తపరుస్తాడు!
అక్షరాలను ఆత్మసాక్షిగా నమ్మి
మంత్రాలుగా మలుస్తాడు
అక్షరాలను వెదజల్లి సంఘంలో
కవిగా నిలిచిపోతాడు!

# స్త్రీ అందం

ఆకర్షణ అందానికి
రహదారి....
ప్రకృతి ప్రసాదించిన వరం
సొగసు అని చెప్పుకోవాలి!
స్త్రీ గొంతు విప్పితే
ఎండాకాలం చల్లని నీడలో
విశ్రమించినట్లు వుంటుంది
నునులేత బుగ్గల మృదుత్వంలో
సమ్మోహనత్వం తొణికిసలాడుతుంది
కళ్లు విప్పితే చాలు
గుండె గుబులై పోతుంది
నడిస్తే చాలు నయాగరా జలపాతం
వయారం వొలికిపోతుంది
పాదాలు అవనితలాన్ని తాకి
రసోదయాలై రవళిస్తాయి
అవయవాల అమరిక
పరిచయంలో ఆప్యాయత విరబూసి
లాలిత్యం సాన్నిహిత్యంలో
రమణీయ సంభాషణ
ఒకో స్త్రీకి ఒకచోట
అందం పాదు పొంగుతుంది
మనోపాయలు
శ్రీగంధమై అలరిస్తాయి!

# సాహిత్యం!

రాజకీయ ఆర్థిక
సామాజిక అలంకారిక...
సర్వశాస్త్రాలను సంచుకొని
లలితకళలను మురిచుకొని -
ఆనందానుభూతి ప్రసూతి సాహిత్యం!
లోతులు చూసినట్లు....
లోకం అనుసరించినట్లు....
విశాలం....వినీలం....
విప్పారిన హృదయగ్రంధి....
అర్హత సహృదయత
ఉంటే చాలు
సంపన్నులు కావచ్చు
సరదాగా కాలం వెళ్లబుచ్చవచ్చు
నైరాశ్య నత్తగుల్లల్ని చిదిమి
నైర్మల్య కాసారంలో
హాయిగా విహరించవచ్చు
సభ్యత సంస్కృతి....
సాహిత్య సాధనవల్ల
లభింపవచ్చు!

# తెలుగు కవిత్వం!

పండుగలకు పబ్బాలకు
అల్లం మురబ్బాలకు....
అభినందన సభలకు
అరంగేట్రం కచేరీలకు
ముస్తాబు అయ్యేది
కార్బన్ కవిత్వం
అర్బన్ కవిత్వం!
ఉద్యమాల ఊహించి
మద్యాన్ని సేవించి
ప్రజలను జాగృతపరచ
ఆవేశం నూరి
పరదేశీ సాహిత్యం జుర్రి
ఆచరణకు అసాధ్యం
అదే స్లోగన్ కవిత్వం!
పండితుల మెప్పించ
ఛందోకవిత్వం
అవార్డులందుకొన
ఆత్మాశ్రయ కవిత్వం
మిసమిసలాడే మినీ కవిత్వం
గుసగుసలాడే సినీ కవిత్వం
అనుభూతి కవిత్వం
జావళీ కవిత్వం
జాపత్రి కవిత్వం
పాయసమైన
తెలుగు కవిత్వం!

# ఇద్దరి ఆశయంబకటే!

అసంతృప్తి హాలాహలాన్ని
దిగమింగిన గరళకంఠునిలా
ఆర్టిస్టు
ఆనందామృతాన్ని
సంఘానికి పంచిపెడతాడు!
మాగిన అనుభవాన్ని
మహీ మండలానికి
అందించిన మహాత్మునిలా
మూగగొంతును
మార్మోగేలా చేస్తాడు
అక్షర సంధాని!
వీరిద్దరి ఆశయం
జీవితం సంతృప్తి సాగరం
అయ్యి తీరాలని!

# లాలసాన్వేషణ!

లాలస ఓ విచిత్రమైన
విలాస స్వరూపం
కళల విలసనా రంగస్థలం
కంటికింపైన వన్నింటిని
దుప్పటిలా కప్పుకోవాలని
వెచ్చని కోర్కెలతో
ముచ్చటలాడాలని
లాలస ప్రేరేపిస్తుంది!
రసదృష్టి
ఆరాధనాసృష్టి
సంతోష పరివ్యాప్తి
లాలస లాస్యం!
జీవితంలో రుచుల రూపాలకు
ప్రతిరూపంగా నిలవాలని
క్షణికం నుండి
అక్షయంవైపు
లావణ్య సరసిలో
అభిషేకించాలని
లాలస అన్వేషణా పరమార్థం!

శ్రీ యస్. యస్. రెడ్డి

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

# అనుభూతి కవిత్వం

కవిత్వ ప్రయోజనం సందేశం, ఆనందం అని పాశ్చాత్య విమర్శకులూ, హితం 'కాంతా సమ్మితం'గా చెప్పడమని మన వాళ్లూ తేల్చిచెప్పే ఉన్నారు. భావ కవిత్వానికీ అనుభూతి కవిత్వానికీ గల తేడా ఏమిటని చాలమంది నేడు ప్రశ్నిస్తున్నారు. భావ కవిత్వంలో (కాల్పనికవాద కవిత్వంలో) సందేశం, ఆనందం రెండూ ఉంటాయి. అనుభూతి కవిత్వంలో 'అనుభూతి' ద్వారా సిద్ధించే ఆనందమే ఉంటుంది, సందేశం ఉండదు! ఉదాహరణకు కీట్స్ వ్రాసిన 'నైటింగేల్', 'గ్రీషన్ అర్న్' ఖండకావ్యాల్లో లోతైన అనుభూతి ఉన్నది; దానితోపాటు వ్యంగ్యంగా, వాచ్యంగా సందేశం కూడా ఉన్నది. నైటింగేల్ పాట అనుభూతిలో అమృతత్వం ఉన్నదని కవి నిర్దేశిస్తాడు. గ్రీషన్ అర్న్ చివర 'బ్యూటీ ఈస్ ట్రూత్ అండ్ ట్రూత్ ఈస్ బ్యూటీ.' (సౌందర్యమే సత్యం, సత్యమే సౌందర్యం) అనే ప్రవచనాన్ని ఉటంకిస్తాడు. తెలుగుల్లో కాల్పనికవాద కవులందరికీ, ప్రణయం, విరహం, ప్రకృతి సౌందర్యం, దేశభక్తి, దైవభక్తి, ఆత్మనిర్వేదం సామాన్యమైన యితివృత్తాలు. కృష్ణశాస్త్రి 'ప్రవాసము', 'ఊర్వశి' ఖండికల్ని విడిగా చూస్తే వాటిలో కొన్ని సందేశం ఏమీ లేని అనుభూతి కవిత్వంగానే కనిపిస్తాయి. కాని అవి వేర్వేరు ఖండికలు కావు. వాటిలో అంతస్సూత్రంగా ఊర్వశి తత్త్వాన్ని గూర్చిన అన్వేషణా, దాని క్రమ పరిణామం గోచరిస్తాయి. (చూడు: కృష్ణశాస్త్రి నిర్వేదం : కవి హృదయం —ఆర్. ఎస్. సుదర్శనం). జాషువా, దువ్వూరి రామిరెడ్డి వంటి కవులలో ఆలోచనా, ఊహా ప్రాధాన్యం వహిస్తాయి.

'అనుభూతి' అంటే దేన్ని గూర్చి మాట్లాడుతున్నామో స్పష్టంగా అవగాహనకు రావలసిన అవసరం ఉన్నది. ఆధునిక సమాజంలో మాటలూ, ఊహలూ, సిద్ధాంతాలూ తెలిసినంతగా మనుష్యులకు 'అనుభూతి' అంటే తెలియదంటాడు వెర్నర్ ఎర్ హర్డ్ అనే మహాశయుడు. దాన్ని తెలియజేసి, మానసిక వైకల్యాన్ని పోగొట్టేందుకు ఇ.ఎస్.టి. అనే వ్యవస్థను నెలకొల్పాడాయన. పదిహేను రోజులు శిక్షణా తరగతుల్ని నిర్వహించాడు. కొన్నేళ్ళ క్రితం బొంబాయిలో నిర్వహించాడు కూడా. ఆయన అంటాడు - అనుభూతిని గూర్చి మనం ఒక నిర్వచనం యిస్తే, మనుష్యులకు ఆ నిర్వచనమే తెలుస్తోంది గాని, అనుభూతి అంటే ఏమిటో తెలీదు! అనుభూతిని వాళ్లు పొందేలాగ కొన్ని పరిస్థితుల్ని కల్పించి ప్రయత్నం చెయ్యడమే మార్గం అంటాడు. ఉదాహరణకు: "డబ్బు" అనేది మనుష్యుల్లో 'అభయా'నికి ఒక గుర్తు. కాని 'డబ్బు' అభయం అనే అనుభూతిని మాత్రం కలిగించదు! అభయం అనే స్థితిని పొందినట్లు అనుకుంటూ డబ్బు యివ్వగల సౌఖ్యాల్ని, సాధనల్ని పొందవచ్చు. కాని డబ్బును గూర్చిన 'యావ' ఉంటూనే ఉంటుంది. 'అభయం' అన్న అనుభూతిని పొందిన మనిషి యీ 'యావ' నుంచి విముక్తుడవుతాడు. అతనికి డబ్బు విలువ ఏమిటో తెలుస్తుంది, కాని డబ్బును అదే పనిగా అన్వేషించడం ఉండదు! డబ్బుని గూర్చిన విలువని కేవలం బోధించడం ద్వారా ఆ మనఃస్థితి అతనిలో కలిగేలా చెయ్యడం సాధ్యపడదు! 'అభయం' అనే అనుభూతి సిద్ధించినప్పుడే అది వీలవుతుంది. అనుభూతి బుద్ధితో అర్థం చేసుకునేది కాదు! కొన్ని పరిస్థితుల్ని కల్పించి యితరుల్లో 'అనుభూతి' కలిగే ప్రయత్నం వరకు మనం చెయ్యవచ్చు. అప్పుడు కూడా వాళ్లు పొందినట్లు నమ్మి ఊరుకుంటే మనమేం చెయ్యలేము. అది నమ్మకమే అవుతుంది తప్ప అనుభూతి కాదు! కవిత్వాస్వాదన కూడా అంతే!

ఆపిల్ పండు వుంది. దాన్ని గూర్చి ఎన్ని విధాలనైనా వర్ణించవచ్చు. కాని దాన్ని కంటితో వస్తువుగా చూచినప్పుడు కలిగేది ఒక అనుభూతి; దాన్ని కొరికి తినడం మరొక అనుభూతి. ఈ రెండూ కాక మూడోరకందాన్ని గూర్చి హెన్రీ మికాక్స్ చెబుతాడు. "ఐ సెట్ యాన్ ఆపిల్ ఆన్ ది టేబుల్. దెన్ ఐ సెట్ మైసెల్ఫ్ ఇన్ ది ఆపిల్. వాట్ అట్టర్ కామ్!" ఈ మూడో రకం అనుభూతియే "అనుభూతి కవిత్వానికి" చెందుతుంది.

మనం ఎరిగిన కవిత్వాలలో తార్కికమైన, ఆలోచనాత్మకమైన భాగం ఎక్కువగా వుంటుంది. కథ, సన్నివేశం, జీవితాన్ని

గూర్చి వ్యాఖ్యానం, సందేశం వగైరా. అనుభూతికి అంకురం రూపకం, ఉపమ అలంకారాలలో వుంది. 'ముఖచంద్రుడు' అని మొట్టమొదట ముఖానికీ చంద్రునికీ సంబంధాన్ని గుర్తించడము కవి అనుభూతి. తర్వాత దాన్ని మామూలుగా, అనుభూతి రహితంగా వాడుకలోకి తెచ్చుకున్నాము. అరిస్టాటిల్ అన్నాడు: "ఎ గుడ్ మెటఫర్ ఇంప్లైస్ ది ఇంట్యూటివ్ పెర్సెప్షెన్ ఆఫ్ ది సిమిలారిటి ఇన్ డిసిమిలర్స్." వర్డ్స్‌వర్త్: "ది ప్లెజర్ విచ్ ది మైండ్ డెరైవ్స్ ఫ్రమ్ ది పెర్సెప్షన్ ఆఫ్ సిమిలిట్యూడ్ ఇన్ డిస్‌సిమిలిట్యూడ్." ముఖమూ-చంద్రుడూ తార్కికంగా భిన్న వస్తువులు- ఏ) బి) - ఏ) తాను ఏ)గా ఉంటూనే బి) కూడా కావడం అనేది కవిలో జరిగిన సృష్టి; అదే అనుభూతి. ఆ అనుభూతి లక్షణం ఆనందం. ఆ ఆనందాన్ని భాషలో 'ముఖచంద్రుడు' అన్నప్పుడు, ఆ ఆనందాన్నే శ్రోత కూడా పొందగలిగితే మంచిది; అలాకాకుండా ముఖం గుండ్రంగా వున్నది, తెల్లగా వున్నది; చంద్రుడూ గుండ్రంగా వున్నాడు, తెల్లగా వున్నాడు అంటూ వ్యాఖ్యానించి, తర్కించి నిరూపించడంవల్ల అనుభూతిని చంపి, ఆలోచనని దాని స్థానంలో నిలబెడుతున్నాము! 'ముఖచంద్రుడు' అన్న పదబంధాన్ని పదే పదే ఉపయోగించడంలో కూడా మనం అదే చేస్తున్నాము. అక్కిరాజు ఉమాకాన్తమ్ నవ్యకవుల కవిత్వంలో పునరుక్తి, పులుముడు ఉన్నదని విమర్శించడంలో నిజం లేకపోలేదు! విశేషణాలను గుప్పించడం కూడా 'అనుభూతి'ని పలచబరచడమే! మధుర, మృదు, స్వాదు, మంజుల వంటివి మన కాల్పనిక కవులు ఎక్కువగా ఉపయోగించారు. కాల్పనికవాద కవుల కవితాసామగ్రి ఏమిటో పింగళి-కాటూరి కవులు జాబితానే యిచ్చారు. ఇవన్నీ కాల్పనికవాద కవిత్వంలో 'అనుభూతి' భంజకాలే! భావకవిత్వంలో సంగీతం ముఖ్యపాత్రే వహించింది. 'లిరికల్ పొయెట్రీ'కి పర్యాయ పదంగానే 'భావ కవిత్వం' వచ్చిందని కొందరన్నారు. 'అనుభూతి కవిత్వానికి సంగీతంతో అవసరం లేదు!

ఫ్రాన్స్‌లో ప్రతీకవాద కవులు అభివ్యక్తం చేసిన కాల్పనికవాదం లోకాన్నీ, భాషనీ దాటిన భావలోకాల్లో, ఏదో మార్మిక అనుభూతి పరంపరలో విహరించే ప్రయత్నం. దానికి ప్రతిక్రియగా 'ప్రతిమావాదం' వచ్చింది. ఈ లోకం, ఇందలి వస్తువులూ వీటిని మించిన ప్రపంచం లేదు. "ఎ రిటర్న్ టు థింగ్స్ ఇన్ దెమ్‌సెల్వ్స్" అన్నారు ప్రతిమావాదులు. కవిత్వానుభూతికి మూలకందమైన 'రూపకం'లోని సూత్రాన్నే సంక్లిష్టంగా నిర్వచించారు. 'ఇమేజ్' విషయంలో— "ఇమేజ్ ఈజ్ నాట్ ఎ కంపారిజన్ ఆర్ సిమిలి. ఇట్ ఈజ్ ఎ నావెల్ ఎంటైటి, విచ్ రిజల్ట్స్ ఫ్రమ్ ఎ క్రియేటివ్ ఆక్ట్ బై ది పొయట్ హు బ్రింగ్స్ టుగెదర్ టు రియాలిటీస్ విచ్ ఆర్ నాట్ నార్మలీ థాట్ ఆఫ్ యాస్ హేవింగ్ ఎనీథింగ్ ఇన్ కామన్.... ఫార్ ది రీడర్ ది ఆర్టిస్టిక్ ఎమోషన్ స్టాండ్స్ ఇన్ డైరెక్ట్ ప్రొపోజిషన్ టు ది ఇంటెన్సిటి ఆఫ్ ది పారడాక్స్ ఇన్‌హెరెంట్ ఇన్ ఇట్-యాస్ ఎ కాన్షియస్ ఎఫర్ట్ ఈజ్ రిక్వయిర్డ్ టు రికగ్నయిజ్ ది పెర్టినెంట్ కామన్ ఫీచర్ ఇన్ టూ డిస్టింక్ట్ అండ్ సీమింగ్‌లీ అన్‌రిలేటెడ్ ఎలిమెంట్స్." "తడుముతో చీకటి జిప్పుని కొద్దికొద్దిగా విప్పుతూ ముందుకు సాగుతోంది కారు.... ప్రియురాలి లేత రంగులకేసి, వెలుగులు జారే నున్నదనాలకేసి, మెత్తటి రాత్రి బ్లాంకెట్‌లోకి, మృదువుగా, మత్తుగా, ఇంకా లోతుకి ప్రయాణం" (రాత్రి కారు ప్రయాణం -ఇస్మాయిల్) ఇదీ అనుభూతి కవిత్వం-ఇమేజిస్టులనుంచీ నేర్చుకున్న శిల్పం.

అయితే ఇమేజిస్ట్ కవులందరూ అనుభూతివాద కవులు కారు! టి. ఎస్. ఎలియట్ ఇమేజిస్ట్ కవి, కాని అనుభూతి కవి కాడు! కాల్పనికవాదకవులు 'సెంటిమెంటలిజమ్'లోకి తరచు దిగజారిపోవడం కనిపిస్తుంది. అనుభూతి కవిత్వంలో అది కనిపించగూడదు; కనిపిస్తే 'అనుభూతి' భంగమౌతుంది! "సెంటిమెంటాలిటి ఈజ్ ఎ ఫెయిల్యూర్ ఆఫ్ ఫీలింగ్." కాల్పనికవాద కవుల్లో శృంగారం, కరుణ వంటి సాంప్రదాయికంగా గుర్తింపదగిన రసపోషణ, పాత్రపోషణ, సన్నివేశ చిత్రణ ఉంటాయి. అనుభూతి కవిత్వంలో అనుభూతి నిర్దేశం పాఠకునికే వదలిపెట్టబడింది. పైనుదాహరించిన ఇస్మాయిల్ రచనలో 'శృంగారం' వుందని అనుకోవచ్చు. అలా అనుకోవడంతో పాఠకుడు తన అనుభూతికే అవరోధం కల్పించుకొని పేరు గుర్తింపుతో తృప్తి పడుతున్నట్లవుతుంది! మేధాగతమైన గుర్తింపులూ, విశ్లేషణలూ, తర్కాలూ వ్యక్తి అనుభూతి సాంద్రతకు భంజకాలే తప్ప దోహదాలు కావు. "యాస్ ది రీజన్ డెస్ట్రాయ్స్, ది పొయట్ మస్ట్ క్రియేట్" అంటాడు వాలెస్ స్టీవెన్స్ అనే కవి. కవి సృష్టించినదాన్ని - అనుభూతిగా స్వీకరించకుండా తర్కించడం కూడా దాన్ని పాడు చేసుకోవడమే అవుతుంది!

అందువల్ల అనుభూతికి అవరోధమయ్యే ఆలోచనా సామగ్రిని వర్జించడమే అనుభూతి కవి లక్ష్యం. ఈ లక్ష్యం సాధించేదేమిటి? వ్యక్తిపరంగా, సమాజపరంగా? మార్కూజ్ అంటాడు. "ది ట్రెడిషనల్ ఫార్మ్ ఆఫ్ రీజన్ ఈజ్ టు బి రెజెక్టెడ్ ఆన్ ది బేసిస్ ఆఫ్ ది ఎక్స్‌పీరియన్స్ ఆఫ్ బీయింగ్-యాస్-ఎండ్-ఇన్

ఇట్‌సెల్ఫ్ యాస్ జాయ్. ది ప్రెరసీ ఆఫ్ బికమింగ్ ఓవర్ బీయింగ్ మస్ట్ బి బ్రోకెన్ ఇఫ్ మ్యాన్ ఈజ్ టు కమ్ టు హిమ్ సెల్ఫ్ ఇన్ ఎ వరల్డ్ విచ్ ఈజ్ ట్రూలీ హిస్ ఓన్" జీవితం యొక్క లౌకిక పరిణామంలో నిత్య నైమిత్తికాల్లో, ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాల అన్వేషణలో నిమగ్నుడైన మానవుడు తన అస్తిత్వాన్ని, దాని అనుభూతిని విస్మరిస్తున్నాడు. ఆ అనుభూతి స్వరూపం ఆనందం. దాన్ని దాటిన గమ్యం ఏదో ఎక్కడో లేదు. అస్తిత్వపు లోతుల్ని తాకినప్పుడు, మనిషి యితర లోకాల్ని గూర్చిన వెర్రి అన్వేషణ మానుకొని, తనదైన ఈ ప్రపంచంలో, స్వస్వరూప జ్ఞానంతో, ఆనందంతో బ్రతుకగలుగుతాడు. ఇందులో మోక్షం అనే పురుషార్థం కూడా ఒక మరీచికే! "దిస్ విల్ హేపన్ ఓన్లీ వెన్ ది ట్రాన్సెన్‌డెన్స్ హ్యాజ్ బీన్ కాన్క్వెరెడ్ అండ్ ఎటర్నిటీ హ్యాజ్ బికమ్ ప్రెజంట్ ఇన్ ది హియర్ అండ్ నౌ." మార్క్యూజ్-మానవుని దృక్పథంలో మార్పు అవసరం అంటాడు. ప్రకృతిమీద (సైన్సు ద్వారా), తోటి మానవులమీదా (రాజకీయం ద్వారా) ఆధిక్యాన్ని, అధికారాన్ని పొందాలనే సంస్కృతినుంచీ బయటపడాలి. "ది ఎక్స్‌పీరియన్స్ ఆఫ్ ఎ వరల్డ్ దట్ ఈస్ నాట్ టు బి మాస్టర్డ్ అండ్ కంట్రోల్డ్ బట్ టు బి లిబరేటెడ్.... ది అపోజిషన్ బిట్వీన్ మాన్ అండ్ నేచర్ సబ్జెక్ట్ అండ్ ఆబ్జెక్ట్ టు బి ఓవర్‌కమ్ బీయింగ్ ఈజ్ టు బి ఎక్స్‌పీరియన్స్‌డ్ యాస్ గ్రాటిఫికేషన్. నాట్ ది ఫస్ట్ ఆఫ్ ఎక్స్‌పీరియన్స్ బట్ ఎక్స్‌పీరియన్స్ ఇట్‌సెల్ఫ్ ఈస్ ది గోల్" (మార్క్యూసా)

ఇక్కడ విషయి-విషయము అంటూ రెండుగా భావింపబడుతూ, తత్త్వవిచారణను, ముఖ్యంగా పాశ్చాత్య తత్త్వ విచారణను - ప్రభావితం చేస్తున్న ద్వంద్వాలను గూర్చి కొంత ప్రసంగించాలి. ఈ దృక్పథంవల్లనే భావవాదం - భౌతికవాదం వైరుద్ధ్యాలూ, సాహిత్యంలో కాల్పనికవాదం (ఆత్మాశ్రయం)-వాస్తవికతావాదం విభేదాలూ ఉద్భవించాయి. 19-శతాబ్ది పాశ్చాత్య సాహిత్యంలోగాని, రెండు ప్రపంచ యుద్ధాలమధ్య కలిగిన సాహిత్య పరిణామాలలోగాని (ఇలియట్, జేమ్స్ జాయ్, ఈట్స్) కాల్పనికవాదానికీ వాస్తవికతావాదానికీ మధ్య సంఘర్షణ, సమన్వయం ఉంటూనే వున్నది. (దీన్ని గూర్చి 'సాహిత్యం-ఆధునికత'* అనే నా వ్యాసంలో విపులంగా చర్చించాను). ఆసక్తికరమైన విషయమేమంటే రెండవ ప్రపంచయుద్ధం కాలంలోనూ అటుతర్వాత, సార్త్రే, కేమూవంటి రచయితలద్వారా ఫినామెనాలజీ అస్తిత్వవాదం ప్రాముఖ్యం వహించాయి. ఫినామెనాలజీ అనుభవానికే ప్రాముఖ్యం యిచ్చి, అనుభవాన్నే విశ్లేషిస్తుంది తప్ప ఆత్మాశ్రయ, వస్త్వాశ్రయ విభేదాన్ని గుర్తించదు. ఈ పరిణామం సాహిత్యంలో వస్తుందని 1930లోనే ఎడ్మండ్ విల్సన్ అనే ప్రముఖ విమర్శకుడు ఊహించాడు కూడా.

విషయి-విషయము అనే దంద్వాన్ని పరిత్యజించి చూచినప్పుడు సత్యంపట్ల దృష్టి మారుతుంది. సత్యం వస్త్వాశ్రయంగా, సామూహికమైనదిగా కాక కేవలం వ్యక్తిపరమై, సాపేక్షమైనదిగా భాసిస్తుంది. "ఈస్ ఇట్ ట్రూ:" అనికాక "ఈస్ ఇట్ ట్రూ ఫార్ మి?" అనేది ప్రాధాన్యం వహిస్తుంది.

'అనుభూతి కవిత్వా'నికీ 'అస్తిత్వవాదా'నికీ చాలదగ్గర సంబంధం వుంది. అస్తిత్వవాద దృక్పథంలో మనిషికీ బాహ్య ప్రపంచానికీ గల సంబంధం ఆత్మీయమైనది, ఆలోచనాత్మకం కాదు. మనం వస్తు ప్రపంచంలో మెలిగే విధానంలో ఆలోచనకంటె ఆత్మీయతే ప్రాధాన్యం వహిస్తూంటుంది - ఉదాహరణకు సైకిలు, కారు, చేతికర్ర వంటివాటిని గూర్చి బుర్ర ఉపయోగించి ఆలోచించడంకంటె, మొదట మన శరీరం వాటితో సమన్వయం కుదురుకుంటుంది. "ఉయ్ మేక్ దెమ్ షేర్ ఇన్ ది ఎక్స్‌టెన్షన్ ఇన్ స్పేస్ ఆఫ్ ది బాడి యాస్ సచ్." మెర్లీన్ పొంటీ అంటాడు: "ది వరల్డ్ ఈస్ నాట్ వాట్ ఐ థింక్, బట్ వాట్ ఐ లివ్." అలా ప్రపంచాన్ని ఆత్మీయంగా గుర్తించడమే 'అనుభూతి'. 'మనిషి'ని గురించిన ప్రాథమిక నిర్వచనం అంటూ ఏమీ లేదు; మతం, సైన్సు, రాజకీయాలు, తత్త్వశాస్త్రం - వీటినుంచీ 'మనిషి'ని గూర్చిన నిర్వచనాన్ని ఎరువు తెచ్చుకోవలసిన అవసరం అస్తిత్వవాద రచయితకు లేదు ఇదే అనుభూతివాద కవికి వర్తిస్తుంది.

1950 ప్రాంతాల ఇంగ్లండులో, అమెరికాలో 'నేకెడ్ పొయిట్రి', 'ఓపన్ పొయిట్రి' — నగ్నకవిత్వం, దిగంబర కవిత్వం, 'కాన్ఫిడెన్షియల్ పొయిట్రి' ఆర్ 'పొయిట్రీ ఆఫ్ ఎక్స్‌పీరియన్స్' - అనుభూతి కవిత్వం పేర్లతో కొత్త కవిత్వం వెలువడింది. దీనికీ తెలుగులో వచ్చిన 'దిగంబర కవిత్వా'నికీ పేరులో తప్ప యితర సామ్యం లేదు. అలాగే 'పొయిట్రీ ఆఫ్ ఎక్స్‌పీరియన్స్'కీ తెలుగులో 'అనుభూతి కవిత్వా'నికీ ప్రేరణలో కొన్ని పోలికలున్నా, స్వరూపంలో తేడాలున్నాయి. రాబర్ట్ లోవెల్ (లైఫ్ స్టడీస్, 1959), డబ్ల్యు. డి. స్నాడ్‌గ్రాస్ (హార్ట్స్ నీడిల్) ఆన్ సెక్స్టన్ (ది బెడ్లామ్, 1960), సిల్వియా

* "సాహిత్యం - ఆధునికత" — అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు, 1987 వరంగల్.

ప్లాథ్ (ఏరిల్, 1965) ఈ కోవకు చెందిన కవులు. తార్కిక శక్తిని ఆవలనుంచి, మనస్సులో ఉన్నదంతా వెళ్లబోసుకోవడం ద్వారా, వ్యక్తి అనుభూతి లోతుల్ని తాకటానికి కవితారచనలో ప్రయత్నిస్తున్నానంటాడు లోవెల్. జేమ్సుడిక్కి (హెల్‌మెట్స్, 1964) అదే ధ్యేయాన్ని చెప్పాడు. ఈ కవులు ఇమేజిస్ట్ శిల్పాన్నిగాని, మరే శిల్పాన్నిగాని త్రోసిరాజనడం కన్పిస్తుంది: ఆ విధంగా పాఠకునిలో కేవలం అనుభూతిని కల్పించే ప్రయత్నం చెయ్యవచ్చునని వాళ్ల నమ్మిక. ఈ విషయంలో తెలుగు కవులు ముఖ్యంగా ఇస్మాయిల్, ఇమేజిస్ట్ శిల్పాన్ని నేర్పుగా, శ్రద్ధగా ప్రయోగించి ధ్యేయాన్ని సాధిస్తున్నారు.

అనుభూతి కవిత్వం వ్యక్తిపరంగా, సమాజపరంగా సాధించేదేమిటి? సైన్సు, రాజకీయాలూ, ధర్మబోధవంటివి మనిషి చైతన్యాన్ని ఆక్రమించి, మనిషి వస్తుప్రపంచంలో తన అస్తిత్వంద్వారా పొందే సహజ స్నిగ్ధమైన ఆనందాన్ని అణచివేసి, త్రొక్కిపెడుతున్నాయి. ఆ ఆనందానికి, సహజమైన అస్తిత్వ అనుభూతికి సముచితమైన స్థానాన్నీ, విలువనీ ఏర్పరచే ప్రయోజనమే అనుభూతి కవిత్వం చేస్తున్నది. ఇది జె. పి. రాన్సమ్ అనే అమెరికన్ కవి అభిప్రాయం.

వ్యక్తి అనుభూతి విశిష్టమైనది అన్నప్పుడు పాఠకులకు అది ఎలా అందుతుంది? అది సాధారణీకరణం చెందడం సాధ్యమా? అన్న ప్రశ్నకు రాబర్ట్ పెన్ వారన్ కవి యిలా చెబుతున్నాడు. అనుభూతి కవితను పాఠకుడు బుద్ధితో వ్యాఖ్యానించి, అర్థం చేసుకునే ప్రశ్న యిక్కడ ఉదయించదు. ఈ కవిత్వ లక్షణం అది కానే కాదు! ఈ కవిత వెలుతురు వంటిది, వెలుతురులో కనిపించే వస్తువువంటిది కాదు. అంటే కవిత అనే ఈ వెలుతురుతో పాఠకుడు తనలోని అనుభూతుల్ని రకరకాలుగా గుర్తించి ఆనందించడానికి వీలవుతుందన్న మాట.

ఉదాహరణకు ఇస్మాయిల్ వ్రాసిన 'గోడ' అనే చిన్న కవితను తీసుకుందాం. "బైట ఉండాల్సినవేమిటో, లోన ఉండాల్సినవేమిటో అన్నీ నాకు తెలుసు. ఐతే, ఈ కిటికీకి ఇక్కడేం పని?" ఈ కవిత కలిగించే అనుభూతిని ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా పొంది అభివ్యక్తం చెయ్యవచ్చు. అంటే అన్వయం చెప్పుకోవచ్చు. కాని అదొక్కటే సరియైనదన్న సమర్థనకు వీలులేదు! కారణం ఈ కవిత దేన్నిగూర్చో తెలీదు. గోడను గూర్చి కదా, గోడ తననుగూర్చి చెబుతున్నది కదా! ఏం చెబుతున్నది? అది నా అనుభూతికి దేనికి అభివ్యక్తో నేనుగా వెదుక్కుని గుర్తించుకోవాలి. నా మటుకు నాకు 'గోడ' విషయినీ (లోపల ఉండాల్సినది) విషయాన్నీ (బైట ఉండాల్సినది) వేరుచేస్తున్న తాత్త్విక దృక్పథానికి, అనుభూతి, 'కిటికీ'లా రెంటింటినీ కలుపుతున్న సత్యమని వ్యాఖ్యానించుకుంటాను. అనుభూతిలోనే ద్వంద్వాలు కలుస్తాయి! అయితే యిది ఆ కవితకు 'అర్థ'మని చెప్పడానికి కవితలో ఏ ఆధారమూ లేదు. వ్యాఖ్యానం నాలోని అనుభూతికి ఒక అభివ్యక్తి మాత్రమే! కవిత ఒక శబ్దనిర్మాణము, దానికి తార్కికమైన, వివరణాత్మకమైన అర్థం అంటూ ఒక్కటే వుండదు! అంటే చాలా వుంటాయి; ఏమీ లేకుండానూ పోవచ్చు!

మార్క్యూస్ అంటాడు: మనిషి జీవితంలో పని ఎంత ముఖ్యమో ఖేల అంత ముఖ్యం. పని ద్వారా లభించేది నిర్దిష్టమైన కామితార్థం. ఖేల ద్వారా లభించేది దానికదే గమ్యమైన ఆనందం. తతిమా కవిత్వాలు సందేశాలూ, అర్థాలూ యిచ్చే 'పని'ని నిర్వహిస్తే, అనుభూతి కవిత్వం ఆనందాన్ని, జీవితానందాన్ని, కేవలం జీవించటం ద్వారా మనిషి పొందే ఆనందాన్ని సిద్ధింపజేసే 'ఖేల'.

'కళ కళ కోసమే' అన్న సిద్ధాంతం సౌందర్యోపాసనకు, కళకు (ఎస్థెటిసిజమ్) సంబంధించినది. అందులో బౌద్ధిక నియమ నిబంధనలూ, సంస్కారం, సంప్రదాయం చాలా ఉన్నాయి. అవేమీ లేని - ముఖ్యంగా సంప్రదాయం సోకని - కవిత్వం అనుభూతి కవిత్వం.

అనుభూతి కవితగా గుర్తుపట్టడానికి ప్రధానమైన లక్షణం: కవిత చదివిన తర్వాత మిగిలేది ఒక సందేశం, ఒక భావం, ఒక దృక్పథం కాకుండా కేవలం అనిర్దిష్టమైన అనుభూతి కావాలి. అది పోలికలద్వారా, ఊహల అల్లికల ద్వారా, ఇంద్రియ సంవేదన రేకెత్తించే వర్ణనద్వారా కావచ్చు - కాని అందులోని నవ్యత హృదయానికి హత్తుకొనే అనిర్వచనీయమైన, అనిర్దిష్టమైన అనుభూతిగా మిగలాలి. ఇస్మాయిల్ గ్రామఫోన్ రికార్డు, టీ కప్పు, సైకిలు, మేకు, సీసా, గాడిద, ఫ్యానుకింద లోకం, బావి, చెట్టు, కోసిన మామిడిపండు, గోళీకాయలు, తుఫాను, గేదెవంటి శీర్షికలతో వ్రాసిన పద్యాలు ఒక్కొక్కటి ఒక వైయక్తికానుభూతిని అందిస్తూ, జీవించటంలో గల ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఘర్షణ, నిర్వేదం ఎక్కడా కనిపించదు.

ఇస్మాయిల్ శిల్పం పదచిత్రాలతో, భావసంక్షిప్తతతో కూడిన ఇమేజిస్ట్ శిల్పం. అన్వయ క్లిష్టత - ప్రతీకవాదుల సంప్రదాయానికి సంబంధించినది - ఎక్కడా కనిపించదు. సంప్రదాయ కాల్పనికవాద ఛాయలు ఎక్కడా సోకవు.

శ్రీకాంతశర్మ శిల్పం భావకవుల శిల్పమే. కాని ధ్యేయం అనుభూతి "లోకంలో ఋతువులు ఆరైతే, నీలో ప్రతి అనుభవం ఒక ఋతువే" అంటాడు. కాల్పనికవాదం తాలూకు స్వాప్నికత చాలచోట్ల కనిపిస్తుంది. స్వప్నం కూడా అనుభూతే! అయితే మనోవైజ్ఞానిక సిద్ధాంతాలనూ, సందేశాన్ని చేరవేసేందుకు కాక అస్తిత్వపు అనుభూతిని వింతగా వినూత్నంగా ఆవిష్కరించే స్వప్నశకలాలు శ్రీకాంతశర్మ కవితల్లో లభిస్తాయి. "జీవితపు రొదకూ మెత్తని ఎదకూ ఎంతెంత దూరం? నా అస్తిత్వపు విలువ కొండ అంచున బొట్టమోపుగా నిలిచిన బొత్తరాయి తీరు!.... లోయ నా మౌనం" (లోయ) అంటాడు.

"నీలో యిరుక్కున్న ప్రపంచం బయటపడాలనుకుంటుంది, బయటనున్న ప్రపంచం నీలో జొరబడాలనుకుంటుంది, ఇది చిర ఘర్షణ" (దుఃఖం) ఇది శ్రీకాంతశర్మ కవితల్లోని అస్తిత్వ పరిదేవనం (ఎక్సిస్టెన్షియల్ ఎగాని).

బాలగంగాధర్ తిలక్ రచనలు కొన్నింటితో ప్రారంభమైన అనుభూతి కవిత, ఇస్మాయిల్, శ్రీకాంతశర్మ కవితల్లో ఒక స్పష్టమైన కవితా విప్లవంగా రూపుదిద్దుకొని, రవూఫ్, చిన వీరభద్రుడు, శిఖామణి వంటి యువకవుల్లో వికాసం చెందుతూ, తెలుగు కవిత్వంయొక్క నవనవోన్మేషిత్వాన్ని నిరూపిస్తున్నది.

# నేనెవర్ని...?!

## శ్రీ ఏలేశ్వర నాగభూషణాచార్య

మానసిక వ్యాగ్రోగపు పొరల్లో పెరిగిన
అనాథను
మస్తిష్కపు నరాల్లో పాకే కరెంటుతో ఆలోచిస్తే
పనికిరాని బెగ్గర్ని కావొచ్చు బాబు
నన్నెవరూ ఆనవాలు పట్టలేరు
ఎంగిలి విస్తార్లు పేర్చినట్లు
ఒక్కొక్క పేజీని తెరచుకుంటూ
నాకు నేనే జీవితపు పాఠాలు చెప్పుకోవాలి
నా పదాల గూర్చి నేనే పరామర్శించుకోవాలి
నగరపు నడిరోడ్డుపై పయనిస్తున్నపుడు
తెగిపోయిన ఆకలి వల తాళ్ళను
నా నడుంకు నేనే బిగించుకోవాలి
నా కాళ్ళకు నేనే గమ్యం వెతుక్కోవాలి
సమస్యల శూరాతలను గర్భకుహరంలో
పాతేసుకున్న చెత్తకుండీ నన్ను సహ్యంగా చూస్తునపుడు
మరి నేనెవరికి పనికొస్తాను?
నా శ్రమంత దోసుకున్న దోసిల్లు రంగులు మార్చాయ్
జపసత్వాలున్నంతవరకు అరచేతి బొంగరంలా
ఆడించుకున్న పందికొక్కుల కక్కర్లేను
చివరికి నేనెవరి కక్కరకొస్తాను నేస్తం?
పికిలిపోయిన నా శరీరాన్ని నిలువుదోపిడీ చేసే
కార్లు టైర్లు ఆహ్వానిస్తాయి
నా శరీరపు దుర్గంధాని భరించలేని
బజారులు ఆహ్వానిస్తాయ్
స్వార్థపు ముళ్ళకంచల చదరంగం
నన్నొక పావును చేశాయి, ఫకీరును చేశాయి
పాలనురుగుల్లో ఊదే నా నరాలను
భూమిపై శిలువేశారు.
ఫకీరునై వీధి వీధీ పయనిస్తున్న నా పాదాలపై
అధికారపు తుమ్మముళ్ళు దించారు
తుది పోరాటానికి చిహ్నంగా నా కళ్లు
ఆకాశాన్ని కౌగలించుకుంటాయి
సంద్రపు కెరటాల్లా ఎగిరిపడే జనం
నా కళ్ల ఆకాశంవైపు దారులు తీస్తారు.

# మధుర స్మృతి

నా
నవనాడుల్ని పులకింపచేసే నీ కంఠధ్వని-
ఊహాలోకమందున్న మనసుని తట్టి పిలుస్తుంది.
ఆ 'స్పర్శ' స్వర్గ సుఖాల్ని ధిగమిస్తుంది
కలవరపరచే ఆ కళ్ళు ఆకలిదప్పుల్ని మరపిస్తే
కనులవిందైన నీ కోమల రూపాన్ని కళ్ళు-
'రెప్పపాటు' మరిచి చూస్తే
'మనోవ్యధ'ని విడమరిచి చెప్పుకోవాలనీ పెదాలు-
ప్రతి గడియా అదరుతై
'అనే మాట' వినాలనున్నట్లు 'శ్వాస' కొద్ది-
క్షణాలు నిశ్శబ్దాన్ని భరిస్తుంది
నీ రాక రేపిన 'అలజడి' మరో రాక కోసం_
'ఎదురుచూపై' మిగులుతుంది.

# దీపమై వెలుగుతాను

చీకటి దారిన పోయే మనిషితో
రంగుల పూలు అశాశ్వతాలని
నీటిబుగ్గలు దాహాన్ని తీర్చలేవని
సర్వమానవ సౌభ్రాతృత్వ సాధన-
'సంఘసేవ'తోనే ఆరంభమని గ్రహింపచేస్తాను
పరిపూర్ణత, సత్శీలత, మానవతలు
హృదిలో స్థిరమైయున్నపుడు
ఎక్కడా ఓటమి పరిహసించదని
సమాజంలోని మాలిన్యం యీషణ్మాత్రమైన చొరబడదని
సంపూర్ణమైన, దృఢమైన విశ్వాసంతో
వేసారిన ప్రతిగుండెనూ తట్టి విన్నిస్తాను
చీకటిలోనే వెలుగు అవసరమని
వెలుగే చీకటిని గెలుస్తుందని
ఎదురుచూసి ఎర్రబడ్డ ప్రతి కంటిముందు చిత్రీకరిస్తాను
శ్రమలో, చర్మ రంధ్రాల్లోంచి ఉబికొచ్చే ప్రతి స్వేద బిందువూ
గమ్యం తెలిసి జీవన సాగరంలో,
గోరంతదీపమై మార్గదర్శకమౌతుందని తెలిచెప్తాను
యీ బధిరమైన జగత్తులో
మార్గాన్ని చూపే మణిదీపమై వెల్గుతాను.

(డా॥ సి. నా. రె. గార్కి కృతజ్ఞతలతో)

శ్రీ మాధవుడు మంగిపూడి

డా॥ పెన్నా శివరామకృష్ణ

# శేషేంద్ర కవిత - సామాజిక చైతన్యం

ఆర్థిక వ్యవస్థ పునాదిగా ఆయా కాలాలలో ఉండే వర్గాలను, వాటి స్వరూప స్వభావాలను అవగాహన చేసికొని తన రచనలలో ప్రతిబింబింపచేసే రచయిత సామాజిక స్పృహ కలిగినవాడని చెప్పవచ్చు. వర్గసంఘర్షణను పటిష్టంగా చిత్రీకరిస్తూ, శ్రామికవర్గ నియంతృత్వ సాధనకు, పీడితవర్గంవైపు నిలబడే రచయితను సామాజిక చైతన్యం కలిగినవాడని భావింపవచ్చు. 'స్పృహ అనేది హృదయసంబంధి అయితే చైతన్యం క్రియాసంబంధి.'[1]

నిబద్ధత

తెలుగు సాహిత్యంలో వర్గసంఘర్షణ సిద్ధాంతం అభ్యుదయ కవిత్వంలో ప్రధమంగా ప్రతిబింబించింది ఆనాటినుండి నిబద్ధత (కమిట్‌మెంట్) విషయంలో చర్చలు జరిగినప్పటికి వి.ర.సం. అవతరణతో దీనికి బాగా ప్రాధాన్యం వచ్చింది.

> "విప్లవ పార్టీకి సాహిత్య సాంస్కృతికరంగంలో విప్లవ పంథా ఉంటుంది. విప్లవాన్ని సమర్థించే రచయితలు విప్లవ రాజకీయాల ఆధిపత్యాన్ని అంగీకరించి తీరాలి.... ప్రజల విప్లవ కార్యాచరణలో భాగంగానే సాహిత్య రంగంలో వర్గపోరాటం చేయటం సాహిత్యంలో నిబద్ధత. రచనతో బాటు రచయిత కూడా విప్లవోద్యమంలో భాగస్వామి కావటం నిబద్ధత ప్రధాన లక్షణం "[2]

అన్నారు త్రిపురనేని మధుసూదనరావుగారు. దీనితో రచయిత విప్లవానికి నిమగ్నుడు అయితే మరీ మంచిది; నిబద్ధుడు కావటం తప్పనిసరి అనే దృక్పథం వ్యాపించింది.

> "కవి-కళాకారుడు సంఘానికి దాస్యం చేయాల్సిందే .. అయితే తల్లి తన సంతానానికి చేసే దాస్యంలాంటిది. ప్రజలమీద ఒక ప్రివిలెజ్‌డ్ స్టేటస్‌లో ఉండాలని తపన పడే రాజకీయపక్షాలకి దాస్యం చేసే కవి సంఘానికెన్నడూ తన కళద్వారా సేవ చేయలేడు. అతడా పక్షంలో ఒక కార్యకర్త కాగల్గుతాడే తప్ప మరేమీ కాలేడు. అందుకని సంకుచిత పరిధుల్లోంచి పార్టీ రాజకీయాల కుట్రలూ, కుహకాలనుంచి కవి తన కళా ప్రత్యేకతల్ని నిల్పుకోవడం వల్ల సంఘానికి చేసే సేవ విశిష్టమైంది."[3]

అని భావిస్తూ నిబద్ధతను వ్యతిరేకిస్తూ, సాహిత్య స్పృహను విస్మరించరాదనే దృక్పథం నేటి సాహిత్యవేత్తలలో బలంగానే ఉంది. ఈ దృక్పథం శేషేంద్రలో ఉద్యమస్ఫూర్తిని పొందింది. రచయిత పార్టీకి బానిసయిపోవటంవలన అతనిలో విశాలదృష్టి లోపించింది. పార్టీలలో విభేదాలు 'కవులను వివిధ వర్గాలుగా విడదీసినాయి, విడదీస్తున్నాయి. వస్తువైవిధ్యం నశించింది; శిల్పంకంటె సిద్ధాంత వివరణ ఎక్కువయింది. ఇట్టి స్థితిలో కవి తన అనుభూతి పరిణామంచేత ఏ రకమయిన అధర్మాన్ని సహించలేని నాజూకుజీవి అవుతాడవి అట్టి కవి విశాల మానవతకు బాధ్యుడని సామాజిక చైతన్యం అచైతన్యంలో ఒక భాగమేనని కనుక కవి త్రికరణశుద్ధితో కూడిన అనుభూతికి నిబద్ధుడు కావాలనేది శేషేంద్ర అభిమతం.

అ.ర.సం, వి.ర.సం. ఇత్యాది సాహిత్య సంస్థల విషయంలో శేషేంద్ర అభిప్రాయం గమనించదగినది. విప్లవం విషయంలో ఆయా సాహిత్యసంస్థల జనకపార్టీలయిన రాజకీయ పార్టీలతో శేషేంద్రకు ఏ విధమయిన క్లేశమూ, విభిన్న దృక్పథమూ లేదు. ఆయా సంస్థలు ఆయా పార్టీలకు ప్రచార సంస్థలుగా సామాజిక చైతన్యవ్యాప్తికి కృషిచేస్తూ వర్ధిల్లవలసిందే. కాని ఆ సంస్థలు తమకు నిబద్ధులు కాని, లేదా సభ్యులు కాని విప్లవకవుల్ని విప్లవ నిరోధకులని నిందించటమూ ఇత్యాది చర్యలు సమర్థనీయం కావనేది ఆయన దృక్పథం. "ఈ సాహిత్య సదృశ సంస్థల్లో సాహిత్యకృషి, శాస్త్రనిష్ఠ, అధ్యయనశీలము, నిష్పాక్షిక విమర్శ మొదలైన జీవతుల్య సాహిత్య లక్షణాలు తక్కువగా కనిపిస్తాయి " అన్నాడు.[4]

> "కవి జ్ఞాని నైతికవీరుడు. సమస్త మానవాళికీ బాధ్యుడు. ఇంత బాధ్యత ఉన్నవాడు ఒక్క ధర్మపక్షం వినా మరెవ్వరి పక్షమూ వహించలేడు. కవి ఏ అధికార సంస్థతోను ఏ రాజకీయ పక్షంతోనూ ఐక్యం చెందలేడు. ఆ సంస్థ

తన గౌరవాన్నీ సానుభూతినీ కోల్పోయినప్పుడు దాన్ని విమర్శించే స్వేచ్ఛని నిలుపుకోడానికి. కవి అట్లా నిలుపుకున్న స్వేచ్ఛ మూలంగానే దేశానికి క్షేమం కలుగుతుంది." (కవిసేన మేనిఫెస్టో పుట. 256)

పార్టీలు రాజకీయాలు లేకుండా విప్లవం రాదు. కాని కవి వాటికి బానిసైతే స్వేచ్ఛ కోల్పోతాడనీ, కవి ధర్మాధర్మ విచక్షణతో సర్వరంగాలలోని లోపాలను గుణాలను విమర్శించగలిగే నిర్భీకశక్తిగా రూపొందాలని అట్టి కవి సర్వవిధ వైజ్ఞానిక తరగతులకు ఏకైక ప్రతినిధి కాగలడని పేర్కొన్నాడు.

ఈ సందర్భంలో ప్రసిద్ధ విమర్శకుడు ఎవెనెర్ జిన్[5] మాటలు గమనించదగినవి.

"జెన్యూన్ కమిట్‌మెంట్ ఈజ్ ఓన్లీ ఫౌండ్ ఇన్ దోజ్ వర్క్స్, ఇన్ విచ్ ది ఎసెన్స్ ఆఫ్ ది ఆర్టిస్టిక్ ఇమేజెస్ సర్వ్స్ టు అడ్వాన్స్ ది కాజ్ ఆఫ్ కమ్యూనిస్ట్ ఎడ్యుకేషన్ ఆఫ్ ది పీపుల్, దజ్ హెల్పింగ్ ది పీపుల్ అండ్ ది పార్టీ టు బిల్డ్ ఎ న్యూ లైఫ్."

### వర్గ చైతన్యం :

'పక్షులు' కవితా సంపుటిలోని విశ్వఘోష, జ్వాల, ఆనివార్యం, ఆత్మజ్యోతి, జీవనగంగ, ప్రపంచ మానవులు, మృత్యుంజయులు మొదలయిన ఖండికలలో ఆకలితో మరణించే నోరు లేని నిసువుల గురించి, బధిరాంధక పీడితుల గురించి వర్ణించినాడు. ఋతుఘోషలో కూడు, గుడ్డ, నీరు లేక చలి పులి వోలె దారుల పచారులు చేయుచునుండ ఇత్యాది పద్యాలలో ఊరి కావల పెనుమర్రి నీడలో నెలవంకయే దీపముగా నిద్రిస్తున్న పసిపాపల గురించి, నిమ్నోన్నత వీధులలో పరుగెత్తుతూ రిక్షా లాగలేక వేసవికాగలేక దారిద్ర్య దుర్విధిని తట్టుకోలేక కన్నీరు బెట్టు కార్మికుని గురించి వర్ణించినాడు. "వ్యధితానేక మనుష్య బాష్పజలముల్ వారాశియై పొంగు చో నుదయించున్ సమునగ్ర విప్లవము తానుచ్చె శ్రవంబోయనన్" అని విప్లవం రాకతప్పదని అభాగ్యులకు జయము తప్పదని ఆశించాడు.

"శ్రమియించే శతకోటి మానవుల కాశాజ్యోతి లేదా? విష
క్రిమి బాధామయ కాళరాత్రికి ఉషఃశ్రీరేఖ జన్మింపదా?
సమసౌభాగ్య దినంబు వచ్చి జగతీ సంగ్రామ రంగమ్ములన్
రమణీయోజ్జ్వల శాంతి సౌఖ్యమయ సామ్రాజ్యంబు వర్ధిల్లదా?"
(పక్షులు, పుట-20)

నవ ప్రపంచం ఉదయిస్తుందో లేదోననే సంశయమూ వ్యక్తం చేసినాడు. శేషజ్యోత్స్నలో కూడా

"కాలచక్రం తిరిగి తిరిగి
జీవితాన్ని క్రాసుగా మనిషిని క్రైస్తుగా
మలిచిన ఈ రోజు
ఒక నూతనయుగ సూర్యుడు ఉదయిస్తున్నాడు
మనకొక కానుకగా పట్టుకొస్తున్నాడు
ఒక నూతన యుగ గీతను
విప్లవాన్ని వీరమరణాన్ని ఉద్ఘోషించే ఉచ్చైస్స్వరగీతను"

అని విప్లవాన్ని ఆహ్వానించినాడు. పక్షులు, ఋతుఘోష ఇత్యాది గ్రంథాలలో వర్గ దృక్పథం కనిపిస్తుంది. ప్రథమంగా మండే సూర్యుడులో ప్రారంభమయి నా దేశం నా ప్రజలు, గొరిల్లా, ఆదిమపర్వం, ఆధునిక మహాభారతం మొదలయిన కావ్యాలలో వర్గచైతన్యం, వర్గ సంఘర్షణ, సాయుధ పోరాట పంథా పటిష్ఠంగా చిత్రీకరింపబడింది.

### దోపిడీ వాస్తవికత :

రైతు అంటే ఎవరని నిర్దిష్టంగా నిర్వచించుకోవటం కష్టం. కానీ తానూ, తన కుటుంబ సభ్యులు శ్రమిస్తూ సొంత ఉత్పత్తి సాధనాలతో వ్యవసాయం చేసే వ్యక్తే రైతు అని చెప్పవచ్చు.[6] కూలీలు (హెయిర్డ్ లేబర్) భూమిపై ఆధిపత్యం కంట్రోల్‌వంటి అంశాల దృష్ట్యా మరొకరకంగా విభజించుకోవచ్చు. కూలీలను ఎక్కువగా ఉపయోగించేవాడిని ధనికరైతు అని ప్రధానంగా తన కుటుంబశ్రమపై ఆధారపడేవాడిని మధ్య తరగతి రైతు అని, కుటుంబం మొత్తం శ్రమను వినియోగించటానికి అవసరమయినంత భూమి లేనివాడిని పేద రైతు అని నిర్వచించుకోవచ్చు. ఆస్తి సంబంధాలను, ఆస్తిపాస్తులనుబట్టి కూడా వర్గీకరించుకోవచ్చు.

శేషేంద్ర కవిత్వంలో రైతు భూమిపై శాశ్వతంగా గాని దీర్ఘకాలికంగా గానీ ఏదో ఒకరకమయిన యాజమాన్యం కలిగిన రైతుకు, పేదరైతుకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

"రైతు నాగలి మోస్తున్నాడు
క్రీస్తు శిలువ మోసినట్లు"

అనేక సామాజిక సమస్యల విషవలయంలో చిక్కుకొని, దోపిడీదారుల భూస్వాముల కుతంత్రాల వలన రైతులు శ్రమ ఫలాన్ని పొందలేకపోతున్నారు. దినమంతా శ్రమచేసిన రైతులు

ఎంగల తలపాగాలతో; రిక్తహస్తాలతో వెళ్ళిపోతుంటే ధాన్యపు రాశులు మిలియన్ల గొంతులెత్తి ఏడుస్తున్నాయి. అందుకే నాగళ్లు రైతులకు ఉత్పత్తి సాధనాలుగా కాక వధ్యశిలలవుతున్నాయి; తమపాలిటి శిలువలవుతున్నాయి.

నేటి విద్యావిధానం పాలకవర్గ స్వభావాన్ని ప్రతిబింబిస్తున్నది. పాలకవర్గ ప్రభావంతో చిక్కుకున్నది. భూస్వామ్య యుగపు ప్రభావాలకు లోనై నేటి విద్యావిధానం అశాస్త్రీయ ధోరణులను పోషిస్తున్నది. దశాబ్దాలపాటు సాగే విద్యాభ్యాసం వ్యక్తిని వృత్తివిద్యకు మాత్రమే కాక, ఉదర పోషణకు కూడా దూరం చేస్తున్నవి. నిరుద్యోగం, అవిద్య వ్యక్తులను నిర్వీర్యం చేస్తున్నాయి. ఈ దౌర్భాగ్య పరిస్థితుల నుద్దేశించి "మీరు పలకా పుస్తకాలు పట్టుకుని పోతుంటే బాబూ మీరు శిలువలు మోస్తున్న బాలక్రీస్తుల్లా కనిపిస్తారు" అన్నాడు. (స్కూలు బ్యాగుల బరువు మోత అనేకమంది పాఠశాల విద్యార్థులలో అంగవైకల్యానికి దారితీస్తున్నట్లు ఇటీవల వైద్యనిపుణుల బృందం జరిపిన సర్వేలో వెల్లడయింది.)[7] నేతి బీరకాయలాంటి ఈ విద్య కూడా అందరికీ అందుబాటులో లేదు. సుదీర్ఘకాలం విద్యార్జనలో గడప లేని నిరుపేద పిల్లలు తిండి లేక బాల కార్మికులుగా మారుతున్నారు. పలకా పుస్తకాలు పట్టుకోవలసిన పసిచేతులు శ్రమకు గురి అవుతున్నాయి. ఎక్కడ పసితనం కూడా బతకడానికి పని చేయాలో అక్కడ నా కాళ్లు నిజంగా తెగిపోయాయి అన్నాడు.

స్వతంత్ర జీవనాన్ని, శ్రమపట్ల గౌరవాన్ని లోపింపజేసే విద్య నిరర్థకమయిపోయి విద్యార్థులను గుమాస్తాలుగా తయారు చేస్తున్నది. ప్రభుత్వోద్యోగ వ్యవస్థ మనిషిని చావుబ్రతుకుల మధ్య నిష్ప్రయోజనం చేస్తున్నవి. "నీవు కాలేజీ గోడల్లోకి పోతావు అక్కడ్నించి గవర్నమెంటు గోడల్లోకి పోతావు. అక్కడ్నించి ఎప్పుడూ ఎవ్వరూ తిరిగిరాని గోడల్లోకి పోతావు. ఇక నీవు బ్రతికిందెప్పుడు" అన్నాడు.

పెట్టుబడిదారి సమాజంలో నగరాలు పారిశ్రామిక వాడలయినాయి. నాగరికతకు ప్రతీకలయిన నగరాలలో ప్రకృతితో పాటు మానవ ప్రకృతికూడా కల్మషమయిపోయింది. నగరాలలో జీవితం మోసపూరితమయిన పరుగు పందెం అయింది. వ్యాపారం మోసంగా; కుట్రలుగా, కుతంత్రాలుగా తయారయింది. అమానుషత్వానికి నిలయమయింది. నగరాల స్థితి ఈ విధంగా ఉంటే గ్రామాలు ఇప్పటికీ భూస్వాముల అధికార దురహంకారానికి బలి అవుతున్నాయి. దాములు కడుతున్నా భూములు దున్నుతున్నా ఫలితం దక్కక బాధపడుతున్నారు గ్రామీణ శ్రామికులు. భూములను పోగొట్టుకుని శిథిలమయిన రైతాంగం కార్మికులుగా మారుతున్నారు." అందుకే విధి నా చేతికిచ్చిన విషపాత్రిక ఈ నగరం", "అరే ఇవాళ నగరం ఒక చంబల్ వ్యాలీ, గ్రామం ఈ దేశానికి కూలీ" అన్నాడు శేషేంద్ర. నేటి సమాజ జీవితం ఎలా తయారయిందంటే చావు నెదుర్కొనడంకంటే బ్రతుకు నెదుర్కొనడం పెద్ద సమస్య అయింది. అంతకంటె భయంకర సమస్య అంతా బాగుందని అందరమూ కలిసిపాడాలి. అన్నాడు.

**నా దేశం నా ప్రజలు** 1975 మే నెలలో వెలువడింది. ఆదే సంవత్సరం దేశంలో ఎమర్జెన్సీ ప్రవేశపెట్టబడింది. ప్రజల ప్రాథమిక హక్కులు కాలరాయబడిన ఆ కాలం అంధకార యుగంగా పేర్కొనవచ్చు. పత్రికా, వాక్స్వాతంత్ర్యాదులు నశించినాయి. చైతన్యవంతులయిన కవుల కలాలకు సంకెళ్లు బిగింపబడినాయి. కవులు నిర్బంధానికి గురయినారు. నిరంకుశత్వం తాండవం చేసిన ఆ కాలంలో (1976 జులై) రచింపబడిందే గొర్రిల్లా కావ్యం. కాని ఈ కావ్యం 1977లో కాని వెలుగు చూడలేదు.[8] ఎమర్జెన్సీనాటి రాజకీయ దుస్థితి, భారతదేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థలోని దుర్లక్షణాలు విపులంగా విస్పష్టంగా కవిత్వీకరించినాడు శేషేంద్ర.

> "మనుషులు తపస్సు చేసి చేసి ఒక పామును పుట్టించారు. విరివిగా ఓట్లనే ఓవటీ - ఓట్స్, ధాన్యపు గింజలు వేసి పెంచారు. దాని పడగ నీడల్లో హాయిగా బ్రతుకవచ్చునని ఊహించారు. ఆ పాము చట్టాలనే గుడ్లు సక్రమంగా పెడుతుంది. తరచూ తన గుడ్లు తానే తింటుంది. కానీ తన జాతిని పెంచుకుంటుంది. నాగస్వరం ఊదేవాళ్ళముందే శిరస్సు ఆడిస్తుంది. లేకపోతే కస్సుమని కాటువేస్తుంది."

రాజ్యాంగబద్ధంగా ప్రజాస్వామ్యం వధింపబడింది దేశంలో. ప్రభుత్వం చట్టాలనే గుడ్లు పెడుతుంది. తన చట్టాలను తానే స్వప్రయోజనాల కనుగుణంగా సవరించటమో, రద్దు చేయటమో చేస్తుంది. అంటే తన గుడ్లను తానే తింటుంది. స్వార్థంతో తన ఆధిపత్యం అంగీకరించే ముఠాలకే అది ప్రయోజనకారి అవుతుంది. స్వప్రయోజనాల కోసం ఎంతటి నైచ్యానికయినా సిద్ధపడే రాజకీయ నాయకుల గురించి, బానిసలయిన ప్రజల గురించి "అనతి కాలంలోనే నాలుగు ముష్టిగింజల కోసం నాగస్వరం ఊదే తెగ తెగపెరిగింది దేశంలో: మామూలు మనుష్యులకు మసలే చోటే లేదిప్పుడు నా దేశంలో; ఈనాడు ఇదే నా దేశచరిత్ర." అన్నాడు శేషేంద్ర. ప్రజాస్వామ్యం పేరు చెప్పి ఎందరి

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"




మెలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మెలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

OBM 140 TG R



Amrutanjan Limited

ప్రాణాలో తీసే ఈ దుష్ట వ్యవస్థలో భాగస్వాములై తాము బలి అవుతూ ఇతరులను బలి కానివ్వకూడదని" నాగస్వరం ఊదే క్షుద్రవిద్య నేర్చుకోకండి, పామును చంపే ఉన్నతవిద్య నేర్చుకోండి" అని హెచ్చరించినాడు.

"డెమోక్రసీ ఈజ్ ఎ ఫిలాసఫీ ఆఫ్ లైఫ్ అండ్ నాట్ ఎ పొలిటికల్ థియరీ. దట్ ఈజ్ వై టు డివైజ్ ఎ పాటర్న్ ఆఫ్ గవర్నమెంట్ టు సెక్యూర్ డెమోక్రసీ అండ్ హోప్ టు పర్‌పెచ్యుయేట్ ఇట్ త్రూ ది మిషినరీ ఆఫ్ ది గవర్నమెంట్, ఈజ్ ఎ ఫ్యుటైల్ ఎటెంప్ట్ డెమోక్రసీ ఈజ్ హైలీ రిఫైన్‌డ్ ఐడియా ఆఫ్ ఎ మోస్ట్ సివిలైజ్‌డ్ హ్యూమన్ మైండ్. ఎ హోల్ మాస్ ఆఫ్ అండర్ డెవలప్‌డ్ అండ్ అన్‌డెమోక్రాటిక్ పీపుల్ కెన్ నెవర్ ఫంక్షన్ డెమోక్రాటికల్లీ అండ్ గివ్ డెమోక్రాటిక్ అడ్మినిస్ట్రేషన్ ఈవెన్ ఇఫ్ దె ఫార్మ్ ఎ డెమోక్రాటిక్ గవర్నమెంట్. ఇట్ ఈజ్ ఎసేన్‌షియల్ టు అండర్‌స్టాండ్ దట్ ఎ డెమోక్రాటిక్ గవర్నమెంట్ ఈజ్ ఓన్లీ ఎ ఫ్రాక్షన్ ఆఫ్ ఎ వైడర్ స్కీమ్ ఆఫ్ హ్యూమన్ లైఫ్ అండ్ అన్‌లెస్ ది స్కీమ్ ఇట్‌సెల్ఫ్ ఈజ్ డెమోక్రాటిక్, ది మియర్ ఫార్మ్ ఆఫ్ ఎ గవర్నమెంట్ విల్ నాట్ ఫైండ్ ఎ మీడియమ్ టు త్రైవ్."

(రక్తరేఖ. పుట-115)

ప్రజాస్వామ్యం ఒక జీవితతత్త్వమే తప్ప రాజకీయ సిద్ధాంతం కాదు. ఒక ప్రభుత్వ విధానాన్ని ఏర్పరచి దానిద్వారా ప్రజాస్వామ్యాన్ని సాధించాలనుకోవటం వ్యర్థ ప్రయత్నమే. నాగరికుడయిన మేధావియొక్క పరిపక్వమయిన ఊహే ప్రజాస్వామ్యం. నిరక్షరాస్యత ప్రబలంగా ఉన్నచోట ప్రజాస్వామ్యం సార్థకం కావాలనుకోవటం పగటి కలే. "ప్రపంచ పటంమీద నా దేశాన్ని వేలుముద్రలా వేశారు" అన్నాడు.

"అసెంబ్లీలు మనమే కడతాము అకాడమీలు నిలబెడతాము
జాతి కీర్తికి మనమే గాలిగోపురాలు లేపుతాము, వాడ్ని
కుర్చీలో కూర్చోబెడతాము మనం వాడి ఇటుకల కింద
నలిగి చస్తాము"

ప్రజలు ఎవరికి అధికారాన్ని అప్పగిస్తారో వారే ప్రజల పాలిటి శత్రువులవుతున్నారు. ఈ వ్యవస్థలో ఏది సక్రమంగా లేకపోయినా ఎన్నికలు మాత్రం నిర్వహింపబడతాయి. అధికారాన్ని ఆశించేవారికి కావాల్సినవి ఓట్లు కనుక అరే ఈ దేశం మీకేమిచ్చింది మీరెగరేసే జండా ఏమి తెచ్చింది, ఐదేళ్ళ కొకసారి ఓట్లు, ఆ మధ్యలో కునికిపాట్లు పాలితుల పీడకుల వ్యాపార వ్యవస్థలో మనిషి మనిషిగా కాక మనిషి ఒక ఓటుగా పరిగణింపబడుతున్నాడు.

"ఈ దేశంలో వంగేవాడికి ఒంగి సలాం చేసేవాడు పుడుతున్నాడు. జాగ్రత్త...వాడ్ని చంపెయ్యండి, పాములు వాటంతటవే చస్తాయి. అసలు వాడ్ని మాతృగర్భంలోనే పసిగట్టి సంహరించండి, ఈ దేశపు గాలి పీల్చడానికిగానీ, ఈ దేశపు నీరు తాగడానికిగానీ, వాడికి హక్కు లేదు."

ఈ దేశంలో ప్రజాస్వామ్యం నామమాత్రంగా మిగిలిపోవటానికి బ్రతుకు చావుకు పర్యాయపదంగా మారటానికి కారణం ప్రజలలోని బానిస మనస్తత్వం, విశ్వైచ్ఛ్యం. తర తరాలుగా ప్రజల రక్తంలో జీర్ణమయిన బానిస మనస్తత్వమే మన శత్రువు. "ఏ శత్రువు నీ బయట లేదు, నీ శత్రువు నీలో ఉన్న బానిసత్వమే. ఇక్కడ ఏ చెరసాలా లేదు. ఇండియాకంటే పెద్ద చెరసాల లేదు" అన్నాడు.

"స్వేచ్ఛ మనిషికి మొదటిశ్వాస. అది నీ రక్తపు సజీవ భాష. భూమివించి నీవు నీ చివరి అడుగు తీసేవరకు నిలుపుకోవలసిన ఒకే ధ్యాస"

నా దేశం నా ప్రజలు పుట - 46

బానిస మనస్తత్వం వలననే వ్యక్తి అన్ని రంగాలలో సహజమయిన స్వేచ్ఛను కోల్పోతున్నాడు. ఉత్పత్తి సాధనాల మీద, ఉత్పాదిత వస్తువులమీద శ్రామికుడికి ఆధిపత్యం లేదు. "మళ్ళీ స్వేచ్ఛ ఈ దేశంలో తిండి లేనిదై గడ్డి తిని బ్రతుకుతోంది." (గా. పు. 54) స్వేచ్ఛ ఒకరు ఇస్తే వచ్చేది కాదు. దానంతటది పోయేది కాదు. సహజమయిన మన స్వేచ్ఛను మనం గుర్తించినప్పుడే మన హక్కులను నిలబెట్టుకోవటానికి ప్రయత్నిస్తాము.

"చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
రాగం కోసం బిగించిన ఫిడేలులా పడి ఉంది ..."

—"అడవిలో నీకోసం మరణించిన ఆ వీరుడికి
ఎవడు కట్టగలడు ఎత్తయిన సమాధి...."

—"నా అశ్రువులే వాడిమీద రాలుతున్న పూలు"

—"ఎవడు అడవిలో వధింపబడ్డాడో
వాడే ఆకాశాన్ని వెలిగిస్తాడు
మన కన్నుల్లో సాహస రేఖలు గీస్తాడు"

—"తమ్ముడు అడవిలోకి వెళ్ళి
మళ్ళీ రాకపోతే
తడి కన్నులతో నిరీక్షించకు
నా దేశమంతా వాడి విశ్వరూపమే
మరచిపోకు మరణించిన వీరుడు
ఈ ధరిత్రికి ఒక కొత్త నక్షత్రం...."

ఎన్‌కౌంటర్ల పేరుతో జరిగే అమానుష కృత్యాలను గురించి పై విధంగా పేర్కొన్నాడు.

ఈ వ్యవస్థలో శ్రామికుని ఉత్పత్తి సాధనాలకు, ఉత్పాదక వస్తువులకే కాదు, శ్రామికుని బ్రతుకుకు కూడా రక్షణ లేదు. ఈ బూర్జువా రాజకీయ వ్యవస్థ దురాచారాలకు అంతులేదు. చంపి కొండల్లో పారేస్తుంది. చెట్లకు కట్టి ఉరి తీస్తుంది. ఇలాంటి అకృత్యాలను చూసి వెనకడుగు వేయవద్దని మరణించిన కర్మ వీరులే మన తక్షణ కర్తవ్యాన్ని నిర్దేశిస్తున్నారని మన కన్నుల్లో సాహసరేఖలు గీస్తారని అన్నాడు.

"డాములెందుకు కడుతున్నానో భూములెందుకు దున్నుతున్నానో నాకే తెలీదు నా బ్రతుకొక సున్నా కానీ నడుస్తున్నా" నా.నా. పు.22.

డాములు కడుతున్నా, భూములు దున్నుతున్నా ఏ రకంగా శ్రమించినా పండిందంతా చూస్తూ దూరంగా కూర్చుంటున్నాడు శ్రామికుడు. విస్పారంగా బ్రతుకు గడుపుతున్నాడు. కనీసం చెట్టులా ఉన్నా ఏడాదికి ఒక వసంతమయినా వచ్చేది. మనిషయి ఉండి అన్ని సుఖాలకు దూరమవుతున్నాడు.

—"ఉదయించే సూర్యుడ్ని ఊడబీకి పశ్చిమాద్రికి విసిరేస్తున్నారు. మహోగ్ర దౌర్జన్యంతో.... కానీ నా ప్రజలు చేతులు ముడుచుకుని కూర్చొని ఉన్నారు."

"—అరే ఈ గుంపుకు ఎలా మేల్కొవాలో తెలీదు. ఎలా బాహువులు జాపి తన ఇనపకాళ్లు ఇలాతలం మీద మోపాలో తెలీదు."

ప్రత్యక్షంగా పరోక్షంగా జరుగుతున్న అక్రమాలను దోపిడీలను గమనించలేకపోతున్నాడు. ఈ మట్టి శక్తిని తమ శక్తిని తెలుసుకోలేకపోతున్నాడు. తాము నిశ్చైతన్యపు నిద్రలో ఉన్నారని తెలీదు. సరి అయిన నాయకత్వం లేక ఎలా ఉద్యమించాలో తెలీదు. ఇక్కడ ప్రతిదీ పరాయీకరణకు గురవుతున్నది. ఎవరు ఈ దేశాన్ని చేస్తారో, ఎవరు ప్రజల చరిత్రను వ్రాస్తారో, ఎవరు ప్రజల స్వప్నాల్ని నెరవేరుస్తారో ఆ శ్రామికునిలో నిస్తబ్దత ఆవహించింది. ఈ వ్యవస్థ శాశ్వతం కాదని అది నశిస్తుందని "బాబూ నదిలో ఇవాళ [illegible] మునిగిపోతే పోవచ్చు కానీ రేపు నదే సముద్రంలో మునిగిపోయే రోజు కూడా రాకపోదు" (గో.పు.26) అని హెచ్చరించినాడు. వర్గచైతన్యాన్ని ప్రేరేపిస్తూ "చెమట పరిమళాలుమినే వాళ్ళ పవిత్ర శరీరాలనుంచి మానవజ్వాల [illegible]" అన్నాడు. 'వర్గచైతన్యానికి ఈ కవి పెట్టిన పేరే మానవజ్వాల.'

తిరుగుబాటు శక్తిని కోల్పోతున్న జాతిని [illegible] "తమ్ముడా నీ గాయాల దైన్యాన్ని చూడలేకున్నాను. కాని నీ ఆత్మ తిరగబడదేం అనే నా బాధ" (గో.పు.30) అన్నాడు.

"ఇక్కడ దున్నుతున్న ఓ అన్నా నీవు ఒంటరివాడవు కావు.... ఈ రాళ్లలో నీవు పెట్టిన ప్రతి అడుగు కలిపే సోదరుడు మరొకడున్నాడని మరిచిపోకు ఈ భూగోళం మీద ఇరాక్‌లో, ఇరాన్‌లో, మెక్సికోలో, మంగోలియాలో...."

శ్రామికుడు తిరుగుబాటు చేస్తే ఈ వ్యవస్థ నశించి తీరుతుందని, దోపిడీ తిరుగుబాటు ప్రపంచ వ్యాప్తమయినదేననీ, ప్రపంచ శ్రామికులలో తానొకడనే భావనను కలిగిస్తూ ఉద్యమ స్ఫూర్తిని కలిగించినాడు కవి.

"మనిషి నగరంలో వందలాది మనుషు లెందరున్నా కాలానిదే పై చేయి. దాని గొంతే వినిపిస్తుంది మనిషి చేసిన అన్ని పులియన్ల గొంతులూ అధిగమించి కోటాను కోట్ల గడియారాల్లో దాని ఉగ్రహస్తాల వేళ్లు ప్రదర్శిస్తుంది. క్రూరంగా నొక్కివేస్తుంది. మనిషి గొంతును తన అనివార్యపు చేతులతో"

శ్రామికుడు ఎప్పుడూ ఉత్పత్తి సంబంధాలలోని వైరుధ్యాలకు బలి అవుతున్నాడు. పెట్టుబడిదారుల వ్యాపార కుతంత్రాలలో చిక్కుకుంటున్నాడు. ప్రభుత్వ శాసనాలు పెట్టుబడిదారులకు అభయ హస్తాలయి శ్రామికుల గొంతు నులిమేస్తున్నాయి. అన్ని వ్యవస్థలలో అనుస్యూతంగా ప్రవహిస్తూ మనిషి జీవితాన్ని యాంత్రికంగా తయారుచేస్తున్న అధికార వర్గంపై తిరుగుబాటుకు పురికొల్పుతున్నాడు కవి.

కవి శ్రామికునిలో 'వర్గచైతన్యాన్ని జాగృతిని కలిగించటంతోబాటు, మధ్యతరగతి వర్గానికి శ్రామికునిపై సానుభూతిని కలిగిస్తున్నాడు. శ్రామికేతరులలో మధ్యతరగతి వర్గం శ్రామికుల తిరుగుబాటులో నిర్ణాయకమయిన పాత్రను వహిస్తుంది. మధ్యతరగతి వర్గం కూడా పీడితులే కనుక తాము వర్గచైతన్యాన్ని కలిగి ఉండి విద్యా వైజ్ఞానికాది రంగాలలో ముందున్న తాము శ్రామికులలోని నిరుత్సాహాన్ని పారద్రోలుతూ, వారిలో సోదర భావాన్ని కలిగి ఉండాలన్న ఉద్దేశంతో "నీకు తిండిగింజలు ఎలా వస్తున్నాయో తెలుసా, ఈ నేల ఎవరు దున్నుతున్నారో తెలుసా....మట్టిశక్తి అవగాహన చేసుకో బిడ్డా" అన్నాడు.

"ధనమనగా ఒక మానవత్వమే దాన్ని మలచుటే ధర్మంరా!
కనుక ధనికులనూ అధికారులనూ ద్వేషించే కళ నేర్చుమురా!"

శ్రామికులు కోల్పోయిన స్వేచ్ఛను సాధించుకోవాలంటే అధర్మపరులమీద ద్వేషం కలగాలి. ద్వేషం తీవ్రతరమయితే క్రోధంగా ప్రజ్వరిల్లుతుంది. చైతన్యం లేనివాడికి పీడన స్వభావం అర్థం కాదు. ఎవరికో బానిసగా ఉండి సుఖిస్తున్నామని భయపడేవాడికి పీడకునిమీద ద్వేషం ఉండదు. అందుకే నవ్వు మొహాన రాసినవాళ్ళను చూస్తే నా చెయ్యి బాంబుకోసం వెతుకుతుంది అన్నాడు. మొదట శత్రువు ఎవరో తెలియాలి. తరువాత వాడిమీద ద్వేషం కలగాలి. అందరిలో శత్రువుమీద ద్వేషం పెరిగినప్పుడే తిరుగుబాటు సఫలమవుతుంది. కనుక ద్వేషించటం కూడా ఈ సందర్భంలో కళే. "ద్వేషించే విద్య నేర్పనిండి. ద్వేషం ఎంత పవిత్రమయిన వస్తువో బోధించనిండి, ద్వేషించ దానికి కావలసిన స్పృహని నా రక్తంతో దానం చెయ్యనిండి."

"వినండి వాడు మన నిజమైన శత్రువు. నా గుండెల్లో
బంధించిన క్రూర రాక్షసులందర్నీ వాడిమీదికి విడుదల
చేస్తాను. వాడి విధ్వంసం కోసమే నిద్ర మేల్కొ
ఉంటాను."

ఆ క్రూర రాక్షసులలో ఒకడు ద్వేషం, మరొకడు పగ, ఇంకొకడు విధ్వంసం చేసే హింస, ఇవన్నీ యీ వ్యవస్థ అనే విషసర్పాన్ని చంపాలి. అప్పుడే యీ దేశంలో ప్రజలు స్వేచ్ఛతో ఉండగలుగుతారు. అందుకే ద్వేషరాక్షసుడిని ఎంతో పవిత్రమయినవాడుగా కవి చెపుతున్నది. ప్రాణాలు కాపాడే సమయంలో గరళమయినా అనాదరణీయం కాదు; యీ దృష్టితోనే కవి ఇక్కడ ద్వేషాన్ని ప్రబోధిస్తున్నది.[10]

* * *

సిద్ధాంత వివరణలే ప్రజలను చైతన్యవంతులను చేయలేవు. కళా సాంస్కృతిక రంగాలు ప్రజలను చైతన్యవంతులను చేయటంలో ప్రధానపాత్ర వహిస్తాయి. ఒక సిద్ధాంత గ్రంథం చేయలేని పని ఒక కళాప్రక్రియ సులభంగా చేయగలుగుతుంది. సామాజిక చైతన్యం కలిగిన కళాకారుడు సర్వాత్మనా ప్రజలకు అంకితం కావాలనే స్పృహ శేషేంద్రలో కనిపిస్తుంది. నా గొంతు ప్రజల కంకితం చేశాను అన్నాడు. ఆదిమకాలంనుండీ కవి అథర్వఋషిగా ఉంటూ ఆ యుగధర్మాన్ని, ఆదర్శాన్ని ప్రబోధిస్తూనే ఉన్నాడు. ఆ విధమయిన 'వైజ్ఞానిక చైతన్యం', 'మానవ చరిత్రకు తెలిసిన ఏ హద్దులూ తెలీని దేశద్రిమ్మరి అన్ని కాలాలలో అన్ని దేశాలలో అచైతన్యం ఉంటుంది.

"నా అవయవాలకు నీచంగా వంగే భంగిమలు తెలీవు.
నేను సత్యాగ్రహి, నా కశ్మల శరీరాన్ని దగ్ధం చేసుకుని
తప్త హిరణ్య ద్రవంగా ప్రవహిస్తున్నాను."

విజ్ఞాని అయిన కవి పీడకవర్గం చూపే ఆశలకు, అవకాశాలకు లొంగిపోకుండా సత్యాన్ని ఆవిష్కరించటానికి జాతికి తన గొంతును అంకితం చేయాలి.

"నేను ఝంఝామారుతాన్ని నేను వచ్చాను అశాంతిని
పంచిపెట్టడానికి, అరుస్తున్నాను ఆర్తిని తరిమేద్దామని
రండి నాతో నా ప్రజలారా రండి"

అంటూ తానే నాయకుడయి ప్రజలముందు నిలిచినాడు. 'సొంత పాట వదిలేసి ప్రజల పాట పాడాలనీ, పద్యాల బందూకులు ధరించి సేనల్లా రండి అని "నీ యుద్ధాగ్నులు నీ దేశపు యుద్ధాగ్నుల్లో కలపాలి....సొంత గోడల్ని దాటి రండి ప్రజా సముద్ర తరంగాల్లో క్రీడిద్దాం రండి" అని సోదర కవులను, "మన ఉషస్సును పాతిపెట్టి మన దేశంలో మనల్ని బానిసలు చేసిన వాళ్ళ ప్రాణవాయువులు పీలుద్దాం పదండి" అని ప్రజలందరినీ ఆహ్వానించినాడు; తాను వారిలో లీనమయినాడు.

సాయుధ పోరాట మార్గం:

"వ్యధితానేక మనుష్య బాష్ప జలముల్ వారాశియై పొంగుచో నుదయించున్ సముదగ్ర విప్లవము" (1951) అని, "వరద వచ్చిందోయి వరద వచ్చింది....పాతకోటలు తాకి పగలగొట్టింది" (1952) అంటూ సాగిన ఆరంభదశలోని కవిత్వంలో అభ్యుదయ భావన స్పష్టంగా గోచరిస్తుంది. సుమారుగా 1972 వరకు శేషేంద్ర సాహిత్యంలో అభ్యుదయం ఒక అంశగా మాత్రమే కనిపిస్తుంది. "ఏరస్తా యుద్ధాలు చేస్తుందో ప్రాణాలు

ఆటబంతుల్లా విసిరేస్తుందో, గెలుస్తుందో ఓడుతుందో, కానీ ముందుకు పోతుందో అదే నా రస్తా" అంటూ మండేసూర్యుడుతో తన కవితా ప్రస్థానాన్ని విప్లవంవైపు సాగించినాడు. ఈ ఏడాది మొలిచిన పైర్లకు దుఃఖం తీరకపోతే, వచ్చే ఏడాది పట్టె కొడవళ్ళు పట్టుకున్న పిడికిళ్ళే మొలుస్తాయి. అని మండేసూర్యుడులోనే సాయుధ పోరాటమే విప్లవానికి మార్గమని సూచించినాడు. నా దేశం నా ప్రజలు, గొరిల్లా తదితర కావ్యాలలో సాయుధ పోరాటాన్ని మరింత స్పష్టంగా నిర్దిష్టంగా తీవ్రంగా ప్రబోధించినాడు.

సాహిత్యం ప్రజల ఉద్యమాల నంటిపెట్టుకుని నడవాలనీ, ప్రజల ఉద్యమాలు కనబడనంతగా సాహిత్యపు కళ్ళు మూసుకు పోగూడదని చెప్పినాడు శేషేంద్ర.[11] అయినప్పటికీ ఆయన కవిత్వంపై సమకాలంలో జరిగిన, జరుగుతున్న సాయుధ పోరాటాల ప్రత్యక్ష ప్రభావం కనిపించదు. సాయుధ పోరాట మార్గాన్ననుసరించే వామపక్ష రాజకీయ పార్టీలతోగాని వాటి అనుబంధ సాంస్కృతిక సంస్థలతోగాని శేషేంద్ర ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండకపోవటం కూడా ఇందుకు కారణం కావచ్చు. విస్తృతమయిన కమ్యూనిస్టు సిద్ధాంతావగాహన, శ్రీకాకుళం, నక్సల్బరీ మొదలయిన ప్రాంతాలలో జరిగిన సాయుధ తిరుగుబాట్ల పరోక్ష ప్రభావం శేషేంద్ర సాయుధ పోరాటాన్ని ప్రబోధించటానికి కారణాలని చెప్పవచ్చు.

"నా కవిత్వం ఏ జెండాను ఎగరేయదు కాని నా చేతులు నా దేశపు ఖడ్గాలు" (ఆ.భా. పు.94) "రష్యా కాదు చైనా కాదు విప్లవం మాత్రం అజరామరం" (ఆ.భా. పు.161) అనటంలో శేషేంద్ర కవిత్వం అన్ని సిద్ధాంతాలకు అతీతమయినదని అర్థం కాదు. ఏ ఒక్క రాజకీయ పార్టీకి తన కవిత్వం ప్రచారం కాదని అర్థం. పీడిత ప్రజల విముక్తే తన కవిత్వ ధ్యేయమని ఎప్పటికప్పుడు తిరుగుబాటు ద్వారా ప్రజలు ఉన్న వ్యవస్థనుండి ఉత్తమ వ్యవస్థంవైపు ప్రయాణిస్తారని అన్నాడు. అందుకే నేను మాత్రం అభ్యుదయ కవిత్వం కాదు విప్లవ కవిత్వంవైపే మొగ్గుతాను (ర.రే. పు.87) అన్నాడు.

తనకు సామాన్యుల జీవితాలతో పరిచయం లేదనే విమర్శనుద్దేశించి శేషేంద్ర ఇలా అన్నాడు. "మున్సిపల్ కమీషనర్‌గా ముప్పైఅయిదేళ్ళపాటు నౌకరీ చేశాను. మురికివాడల్లో తిరిగాను, పేదలపాట్లు చూశాను. జీవితపు తుకతుకలు చూశాను. ఎన్నో అవమానాలకు అన్యాయాలకు గురి అయ్యాను. అసూయాగ్రస్తుల ద్వేషాలకు బలి అయ్యాను. నాకు ప్రజలతో సంబంధ బాంధవ్యాలు లేవంటే ఏమనాలి?"[12]

కార్మిక కర్షక పీడిత తాడిత ప్రజల జీవితంలో సూక్ష్మ సూక్ష్మాంశాల వివరణలు శేషేంద్ర కవిత్వంలో కనిపించవు. శేషేంద్రది ప్రధానంగా ప్రతీకాత్మక శైలి కనుక ఆయా ప్రజా జీవితాల సారాంశాలు, పీడకవర్గంపట్ల క్రోధం ఆయన కవిత్వంలో ప్రముఖంగా కనిపిస్తుంది.

"ఐ రిమెంబర్ ఆఫ్ యాన్ అకేషన్ వెన్ హి రెడ్ అబౌట్ గెనోసైడ్ ఇన్ వియత్నాం అండ్ హాడ్ టు టేక్ ఎ స్లీపింగ్ టాబ్లెట్ టు స్లీప్ దట్ నైట్. హి ఈజ్ ఆల్ట్రా-సెన్సిటివ్ టు పీపుల్ అండ్ సిట్యుయేషన్స్. ఒన్ మినిట్ హి మెల్ట్స్ ఇన్ టు ఎ సీ, అనదర్ హి స్టాండ్స్ సాలిడ్ లైక్ ఎ హిల్, సైలెంట్. అండ్ ఎట్ అనదర్ మూమెంట్ బ్లోస్ లైక్ ఎ వాయిలెంట్ విండ్. నెవర్ రిమెయిన్స్ ఎట్ ది సేమ్ పాయింట్ లైక్ ఎ రివర్. ఐ నో ఐ హావ్ మారీడ్ ఎ గ్రేట్ స్టార్మ్."[13]

దేశ ప్రజలపట్ల సానుభూతి, వారి విముక్తి విషయంలో ఆతురత, పీడకులపట్ల ఆవేశం ఆయన అణువణువునా వ్యాపించి ఉన్నాయని అంటూ శ్రీమతి ఇందిరాదేవి ధనరాజ్‌గిర్ చెప్పిన పై సంఘటన శేషేంద్ర మనస్తత్వాన్ని తెలియజేస్తుంది.

"ఒక చెట్టుగనక పర్వతాగ్రాలెక్కి కేకవేస్తే చెట్లు గుంపులు గుంపులుగా వస్తాయి...తిరస్కార సూచకంగా తలుపులు దూలాలు ద్వారబంధాలు కుర్చీలు బల్లలు అన్నీ చెట్లుగా మారి బయటకు వచ్చేస్తాయి....బానిసల్ని తయారుచేసే కర్మాగారాలు కూలిపోతాయి. కర్మ ఆగిపోతుంది కర్త మారిపోతాడు."

పై వాక్యాలు చెట్టును శ్రామికునిగా సంకేతిస్తూ చెప్పినవి. కార్మికులు శ్రామికులు తమకు జరుగుతున్న అన్యాయాలకు తిరస్కార సూచకంగా పనిని స్తంభింపజేస్తే ఉత్పత్తులు ఆగిపోతాయి. సమాజం అల్లకల్లోల మవుతుంది. అది తిరుగుబాటుకు సమయం అని సూచించినాడు. ఇక్కడ జీవితం పుల్లిన పండులా శిథిలమైపోయింది. విషవృక్షంలాంటి వ్యవస్థను నిర్మూలించక తప్పదు.

"ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో తిరుగాడే దేశద్రిమ్మరి విప్లవం మన వీధికూడా వస్తుంది. పసిపిల్లలు నిద్రలో బాంబుల కోసం కలలు కనే రోజు వస్తుంది." శ్రమజీవనుల గొంతు నులిమే అధర్మపరులను నశింపజేయడం అమలిన హింసే నని, పవిత్ర హింసేనని చెప్పి అలాంటి క్రియాశక్తిని గొర్రిల్లాగా సంకేతించినాడు. గొర్రిల్లాలో శేషేంద్ర క్రోధారుణ స్వరంతో వర్గరహిత సమాజ స్థాపనను స్పష్టంగా సూచించినాడు.

ఈ తిరుగుబాటుకు తటస్థవాదులు చైతన్యం లేనివారు బీదపులు పనికిరారు. ప్రాణాలు అటుఇటుల్లా విసిరేయగలిగినవారే విప్లవాన్ని తేగలరు. దారిపొడుగునా గుండె నెత్తురులు తర్పణ చేస్తేనే కలలుగనే మరో ప్రపంచం సృష్టించుకోగలం. కవి ప్రజానాయకుడుగా రూపొంది ప్రతి ఒక్కరితో ఈ విధంగా అన్నాడు.

"వస్తున్నాను నీ గుమ్మం తొక్కి నీ ప్రాణం చందా
అడగడానికి మన దేశపు వీధుల్లో రాబోయే రక్తప్రవాహాల
మహోత్సవాల కోసం ఇంత భయంకర గ్రీష్మాన్ని ఒక
విసనకర్రతో విసిరి పారేద్దామనుకున్నావేమో.... ఎన్ని
మైళ్లు అని కాదు ఎన్ని శవాలు ముందుకు పోయిందో మన
ఉద్యమం కొలుసుకో"

ఈ పెట్టుబడిదారీ సమాజం అనే గ్రీష్మాన్ని ఒక చిన్న ఉద్యమంలాంటి విసనకర్రతో పారద్రోలలేము. తీవ్రతరమయిన హింసాత్మకమయిన విప్లవమే శరణ్యం. ఉద్యమంలో ఎంత త్యాగం చేయగలననేదే కాదు, ఎంతమంది పీడకులను నాశనం చెయ్యగలిగావనే దానిమీదనే ఉద్యమ ఫలితం ఆధారపడి ఉంటుం దన్నాడు.

శ్రమించే కండలు కోర్కెల సమాధులు కావని తెలిపి "ఆకలికి అడ్డొచ్చినవాళ్ళని ఆహుతి చెయ్యడం ధర్మమేనని నాగరకత, మానవతలను నిలబెట్టడం కోసం చేసే హింస హింస కాదని అన్నాడు. "నీ దేవుడు నీ తుపాకీ కండల్లోనే నిదురిస్తు న్నాడు. అది పేలిన శబ్దం నీ చుట్టూ సుడి తిరిగితే ఒక గుడిగా పెరిగితే అప్పుడు నీ యుగం దిగివస్తుంది భూతలం మీదకి." సామాజిక వైరుధ్యాలు నశించి సమానత్వం సిద్ధించటానికి మార్క్సిజమే పరిష్కారమని సాయుధ పోరాటమే మార్గమని దృఢంగా చెబుతోంది శేషేంద్ర కవిత్వం.

శిశు వాత్సల్యం :-

పాపం పుణ్యం ప్రపంచమార్గం కష్టం సౌఖ్యం తెలియని శిశుమనస్తత్వానికి కవి మనస్తత్వానికి సామ్యముంది. "ఎ చైల్డ్స్ థింకింగ్ ఈజ్ ఆల్వేస్ అసోసియేటివ్; హి థింక్స్ ఇన్ కంపారిజన్స్, ఇన్ ఇమేజెస్, దట్ ఆర్ ఆఫెన్ సో ఫాన్సిఫుల్ అండ్ అనెక్స్పెక్టెడ్ దట్ గ్రోన్అప్స్ ఎలాస్ ఫెయిల్ టు అండర్‌స్టాండ్ దెమ్"[14] అన్నట్లు కార్యకారణ సంబంధాలు అవగాహన లేని శిశువులు ప్రకృతిలోని అంశాలకు, సన్నివేశా లకు ఏ విధంగా అనుభూతి పొందుతాడో, వ్యక్తీకరిస్తాడో కవి కూడా అదే విధంగా స్పందిస్తాడు. "కవిగా ఈ లోకానికి వచ్చిన ఒక శిశువు ప్రతి వస్తువునుంచీ ఎంతో కొంత కవితను పిండు కుంటాడు" అన్నాడు శేషేంద్ర. (శే. జ్యో. పు. ) సూర్యాస్త మయాన్ని చూసి పిల్లవాడు "సూర్యుడు విశ్రాంతి తీసుకోవడానికి వెళ్ళిపోయాడు" అని, తీవ్రమయిన సూర్యరశ్మిని చూసి "సూర్యుడు నిప్పుకణాలు చల్లుతున్నాడు" అని, నీటిబిందువులు అవిరయిపోవటాన్ని గమనించి "ఈ చిన్న నీటిబిందువుల్ని సూర్యుడు తాగేస్తున్నాడు" అని అంటాడు. ఈ వాక్యాలలోవలెనే పిల్లల అనుభూతినుండి వచ్చే వాక్యాలలో ఎన్నో భావచిత్రాలు కనిపిస్తుంటాయి. అందుకే పిల్లవాని ప్రపంచ దర్శనం అద్వితీయం అన్నాడు సుహోమ్లిన్స్కి.[15] కవి వస్తువుల బాహ్య దర్శనంతో తృప్తిపడక శిశువులా తత్త్వ జిజ్ఞాసను కలిగిఉంటా డని కనుక వస్తుతత్త్వ దర్శన, ప్రదర్శనలలో కవి తిరిగి బాల్యావస్థను [రెండవ బాల్యావస్థ] పొందినట్లు వ్యవహరిస్తాడు అన్నారు శ్రీమతి ఇందిరాదేవి ధనరాజ్‌గిరి.[16] సాధారణంగా శిశువులను గూర్చి కవిత్వం రాయని మహాకవి ఉండడు.

శేషేంద్ర కవిత్వంలో శిశువుల బాధలు, గాథలు అనేక సందర్భాలలో ప్రసక్తమయినాయి. దారిద్ర్య పీడితులయిన శిశువు లను గూర్చి "అనుపుల్ వాతురు నోరులేని విసుపుల్ హా ఆకలో యంచు, చలి పులివోలె దారుల పచారులు చేయుచునుండ ఊరి కావల పెనుమర్రి క్రింద నెలవంకయె దీపముగా పరున్న పసి పావల పట్ల "కాలమే విష సదృశమయి వారిని ఆకలితో నశింప చేస్తున్నదన్నాడు. వ్యక్తిని అన్నివిధాల నిర్వీర్యుణ్ణి చేస్తూ బ్రతుకుదారి చూపించలేని విద్యా విధానానికి బలి అవుతున్న

విద్యార్థులను చూసి "బాలక్రైస్తుల్లా" ఉన్నారన్నాడు. "ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకు పోతున్నాడో ఎక్కడ పసితనం కూడా బతకటానికి పని చెయ్యాలో అక్కడ నా వ్రేళ్లు నిజంగా తెగిపోయ్యాయి" అంటూ బాలకార్మికులను చూసి ఆవేదన చెందాడు. "పిల్లలు పూల మిలియన్లయ్ పొలాల్లో గంతులేసే రోజుకోసం" కలలు కన్నాడు. ఎప్పుడో ఒకప్పుడు [ఎలాగో ఒకనాడు ఆ శిశువులే ఇంధనమౌగాక.... ఇత్యాది. ఋ.మో. పు.55] ఆ శిశువులే ఇంధనమవుతారని వారి "హృదయాగ్ని పర్వత మహానిర్ఘోష రోషానల జ్వాలా జ్వాల కరాళ జిహ్వికలు తుచ్ఛంబైన ఈ లోకముం గూలంజేయును గాక" అని ఆశాభావాన్ని ప్రకటించినాడు. పిల్లలు ఆడుకునే గోలీలే రేపు బందూకులెక్కి కొత్త లోకాన్ని సృష్టిస్తాయని ఆ పిల్లలే పావన నవజీవన బృందావన నిర్మాతలవుతారన్నాడు.

"నవ తరాల పిల్లలారా యువతా పతాకలార
కదదాము రండి కాలపు తీరాలమీద బొమ్మరిళ్లు
.... .... .... .... .... .... .... .... .... ....
మబ్బులమై వాన కురిసి మడిచేలు పెంచుదాం
గగనాలకు ఇంద్రధనుసు కానుకగా ఇద్దాం
.... .... .... .... .... .... .... .... .... ...."

పిల్లలందరినీ ఆహ్వానించి వసుధమీద అందరికీ వసంతాలు పంచుదాం అంటూ వారితో తాదాత్మ్యం చెందినాడు. శ్రీ శ్రీ శైవ గీతిలో సాటిరాగల ఈ గేయం 'గొర్రిల్లా'కు భరతవాక్యంగా చేర్చబడింది. 'విహ్వల' కథా సంకలనంలోని ఐదు కథలలో విహ్వల, రంగులచేప, ఎగిరిపోయిన హంస, అనే మూడు కథలలోను పిల్లలే ప్రధాన పాత్రలు కావటం గమనింపదగినది.

కుకవినింద :-

శేషేంద్ర కవిత్వంలో కనిపించినంత కుకవినింద మరే ఆధునిక కవి కవిత్వంలోను కనిపించదు. 'చంపూవినోదిని' [1961]లోనే కేవలం వచనాన్ని నిలువుగా పేర్చి కవిత్వంగా భావించేవారిని 'గేయాసురుల'న్నాడు. శేషేంద్ర వచన కవిత్వం వ్రాయటం ప్రారంభించేనాటికి కవిత్వం రాజకీయ సిద్ధాంతాల సామాజిక రుగ్మతల వివరణగా మారింది. కవితాస్పృహను కోల్పోయింది.

స్వప్రయోజన కాంక్షతో విప్లవ భావాలను వల్లిస్తూ కవిత్వానికి విప్లవానికి హాని కలిగిస్తున్న కవులను గూర్చి "విప్లవ వీరాభినయం చేస్తే కవులు గాడిదలై పుగతారని", "ప్రజల కన్నీళ్లు పుస్తకాలుగా మార్చి అమ్ముకుతినే కవుల్ని కాసేపు మరిచిపోదాము"ని, "నీ చేతిలో పద్యం భజన వాద్యం, నా చేతిలో పద్యం గొర్రిల్లా గన్ను" అని అన్నాడు.

"వాడు ఒక కవిత్వపు కొళాయి
వాడ్ని తిప్పకున్నంతసేపే మనస్సుకు హాయి
తిప్పితే వాడు మనపాలిటి కసాయి
కవిత్వమంటే భయపడే
కలియుగంలో వాడు
కవిత్వంలో భూకంపం సృష్టిస్తానంటాడు"

[అ. భా. పు-194]

సామాజిక స్పృహ పేరుతో ప్రజల కష్టనష్టాలను సాధారణ వచనంలా రాసేవాళ్లు, కేవల శబ్దాలంకారాలతో భావ చమత్కారానికి దూరమయినవాళ్లు, నిష్పాక్షిక ధోరణి ననుసరించని విమర్శకుల వలన, సాహిత్య పరిచయం కూడ కేవలం అధికార బలంతో కవులుగా చెలామణి అవుతున్నవాళ్లు కవిత్వమంటే ప్రజలకు అసహ్యం పుట్టించినారు. వీళ్ళవలన కవిత్వం ప్రజాకర్షణకు దూరమవుతూ వచ్చింది. ప్రజలను ఆకర్షించలేని కవిత్వం సమాజ పురోభివృద్ధికి దోహదకారి కాలేదు. మరే దశాబ్దంలో రానంత కవిత్వం 1970-80 సంవత్సరాల మధ్య వచ్చింది. ఈనాటికి నిలిచిన కవిత్వం ఎంత అని పరిశీలించుకుంటే నిస్సారమయిన కవిత్వం ఎంత వచ్చిందనేది అర్థమవుతుంది. ఇలాంటి కుకవులను, అకవులను ఉద్దేశించి శేషేంద్ర కాకుల్లా కాలపు మేకులకు వ్రేలాడే కవులు అన్నాడు.

## సూచికలు :

1. టి. ఎల్. కాంతారావు : సాహిత్యంలో సంప్రదాయం, ప్రగతి. పు-108.
2. మార్క్సిజం - సాహిత్యం [వ్యా] : సృజన మాసపత్రిక. సెప్టె. 1979.

విద్యార్థులను చూసి "బాలక్లైస్తుల్లా" ఉన్నారన్నాడు. "ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకు పోతున్నాడో ఎక్కడ పసితనం కూడా బతకటానికి పని చెయ్యాలో అక్కడ నా కాళ్లు నిజంగా తెగిపోయ్యాయి" అంటూ బాలకార్మికులను చూసి ఆవేదన చెందాడు. "పిల్లలు పూల మిరియప్లయ్ పొలాల్లో గంతులేసే రోజుకోసం" కలలు కన్నాడు. ఎప్పుడో ఒకప్పుడు [ఎలాగో ఒకనాడు ఆ శిశువులే ఇంధనమౌగాక.... ఇత్యాది. ఋ.ఘో. పు.55] ఆ శిశువులే ఇంధనమవుతారని వారి "హృదయాగ్ని పర్వత మహానిర్ఘోష రోషానల జ్వాలా జ్వాల కరాళ జిహ్వికలు తుచ్ఛంబైన ఈ లోకమును గూలంజేయును గాక" అని ఆశాభావాన్ని ప్రకటించినాడు. పిల్లలు ఆడుకునే గోలీలే రేపు బందూకులెక్కి కొత్త లోకాన్ని సృష్టిస్తాయని ఆ పిల్లలే పావన నవజీవన బృందావన నిర్మాతలవుతారన్నాడు.

"నవ తరాల పిల్లలారా యువతా పతాకలార
కడదాము రండి కాలపు తీరాలమీద బొమ్మరిళ్లు
.... .... .... .... .... .... .... .... .... ....
మబ్బులమై వాన కురిసి మడిచేలు పెంచుదాం
గగనాలకు ఇంద్రధనుసు కానుకగా ఇద్దాం
.... .... .... .... .... .... .... .... .... ...."

పిల్లలందరినీ ఆహ్వానించి వసుధమీద అందరికీ వసంతాలు పంచుదాం అంటూ వారితో తాదాత్మ్యం చెందినాడు. శ్రీ శ్రీ శైశవ గీతిలో సాటిరాగల ఈ గేయం 'గొర్రిల్లా'కు భరతవాక్యంగా చేర్చబడింది. 'విహ్వాల' కథా సంకలనంలోని ఐదు కథలలో విహ్వాల, రంగులచేప, ఎగిరిపోయిన హంస, అనే మూడు కథల లోను పిల్లలే ప్రధాన పాత్రలు కావటం గమనింపదగినది.

కుకవినింద :-

శేషేంద్ర కవిత్వంలో కనిపించినంత కుకవినింద మరే ఆధునిక కవి కవిత్వంలోను కనిపించదు. 'చంపూవినోదిని' [1961]లోనే కేవలం వచనాన్ని నిలువుగా పేర్చి కవిత్వంగా భావించేవారిని 'గేయాసురుల'న్నాడు. శేషేంద్ర వచన కవిత్వం వ్రాయటం ప్రారంభించేనాటికి కవిత్వం రాజకీయ సిద్ధాంతాల సామాజిక రుగ్మతల వివరణగా మారింది. కవితాస్పృహను కోల్పోయింది.

స్వప్రయోజన కాంక్షతో విప్లవ భావాలను వల్లిస్తూ కవిత్వానికి విప్లవానికి హాని కలిగిస్తున్న కవులను గూర్చి "విప్లవ వీరాభినయం చేస్తే కవులు గాడిదలై పుగతారని", "ప్రజల కన్నీళ్లు పుస్తకాలుగా మార్చి అమ్ముకుతినే కవుల్ని కాసేపు మరిచి పోదాము"ని, "నీ చేతిలో పద్యం భజన వాద్యం, నా చేతిలో పద్యం గొర్రిల్లా గర్జ" అని అన్నాడు.

"వాడు ఒక కవిత్వపు కొళాయి
వాడ్ని తిప్పుకున్నంతసేపే మనస్సుకు హాయి
తిప్పితే వాడు మనపాలిటి కసాయి
కవిత్వమంటే భయపడే
కలియుగంలో వాడు
కవిత్వంలో భూకంపం సృష్టిస్తానంటాడు"

[ఆ. భా. పు-194]

సామాజిక స్పృహ పేరుతో ప్రజల కష్టనష్టాలను సాధారణ వచనంలా రాసేవాళ్లు, కేవల శబ్దాలంకారాలతో భావ చమత్కారానికి దూరమయినవాళ్లు, నిష్పాక్షిక ధోరణి ననుసరించని విమర్శకుల వలన, సాహిత్య పరిచయం కూడ కేవలం అధికార బలంతో కవులుగా చెలామణి అవుతున్నవాళ్లు కవిత్వమంటే ప్రజలకు అసహ్యం పుట్టించినారు. వీళ్ళవలన కవిత్వం ప్రజాకర్షణకు దూరమవుతూ వచ్చింది. ప్రజలను ఆకర్షించలేని కవిత్వం సమాజ పురోభివృద్ధికి దోహదకారి కాలేదు. మరే దశాబ్దంలో రానంత కవిత్వం 1970-80 సంవత్సరాల మధ్య వచ్చింది. ఈనాటికి నిలిచిన కవిత్వం ఎంత అని పరిశీలించుకుంటే నిస్సారమయిన కవిత్వం ఎంత వచ్చిందనేది అర్థమవుతుంది. ఇలాంటి కుకవులను, అకవులను ఉద్దేశించి శేషేంద్ర కాకుల్లా కాలపు మేకులకు వ్రేలాడే కవులు అన్నాడు.

సూచికలు :

1. టి. ఎల్. కాంతారావు : సాహిత్యంలో సంప్రదాయం, ప్రగతి. పు-108.
2. మార్క్సిజం - సాహిత్యం [వ్యా] : సృజన మాసపత్రిక. సెప్టె. 1979.

# క ల గూ ర గ ం ప

## విశ్వనాథ పంచశతి – సమీక్ష

'జ్ఞానపీఠము' అవార్డును పొందిన కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ఆధునికాంధ్ర కవుల్లో అగ్రగణ్యుడు. విశ్వనాథ సత్యనారాయణ రాసిన ఖండకావ్యాల్లో 'విశ్వనాథ పంచశతి' ఒకటి. విశితమైన పరిశీలనా దృష్టితో, వ్యంగ్య ధోరణిలో అయిదు వందల పద్యాల్ని రచించి పంచశతిగా విశ్వనాథవారు 1953లో ప్రకటించారు. ఇది విశ్వనాథవారి లోకజ్ఞతకూ, సమకాలిక సంస్కృతికీ, నాగరికతకూ, మానవుల విభిన్న మనస్తత్వాలకు అద్దం వంటిదని చెప్పవచ్చును.

పంచశతియందు విశ్వనాథవారు సాంఘిక వ్యవస్థలోని చిత్రవిచిత్రాల్ని, దాంపత్య జీవితంలోని రమణీయ సన్నివేశాల్ని, స్త్రీ పురుషుల చిత్తవృత్తుల్ని అధిక్షేప, హేళన, హాస్య, వ్యంగ్య ధోరణుల్లో వ్యక్తీకరించారు.

ఈ పద్యాల్ని వ్రాసేప్పుడు, ఎవర్నీ ప్రత్యేకంగా దృష్టిలో పెట్టుకొని వారిపట్ల ద్వేషాభిమానాల్ని వహించలేదనీ, మానవ మనస్తత్వాన్నీ, విభిన్న పరిస్థితుల్ని చమత్కారపూర్వకంగా చిత్రించడమే ధ్యేయమని విశ్వనాథవారు స్పష్టపరిచారు.

గృహ జీవితానికి, సంసారానికి సంబంధించిన దైనందిన సమస్యల చిత్రణం యీ ముక్తకాలల్లో అధికంగా కనిపిస్తుంది.

అత్తవారింటినుండి భార్యను వెంబడించుకొచ్చిన భర్త మనస్తత్వం, రైలుస్టేషన్లో వేచివున్న దంపతుల చూపుల్లోని ప్రణయ భావాలూ, అలకల అల్లలూ, వ్రతపు పీట్లపై కూర్చున్న ధర్మపత్ని భర్త శరీర స్పర్శతో సాత్విక భావోదయాన్ని పొందడం, అప్పుడప్పుడే పెండ్లాడిన సామాన్య ఉద్యోగి తన తల్లిని పొరిగింటి స్త్రీలతో శ్రీశైలయాత్రకు పంపడం, పుట్టింటికి పంపని కారణాన కోపంతో కూరలో అర్ధమణుగు కారపొడి వేసి ఇల్లాలు తన కోపాన్ని వ్యక్తపరచడం, భర్తను చేరేదానికి భార్య చేసిన ప్రయత్నం పైట కదిలినంతనే ఉలిక్కిపడి లేచిన శిశువువల్ల భగ్నమైన విధం, పుట్టింటికి వెళ్ళిన భార్య చిరకాలానికి వస్తుందనే వార్త వచ్చినపుడు భర్త రైల్వేస్టేషనుకు వెళ్ళి ఆడవాళ్ళ పెట్టెపై దృష్టి నిలపడం, పండిత పుత్రుడైన భర్తను అమాయకురాలైన భార్య పండితుడిగ భ్రమించడం, గృహకార్యభారాన మధ్యాహ్న సమయంలో ఉసరుసలాడిన గృహిణి రాత్రి సమయాన జాబిల్లివలె ప్రసన్నమవడం అనే అనుకూల దాంపత్యానికి సంబంధించిన విషయాల్ని విశ్వనాథవారు పంచశతిలో వ్యక్తపరిచారు.

గృహిణి నెలల పసివానిని అందిస్తూ సాత్విక భావాల్ని వ్యక్తీకరించడం, పెండ్లిపీట్లపై కూర్చునివున్న నవవధువు, జిలుగు కంఠంతో ఆశీర్వదించే కవి కుమారుణ్ణి ఓరకంట చూడడాన్ని, "పెండ్లి పీటలపయిననే పెద్ద పదవినున్న నవభర్తతో గూరుచుండి పడతి జిలుగు కంఠంబుతో నాశీర్వదించు కవి కుమారుతో జూపులు కలిపినంత"– అనే పద్యంలో వర్ణించిన విధం,

తన భర్త ఉద్యోగానికి ప్రమాద మేర్పడినపుడు గృహిణి ఇల్లు కదలి వెళ్ళడాన్ని "అతని ఉద్యోగమున కెప్పుడైన సుంత, యొడిదుడుకు వచ్చెనే నిలువెదలుగాని, అతని భార్య లేకున్న శుద్ధాంతవాసి, సంత తీవ్రత పెఱసతులందు లేదు"– అనే పద్యంలో చెప్పిన విధం,

భర్త రైల్వే ఉద్యోగంలో రాత్రివేళ రాని స్థితిలో ఒంటరిగా భయమని, దృఢకాయుడైన వ్యక్తిని తనయింట రాత్రి గడిపి వెళ్ళమనడాన్ని "మావారికి రైల్వేలో నే వెసిక లేదు రాతిరెల్లను పనియే, మావాడ దొంగభయమును, నీవో బలశాలి వుండి నీకేరదో"– అనే పద్యంలో వ్రాసిన విధం,

పెండ్లైనా పాత చుట్టరికాన్ని వదలక పరపురుషుల్తో సుఖించడం, గృహస్థుడు పనిమనిషిని కామించడం,

భార్య లేని సమయాన కూరగాయలమ్మేందుకు వచ్చిన జారిణితో సుఖించడాన్ని, "అతని భార్య పుట్టింటికి నరిగె వాడు వంట చేసుకొనుచుండె దానొంటరిగను, అంతసేపున్నదే 'కూరలమ్మి' లోన, నెన్ని కూరలు కొన్నాడో యేమో కాని" అనే పద్యంలో వివరించిన విధం గమనించదగింది.

పంచశతిలో వుండే కొన్ని వర్ణనలు గాథాసప్తశతిలోని కులటల్ని, జారపురుషుల్ని స్మరింపజేస్తున్నాయి.

అధికారులు తన కార్యాలయంలో పనిచేసే గుమాస్తా భార్యకు చీరలంపడాన్ని, ఉద్యోగాన్ని ఆశించి వచ్చిన

యువతుల్ని భాశీల్ని తెలుసుకొని చెప్తానని ఇంటికి రప్పించుకోవడాన్ని, "కలవో లేవో అసలు భాశీలు మరి, తీరికయును లేదయిపుడు కాగితములు చూతు రాతిరికిని సుందరి, రమ్ము రాతిరికి గంట లెన్మిదింటికైన" అనే పద్యంలో విశ్వనాథవారు వివరించిన విధం,

డాక్టరు వృత్తిధర్మాన్ని గంగలో కలిపి క్లోరోఫారంలో వున్న సుందరి అంగ సంస్పర్శ సుఖాన్ననుభవించడం, స్త్రీలను కామించి వారిని పొందేందుకు ప్రయత్నించడం అనేవి - వివిధ పదవుల్లో వున్న పురుషుల చిత్తవృత్తిని, కామప్రవృత్తిని విమర్శించేవిధంగా వుంది.

పంచశతిలో భార్యాభర్తల, దాసీపురదంద్ర పరిహాసాలు కొన్ని రమణీయంగా వర్ణింపబడ్డాయి. ఇంటినుండి బయటకు వెళ్ళేప్పుడు మాత్రమే మంచి చీరల్ని కట్టి అలంకరించుకొనిపోయే సుందరాంగుల్ని భర్తలు మందలించడం, పుట్టింట్లో వున్నప్పుడు తల్లిని వదలవద్దని హెచ్చరించడం,

తన బావ చీర కట్టితే జఘన సౌభాగ్యం దర్శనీయమని మరదలు, "ఆడవారి పిఱుదులరసి యూరక యిట్లు భ్రమసిపోదు గాని బావ నీవు, నీవు చీరకాల్ప నీ పిఱుదుల సోకు నరసి జనములెంత మురియగలరో" అని పరిహసించడం,

డార్విన్ పరిణామ సిద్ధాంతానికి బావగారి ఆంజనేయ విగ్రహం ప్రతీకయని గేలి చేయడం - మొదలైనవి హాస్యాస్పదాలు.

మన్మథుణ్ణి గూర్చి విశ్వనాథవారి అభిప్రాయాలు పంచశతిలో కొన్ని క్రిందివిధంగా వున్నాయి. విశ్వనాథ దృష్టిలో మన్మథుడు 'మిలిటరీ డిక్టేటరు. పూర్వపు మన్మథుడికి ఆయుధం చిగురాకు బాకు. కానీ నేటి మన్మథుడు జంట ఫిరంగులవాడనీ, అతణ్ణి మించిన కాస్మోపాలిటన్ మరొకడు లేడనీ, జాతి మత కుల వర్ణాల తారతమ్యంగాని, వయోభేదాల్నిగాని పాటించనివాడనీ, నల్లని భార్యను ఇష్టపడని భర్తకు ఏదో ఒక మంత్రమూది ఆమెకు దాసానుదాసునిగ చేసే మహామాంత్రికుడనీ, వావి వరసలు లేని పెండ్లిండ్లు చేయించేవాడనీ, ఆంబోతువద్ద ఆవును కట్టివేయు, గుమ్మంవద్ద నిలుచున్న స్త్రీని కదలనియ్యనివాడనీ, జాతి భేదం లేక మలయానిల ప్రేరితమైన ఆడసింహాన్ని దుప్పితో అదిగమింపజేసేవాడనీ విశ్వనాథ మన్మథుని గూర్చి వ్యంగ్యంగ తన అభిప్రాయాల్ని వ్యక్తపరిచాడు.

విష్ణువు కుమారులల్లో చిన్నవాడైన మన్మథుడే మహాభాగ్యవంతుడనీ, అగ్రజుడైన బ్రహ్మకు ఒక్క ఆలయం గూడ లేదనీ, కాని మన్మథాలయాలు కోటానుకోట్లనీ, "ఆ రోడ్డుపై స్త్రీ పురుషులు జారత చోరతము జేసి సంపాదింపన్"- అను పద్యంలో జారచోర రతినిగూర్చి చెప్పిన విధం వ్యంగ్యంగా, అధిక్షేప ప్రధానంగా వుంది.

పూర్వ ఆచారాలపై విశ్వాసాన్ని కోల్పోయిన ఆధునిక విద్యావంతుల ముర్ఖత్వాన్ని విశ్వనాథవారు విమర్శించారు. "తెలుగుదేశాన యువకులు త్రిదశులైరి, మొట్టమొదట శాస్త్ర పురాణముల నిరసన, పైన నేపుడు లేకన్న పట్టుదలయు, పూటిగా తిట్టచివరకు నోషరిజము"- అనే పద్యంలోను, "మతము లేదంచురే కాని మహితమతులు, గాంధి యస్థికల్ నదులలో గలుపుటంతో"- అనే పద్యంలోను విశ్వనాథవారు విమర్శించారు.

పరదేశాభిమానాన్ని నిరసిస్తూ, స్వదేశాభిమానం గల్గి ఉండాలని, "భార్యయందున శాంతితో బడయు సుఖము, కామదహనాగ్నిగను జారకాంతయందు, పరమశాంతికి స్వదేశ భావముల యందు నలవి జాతీయములతోడఁ గలక బ్రదుకు"- అనే పద్యంలో తెల్పారు.

పాశ్చాత్య వ్యామోహాన స్త్రీ పురుషులిద్దరు భ్రష్టులైనారని విశ్వనాథవారు, "తండ్రి! చదువులకై పరస్థలము దూరమరుగుచుంటివి! యిదిగాని మరచిపోకు, పేర్మి బ్రాణముల్ నీపైన బెట్టికొంటి, మేను ముసలిని నీభార్య తేనెవాక" అనే పద్యంలోనూ, "జనులు పరభాష చదివిన విని గమకము లేని యూహ వీధుల ఏంటం, జను వారివాద వైభవ మనలముచే బ్రేమదీప్తమగు సన్నట్టుల్" అనే పద్యంలోను హేళన చేశారు.

పురుషుల్తోబాటు స్త్రీలు ఆంగ్లవిద్యల్ని అభ్యసించి సరికొత్త సమస్యల్ని సృష్టించారనీ, మెట్రిక్ పాసైన కన్య కలెక్టర్నే వివాహమాడ్డానికి పట్టుపట్టితే, బి.ఎ., ఎం.ఎ, పాసైన విద్యార్థులకి ఇంకను ఉన్నతోద్యోగా లివ్వవలసి వస్తుందని కవి చమత్కారపూర్వకంగా విమర్శించారు.

పాశ్చాత్య నాగరికతా వ్యామోహమగ్నమైన సాంఘిక వ్యవస్థను విశ్వనాథ నగ్నంగా చిత్రించి, సంఘంలో ఏర్పడిన మార్పుల్ని విమర్శించారు.

ఆంగ్ల విద్యలకూ, కోర్టు వ్యవహారాలకూ ఎందరి ఆస్తులో కర్పూరంవలె హరించుకొని పోయాయనీ, ఉద్యోగాల్లో బ్రాహ్మణ, బ్రాహ్మణేతర వర్గాలను తారతమ్యాలెంచడం పరి

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited**



పాకైందనీ, ఉద్యోగానికి దరఖాస్తు ఫీజు మొదలు లంచం వరకు వేలు గుమ్మరించడం, చీకటి బజారు వ్యాపారం దినదినాభివృద్ధి నొందడం, డాక్టర్లు పరీక్ష ఫీజులనీ, మందుల ఖర్చులనీ రోగుల్ని పీల్చి పిప్పి చేయడం అనే మొదలైన అంశాల్ని కవి అధిక్షేపించారు.

క్రైస్తవమత వ్యాప్తి పేర, అంగనల్ని మిషనరీల పేరుతో వివిధ ప్రాంతాలకు పంపే విధానాన్ని, పరుల నాశ్రయించి, లంచాలిచ్చి, స్త్రీలకు కానుకలిచ్చి ఉద్యోగాలు సంపాదించే మానవుని నైతిక పతనావస్థనూ కవి విమర్శించెను.

పరుల కొంపలార్చి తిరుపతికి పోయేవారినీ, దుష్కార్యాలు చేసి సహస్ర గాయత్రి చేసేవారినీ, లంచాలు మేసి సప్తాహాలు చేసి మేడలు కట్టేవారిని విశ్వనాథ అధిక్షేపించెను.

విశ్వనాథ కవుల్ని విమర్శించిన తీరు పరిశీలింపదగింది. సామాన్య కవులకు కీర్తి కండూతి అధికమైందనీ, చిల్లర గ్రంథాలు వ్రాసి క్షణంలో కీర్తి సంపాదిస్తున్నారనీ, కవిగా చెలామణి కానివారు సినిమా రంగానికి పరుగెత్తి వేలకొద్ది ఆర్జించి విర్రవీగుచున్నారనీ, ఆస్థానకవులకు పట్టపగ్గాలు లేవనీ, వారికి అహంకారం అధికమనీ, కవులతోబాటు విమర్శకుల స్థాయిగూడ తగ్గిందనీ, గుణదోష విచారంపట్ల వారికి విచక్షణా జ్ఞానం శూన్యమనీ, ఆంధ్ర భాషాభిమానం లేనివారు భాషాబోధకులనీ, భాషా జ్ఞానం లేనివారు పరీక్షాధికారులనీ, క్రైస్తవ మిషనరీలవారు తెలుగు భాషాసొగసును మంటగలిపినారనీ విశ్వనాథ వివరించారు.

విశ్వనాథవారి చమత్కారానికి క్రిందిపద్యాన్ని చూడవచ్చు.

"తిండి లేనట్టివారికి దిండియిడదు,
తిండిగల వారిదగ్గర దీయు బన్ను
ఉర్విపతికంటె దంతవైద్యుండు నయము
పన్ను కట్టును లేనట్టి వాడు చనిన"

విశ్వనాథవారు ఇందు అతి సామాన్యమైన దృశ్యాల్ని గూడ ఏదో ఒక సందర్భంలో వర్ణించారు. పేడచేసే స్త్రీని, వేడి వేడి వడ్డనాన్ని చూసి సంధ్యావందనాన్ని పంజాబు మెయిల్‌వలె తొందరగ పరుగులెత్తించే యజమాన్ని, గొర్రెబొచ్చువంటి రోమాలు గల వైష్ణవుణ్ణి, కందిగింజలాంటి కళ్లుండే తొండని, నూటయిరవై నెంబరు చీరని గూడ విశ్వనాథవారు వర్ణించి తన లోకజ్ఞతను వ్యక్తం చేశారనవచ్చు.

విశ్వనాథవారి 'విశ్వనాథ పంచశతి'లోని అన్ని పద్యాల్లో విమర్శనం, హేళనం, అధిక్షేపం అనే గుణాలు సూచ్యప్రాయంగానైనా గోచరిస్తాయని చెప్పవచ్చు. పంచశతిలోని పద్యాలు, 'కొన్ని కేవలం వర్ణనాత్మకాలనీ, మరికొన్ని వ్యంగ్య చమత్కృతి పూర్ణాలనీ, మరికొన్ని రమణీయ వాచ్యధోరణిలో సాగినాయ'నీ విశ్వనాథవారే స్వయంగా వివరించారు. విశ్వనాథవారి 'పంచశతి' అధిక్షేప కావ్యంగా గుర్తించవచ్చు.

**డా॥ ఎ. పద్మబాల**

# "వీర శైవ" పద చర్చ

"భారతి" (ఆగస్టు 1989)లో "వీరభక్తి" అనే వ్యాసం చదివి, "వీరశైవ" పదాన్ని నిర్వచించే కొన్ని శ్లోకాలిస్తున్నాను.

1. శ్రీకర భాష్యము :

విశబ్దే నోచ్యతే శంభుః ద్వాసుపర్ణేతి మంత్రతః
శేష శబ్దేన శారీరో యథాగ్నేరితి మంత్రతః
అద్వైతేన భవేత్ యోగో యథాన ద్యాదిభి స్తథా.

2. సిద్ధాంత శిఖామణి :

విశబ్దే నోచ్యతే విద్యా శివజీవైక్య బోధికా
తస్యాం రమంతయే శైవా వీరశైవా స్తుతేమతాః

వేదాంత జన్యం య జ్ఞానం విద్యేతి పరికీర్తితా
విద్యయా రమతే యః సవీర ఇత్యభి ధీయతే

విద్యాయాం శివరూపాయా రమతే యే విశేషతః
తస్మాదేతే మహాభాగా వీరశైవా ఇతిస్మృతాః

విద్యాయా రమతే యస్మాన్ మాయాం హేయాం శ్రవద్రహేత్
అనేనైవ నిరుక్తేన వీరమాహేశ్వరాః స్మృతాః

జ్ఞాన గమ్యం రహస్యంచ కైవల్య పదకారణం
వీరశైవ మితిజ్ఞేయం ఏతల్లక్షణముచ్యతే

3. ఉత్తర వాతూల ఆగమము :

శవేన సహసంబంధ శైవమిత్యావృతం బుధైః
ఉభయోస్సంస్ఫుటీ భావాత్ వీరశైవ మితిస్మృతం

విశబ్దోత్ర వికల్పార్థో ర శబ్దో రహితార్థకః
వికల్ప రహితం శైవం వీరశైవ మితిస్మృతం

4. క్రియాసారము

> విశబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్య బోధినీ
> తస్యాం రమంతే యే శైవా వీరశైవాః ప్రకీర్తితాః
>
> వి శబ్దోవా వికల్పార్థః ర శబ్దో రహితార్థకః
> వికల్ప రహితం శైవం వీరశైవం ప్రచక్షతే
>
> విరోధార్థో విశబ్దస్స్యాత్ రశబ్దో రహితార్థక
> విరోధం రహితం శైవం వీరశైవం విదుర్బుధాః

5. శంకర సంహిత :

> యో హస్త పీఠే నిజలింగ మిష్టం
> విన్యస్య తల్లీన మనః ప్రచారః
>
> బాహ్యక్రియా సంకుల నిస్పృహాత్మా
> సం పూజయత్యంగ స వీరశైవం

పై శ్లోకాల వలన

- శివజీవైక్యమనే విద్యతో రమించువాడు వీరశైవుడు
- వికల్పార్థ రహితమైంది వీరశైవం.
- విరోధ రహితమైంది వీరశైవం.
- హస్తపీఠమున ఇష్ట నిజలింగమునుంచుకొని, బాహ్య క్రియలలో నిస్పృహతో పూజించుట వీరశైవం.

అని తెలియుచున్నది. తామసభక్తిని, సాత్వికభక్తిగా మార్చేందుకే పై శ్లోకాలు వ్రాసివుంటారు.

మల్లికార్జున పండితారాధ్యులు "శివతత్వసారము"లో "వీరభక్తి"ని ప్రతిపాదించినారు. శివునకు కూడా భయం గొల్పే పనులు శివభక్తులు చేస్తే వారిది "వీరభక్తి" అవుతుంది. రావణుడు సామవేదం పాడుతూ తన తలను నరికికొని ఈశ్వరునికి పూజాపుష్పంగా సమర్పించినాడు. మరికొందరు శివభక్తులు తమ తలను ఒక్కసారి కాదు కదా అనేకసార్లు తరిగికొని శివునకు నైవేద్యంగా పెట్టినారు. శివానుచరులైన ప్రమథులను వీరభద్రుని అనుచరులను పరిగణిస్తే వీర, భయానక, రౌద్రరసాలు కల భక్తి వీరభక్తి అనీ ఆ భక్తి కలవారు వీరభక్తులనీ చెప్పవచ్చును.

"వీరశైవ" పదం పాల్కురికి సోమనాథునినుండి వచ్చింది. అతని పూర్వులైన కన్నడ కవులు "వీరశైవ" పదాన్ని వాడలేదు. బసవేశ్వరుని "వచన"ములలో ఈ పదం కనబడదు. వారిని వీరమాహేశ్వరులు, శరణులు, శీలావంతులు అనే పేర్లతో పిలిచేవారు.

భక్తి, సాత్త్విక, రాజస, తామస రూపాల్లో ఉంటుంది. పామరుల తామస భక్తిలో "వీర"రసం ఉంటుంది.

"క్రీడాభిరామం" అనే వీథి నాటకంలో "మైలారదేవర వీరభటులు" అనే శివభక్తుల చర్యలను గమనింపుడు.

> సీ. అవ అవ ముందు నెల్లని చంద్రమల్లెల
> చోద్యంపు గుండాలు చొచ్చువారు
> కరవాడి యలుగుల గనప పాతర్లలో
> నుట్టి చేరులు గోసి యొలుచువాడు
> గాలంపు గొంకిగ గంకాళచర్మము గ్రుచ్చి
> యుడు వీథి నుయ్యేల లూగువారు
> కటికి హొన్నాళంబు గండ గత్తెర పట్టి
> మిసిమింతులను గాక మ్రింగువారు
>
> సందులను నారసంబులు సలుపువారు
> యెడమ కుడి చేత నారతులిచ్చువారు
> సాహసము మూర్తి గైకొన్న సరణి వారు
> ధీర హృదయులు మైలార వీరభటులు
>
> గీ. వీరు మైలార దేవర వీరభటులు
> గొండ్లి యాడించుచున్నారు.

మైలారదేవ వీరభటులు. సాహసము మూర్తిగా ఉన్నవారు అగ్నిగుండం త్రొక్కుతారు. పాతర్లలోకి ఉరుకుతారు. చర్మానికి కొక్కెం తగిలించుకొని ఆకాశంలో వూగుతారు. కత్తెరను మ్రింగుతారు. బాణాలతో గ్రుచ్చుకొంటారు. ఆరతులిస్తారు. "గొండ్లి" అనే నృత్యవిశేషం ఆడిస్తారు. వీరిది వీరభక్తే.

టర్కీ దేశంలో సూఫీ తత్వావలంబకులు "దర్వీషు"లనే భిక్షగాండ్లున్నారు. వీరు పెద్దగా కేకలువేస్తూ అల్లా కీర్తన చేయుచు అగ్నిగుండాలు త్రొక్కుతారు, కత్తులతో పొడుచుకొంటారు. వీరికి అద్భుత మహిమలు కలవని జనులు నమ్ముతారు. వీరికి "అరచే దర్వీషు"లని పేరు. ఈ రకం దర్వీషులు మన మైలారదేవ వీరభటులను పోలుతారు. ఇంకొక రకం

"దర్వీషు" లున్నారు. నీలంరంగు ఉన్ని గౌను, కోణాకారం టోపీ పెట్టుకొని అల్లామీద పాటలు పాడుతూ కుడికాలిమీద గిర గిరా తిరుగుతూ, పిల్లనగ్రోవి, డమరుకాలూ వాయిస్తూ (మన మైలార వీరభటులు "మంద్ర మధ్యతార మానత్రయా భిన్న, మహిష శృంగనాద లహరిం గూడి, డమరు డిండిమంబు డమ డమ ధ్వని" మ్రోయిస్తారు) నృత్యం చేస్తారు. వీరికి "పాడే దర్వీషు"లవి పేరు. కర్నూలు (నెరవాడ్, శ్రీశైలం), అనంతపుర ప్రాంతాలలో వుండే "గొరవయ్య"లనే శివభక్తులు (వీరి వృత్తి భిక్షాటనమే) ఉన్ని గౌను, ఉన్ని టోపీ పెట్టుకొని, నలుగురు గుండ్రంగా తిరుగుతూ పిల్లనగ్రోవి ఊదుతూ, డమరుకం వాయిస్తూ "మల్లయ్యా" (శ్రీశైల మల్లికార్జునుడు) అని పాడుచూ నృత్యం చేస్తారు. వీరూ అగ్నిగుండం త్రొక్కే సాహసాలు చేస్తారు. గొరవయ్యలు, "పాడే దర్వీషు"లను పోలుతారు. గొరవయ్యలపై సామాన్యజనంలో గౌరవం హెచ్చు.

"త్రి"

# లేఖలు

## విజ్ఞప్తి

ఆంధ్రభాషకు మాత్రమే పరిమితమైన అవధాన ప్రక్రియ ఒకప్పుడు ఉజ్జ్వలస్థితిలో ఉండింది. ముఖ్యంగా తిరుపతి వేంకటకవుల కాలం అవధాన సాహిత్య చరిత్రాలు మరపురాని స్వర్ణయుగము.

నేడు కూడ పలువురు తమ ప్రతిభా విశేషంతో ఈ అవధాన ప్రక్రియను నిర్వహించి రసజ్ఞులను అలరిస్తూనే ఉన్నారు. ఐనా, అవధాన ప్రక్రియకు తగిన ప్రోత్సాహము ఆదరణ కొరవడుతున్నవనే చెప్పవచ్చు. అందుకే అవధాన ప్రక్రియను బహుజనాదరణీయంగా మార్చేందుకు నిత్యసాధనతో శ్రమించి "పంచాశత గుణిత దశావధాన" విధానమొకటి నేను సాధించగలిగాను. పదిమంది పృచ్ఛకులు కల్గిన ఏబది అవధానాలు ఏకకాలంలో నిర్వహింపబడటం ఇందులో విశేషము. ఈ కార్యక్రమానికి వారం రోజులు పట్టగలదు. ప్రతిరోజు సుమారు నాలుగైదు గంటలు కార్యక్రమ నిర్వహణ జరుగుతుంది. ఈ రకంగా పంచశత గుణిత దశావధాన మొక చక్కని సాహితీ సప్తాహంగా భాసింపగలదు.

'భారతి' పత్రికాముఖంగా ఆంధ్ర భాషాభిమానులకూ, సాహితీ సంసేవనంలో పురోగమిస్తున్న సాహిత్య సంస్థలకూ, తదితర స్వచ్ఛంద సంస్థలకూ ఒక విజ్ఞప్తి చేస్తూ ఈ లేఖ ముగిస్తాను. కొడిగడుతున్న అవధాన సాహితీజ్యోతిని పునః ప్రజ్వలితం చేయటానికి ఉద్యమించిన నా ఈ బృహత్ప్రయత్నాన్ని మన్నించి ప్రోత్సహిస్తూ కార్యక్రమ నిర్వహణలో సహకరించవలసిందిగా ఆంధ్ర రసజ్ఞ మండలిని అభ్యర్థిస్తున్నాను. ఆసక్తి గలవారు సంప్రదించగలరు.

ఇట్లు

గడియారం శేషఫణిశర్మ
ఇంటి నెం. బిఇ 86, బి. కాలని
పాల్వంచ - 507 115, ఖమ్మం జిల్లా.

## లేఖ!

ఆగస్టు 1989 భారతిలో (పేజీ-60) ద్వాదశాదిత్యుడు శీర్షికన రెండవ పేరాలో "మార్తాండుడంటే మృత అండము నుంచి పుట్టినవాడు అని" శ్రీ భాగవతుల ఉమామహేశ్వర శర్మ గారు తమ లేఖలో పేర్కొన్నారు. మొదటి పేరాలో పేర్కొన్నట్లు ఇది వారి "ఊహ" కావచ్చును. కాని ఒక పదము యొక్క వ్యుత్పత్తిని అర్థమును ఊహించుట పొరబాటు.

మార్తాండః శబ్దముయొక్క వ్యుత్పత్తి, అర్థమును "అమర కోశము" ఈ క్రింది విధముగా ప్రతిపాదించుచున్నది.

(1) మృతండ స్యాపత్యాం మార్తాండః అంటే మృతండుడనువాని కొడుకు (2) మృతం బ్రహ్మాండం జీవయతీతి మార్తాండః అనగా నశించిన బ్రహ్మాండమును బ్రతికించువాడు అని అర్థము. కావున వారి "ఊహ"కు ఆధారమైన నిర్వచనమే తప్పుగా తోచుచున్నది.

జి. వి. ఆర్. చంద్రమౌళి
నేలకొండపల్లి - 507 160

# గ్రంథ విమర్శలు

## నేను నేనే! (కవితా సంకలనం)

[నేను నేనే!; రచన : డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు, ప్రతులకు: శ్రీమతి కెంచం వసంత, 5-14-5, 2/13 బ్రాడీపేట, గుంటూరు. వెల: రూ. 7/-]

"కళ కళ కోసమే" అంటుంది ఒక వర్గం
"కళ సమాజం కోసం" అంటుంది మరో వర్గం

నిజానికి ఈ రెండు వర్గాల వాదన సవ్యంగానే. కళ కళగా జీవించాలంటే, అది జన జీవితాన్ని ప్రభావితం చేయాలి. సమాజాన్ని స్పందింపచేయాలి. ఆనందింపచేయాలి. శబ్దశక్తి, పదవిన్యాసం - రెండూ కవితను ఉన్నతం చేస్తాయి. కానీ వస్తు ప్రాధాన్యత దాని ఔన్నత్యాన్ని రెట్టింపు చేస్తోంది. కాబట్టే ఆ వస్తువు సామాజిక స్పృహ కలిగిఉండాలి. భాష, భావం రెండూ అన్యోన్యాశ్రయాలు. ఈ రెండూ జోడు గుర్రాల్లా సమగతిలో తుల్యవేగంతో పరుగెత్తిన కవితారథం - 'నేను నేనే!'

సృజన - తెలుగు సాహితీ సమితి (కలటూరు)వారు ప్రచురించిన ఈ సంపుటి నేటి కవిత్వపు తరహానుంచి కొంత దూరంగా సాగుతూ విశ్వనాథ, వేదుల, కృష్ణశాస్త్రుల మార్గాలను మరికొంత ముందుకు పొడిగిస్తుంది. దీనిలో ఇతాల ప్రమేయంకన్నా నిజాల వెలికితీత ప్రధానంగా కనిపిస్తుంది. సత్యం ఎప్పుడూ సూటిగా సంగ్రహంగానే ఉంటుంది. నన్నయ్యగారు 'మితవి సత్య వాక్య!' అన్నారు.

"నిప్పులాంటిదని తెలిసీ
నీట ముంచబోతే
బుస బుసమని పొంగుతూ
వేడి ఆవిరులు కక్కేది....
ఒక్క నిజం మాత్రమే!"

అని నిజంయొక్క వాస్తవ స్వరూపాన్ని, నిత్య చైతన్య గుణాన్ని కవి వివరిస్తున్నాడు.

ఈ సంపుటిలోని కవితాతత్వాన్ని ఇలా వర్గీకరించుకోవచ్చు. సంప్రదాయం-నవ్యత, నిజానిజాల ప్రతీకలు, ఆత్మాశ్రయ రీతులు.

సంప్రదాయమంటే శిలా సంప్రదాయం కాదు, క్రొత్త చిగుళ్ళు తొడుగుతున్న పాత మ్రానే. ఇది తెరచాటు సంప్రదాయం కాదు, నిరంతర పరిశోధనా మధనం, సునిశిత పరిశీలనావాదం నింపుకున్న మానస మురళి. కవి మతాల పరమార్థాన్ని వర్ణించాడు. అభ్యుదయ కవుల తిరస్కారాలకూ, ధిక్కారాలకూ చితికి నలిగిపోయిన ఇదేనా మళ్ళీ కవితావస్తువు? అంటే - నిజమే పాత వస్తువులనుంచి క్రొత్త విషయాల్ని చెప్పటమే కదా! కవిత్వం.

"ముస్లిమ్ ఆమీన్ అంటాడు
క్రిస్టియన్ ఆమెన్ అంటాడు
టిబెటిన్ హూమ్ అంటాడు
ఇండియన్ ఓమ్ అంటాడు
అన్నింటిలోనూ మకారమే
మమకారమే
ప్రతి మతంలోనూ ఒకే అభిమతమే
మానవత్వమే"

ఇక్కడ సంప్రదాయంలోని సత్యాన్ని సూచించాడు. మతాల కర్తవ్యాన్ని బోధిస్తాడు. పాతదనంలోని నవ్యతను ప్రకటించాడు. కవి సంప్రదాయాన్ని స్పృశించాడు.

'చక్రభ్రమణం'తో జీవిత పరమార్థాన్ని కనుగొంటాడు. 'కళాకారుడు - కవితా వస్తువు'లో నేటి సమాజ వాస్తవాన్ని ఆవిష్కరిస్తాడు. ఇవి అద్భుత కళాఖండమై ఆయన కవితా ప్రతిభకు హారతులిచ్చింది. ఐతరేయ బ్రాహ్మణ మంత్రాన్ని 'చరంశ్చరై వేతి'లో ఎంతో బలంగా చెప్పాడు.

సంప్రదాయం గురించి, దాని వెనుక దాగివున్న నవ్యత గురించి

"తరతరాల తేజోఫలాన్ని
నా గోసలాన్ని
ఎవ్వరేం చేయగలరు
ఎంతని సన్నాపగలరు
....లక్ష్యశుద్ధినుంచి కార్యసిద్ధినుంచి
నిర్విరామ చేతననుంచి ఆశయ సాధన నుంచి

నన్నెవరూ మరల్చలేరు
ఏ విధంగానూ కదల్చలేరు
నేను నేనే!"

అని కవి స్వయంగా వివరించాడు. సత్యాన్ని, నవ్యతను నింపుకున్న సంప్రదాయం నిత్యనూతన జీవన సౌజన్యాన్ని అందిస్తుందనే చెప్పొచ్చు.

సమాజం కాలుతుంటే కవి మాత్రం చేతులు ముడుచుకొని కూర్చోడు. మధుర భావనలను మొలకెత్తించేటి కుసుమ శరాలతో పాటు తన కవితాయుధ శరాలను సంధిస్తాడు. ప్రజల కష్ట నిష్ఠురాలతో కలసిపోతాడు. అందుకే ముక్కు మూసుకొని మారుమూల అడవిలో తపస్సు చేసుకోవడాన్ని వ్యతిరేకిస్తూ రాత్రి పగలూ నిరంతరం శ్రమించే సామాన్యుడిని మహర్షిగా కీర్తిస్తున్నాడు. మరో అడుగు ముందుకేసి అమర వీరులతో

"అన్నా
నీవు జారవిడిచిన
ఈ నెత్తుటి చుక్కను
ఎర్రటి ముత్యం చేసి
మన తల్లి మెళ్ళో వేస్తాను!"

అని కార్యోన్ముఖుడై ప్రతిజ్ఞ చేస్తున్నాడు.

ఈ కవి రచనలమీద శ్రీ పురాణం "శంకరుని ఫిలాసఫీ కనిపించినా, సిగ్మండ్ ఫ్రాయిడ్ అనాలిసిస్ ముందు నిలచినా వందల వేనవేల సాన్త్రి పుర్రెలు, సెంటిలియన్ల ఆయిన్‌స్టీన్ బుర్రలూ ప్రతిన్యసించలేని మెటీరియల్ నాలోని తత్వం!" అంటాడు కవి. ఇంకా ఎక్కువ ఆలోచనలు రేకెత్తించే పద చిత్రాలతో కూడిన మసాలా లోపల వుంది. ఇది కొత్త కవిత్వమని పొంగిపోవాలో అర్థం చేసుకోలేక అన్వయం కుదరక కుంగిపోవాలో పాఠకులే నిర్ణయించుకోవాలి. స్పష్టంగా వున్నట్లు కనిపిస్తున్నదాంట్లో అస్పష్టత, అయోమయంగా పైకి కనిపిస్తున్నదాంట్లో నిజాయితీ ఇందులో చూడవచ్చు" అని విమర్శ చేశాడు.

ఇందులో ఆయన అనుకున్నంత అస్పష్టతగానీ, అయోమయం గానీ ఏమీ లేదు. ఇది పాఠకుడికి ఒక దివ్యానుభూతిని, నిత్య చైతన్య ప్రవంతిని అందిస్తుంది. అనుభూతి ప్రధానంగా సాగిన సంకలనం ఇది.

ఒక మంచి కవితా సంకలనం చదివామన్న సంతృప్తి కలుగుతుంది. అందరూ కొని చదవదగిన కవితా సంకలనం ఇది.

**కృష్ణచైతన్య**

## అక్షరాంజలి (కవితా సంపుటి)

[రచన : ఉమ్మెత్తల, వెల : రూ. 5-00, ప్రతులకు: ఉమ్మెత్తల, సాహిత్యవేదిక, బ్రాహ్మణవీధి, వనపర్తి-509103]

ఆధునిక కవిత్వంలో స్పష్టత, అస్పష్టత అనే సమస్య ఎదురౌతూ తెలుగు పాఠకులను తికమక పెడుతున్నది. ప్రతిభావంతుడైన కవి తన భావాలను కవిత ద్వారా పఠితల హృదయాలను సూటిగా తాకేటట్లు చెప్పగలడు. భావం తాత్త్వికం కానీ, సామాజికం కానీ కవితా రూపాన్నిచ్చి ఇతరులు అర్థం చేసుకునే రీతిలో అందించగలడు ఇది చెప్పడం ఎందుకంటే ఉమ్మెత్తల ఈ 'అక్షరాంజలి'లో కవిత స్పష్టంగా తాత్త్వికమైనదీ, ఆధ్యాత్మిక రూపం కలదీను. ఉమ్మెత్తలపై రవీంద్రుని గీతాంజలి ప్రభావం ఉన్నదని పీఠికలో పురాణం సుబ్రహ్మణ్యంగారు చెప్పిన మాట యదార్థం.

ఈ సంపుటిలోని కవితల్లో జీవుని వేదన, ఆత్మనివేదన స్ఫుటంగా స్ఫురిస్తాయి.

ఇందుకు ఉదాహరణంగా కొన్ని పంక్తులు చూపబడుతున్నాయి.

"ఎన్నో బంధనాలతో
ఇహలోక క్షౌలిక్కి నన్ను ముడివేసి
త్రిప్పుతున్నావా ప్రభూ!
ఈ గోల నీ లీలట!"

"ఈ హృదయవీణ మీటి
ఆహ్లాద గీతాలను గానం చేయి ప్రభూ!"

"ప్రియతమా!
కరిగిపోయే ఈ కాలవాహినిలో
తరిగిపోయే ఈ వన గమనంలో
ఇంకా ఎంతకాలం ఈ అనంతయాత్ర"

"చివరకు నీ ఆలయంలో చిరుదీపమై
నిలచిపోవడమే కదా!
ఇక ఆలస్యమెందుకు ప్రభూ!"

ఉమ్మెత్తల కవితలో కొన్ని ఎబ్బెట్టుగా తోచే ప్రయోగాలున్నాయి. 'హృదయ గొంతుక' 'కమల రేకులు' 'పర్జన్య పిడుగులు' అనేవి. ముందు ముందు ఈలాంటివాటిని సవరించుకోవాలి.

**వేముగంటి**

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247